**SCHOLARS' EDITION.**

శ్రీ ర స్తు.

# శ శాం క వి జ య ము

శేషము వేంకటపతికృతము.



(*For Private Circulation only.*)

చె న్న పు రి :

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచేఁ

ప్ర క టి త ము.

1918.

శ్రీరస్తు.

# శశాంకవిజయము.

## పీఠిక.



ఇష్టదేవతాప్రార్థనాదికము.

విన్నాణపుగుబ్బచన్నుల నయా
రేగంబురాగుప్పి ము
క్తావల్లుల్ ఘటియించెదేమి శశికిన్
దారాప్రయుక్తంబనే
భావంబో యని పల్కుకల్మిచెలి సం
భావించుకాంచీపురీ
దేవుం డీవుతసీనయార్యమణికిన్
దీర్ఘాయురారోగ్యముల్. 1

చ. సరసివి గానఁ జక్కవలె చన్నులు గావివి పద్మినీకులా
భరణవు గానఁ దేనియరమె వాతెఱ గాదిది కల్మిచూపు పెన్
గరితవు గానఁ బొంబిలమె నాభిక గాదని నాన దీర్చు దే
వరయురమందుఁ గుల్కు రమ వంగలసీనయయింట నిల్చుతన్. 2

చ. కృతయుగమం దనంతుఁ డనఁ ద్రేతను లక్ష్మణసంజ్ఞ రేవతీ
పతి యన ద్వాపరంబునను భాష్యకృదాఖ్యఁ గలిం జనించి శ్రీ
సతిపతివై ఖరిన్ జననచాతురి చాతురి మీఱి నిత్యశే
మతఁ గను శేషుఁ డిచ్చుఁ గృప శాశ్వతభోగము సీనమంత్రికిన్. 3

చ. పులకలు మేనఁ గ్రమ్మఁ గనుమోడ్పుల వేమఱు మ్రొక్కుచాడ్పులన్
వలనుగ వారిజాక్షపద వారిజభక్తివధూవశుండ వై
కులికెదునీవు వేఱొకతెఁ గోరుదువే యని పల్కుసూత్రవ
త్యలికచమాటకున్న గుబలాధిపుఁ డీకృతినేతఁ బ్రోవుతన్. 4

మ. చలితస్వర్ణతుషారరౌప్యనగముల్ సంక్షోభితాంభోదము
ల్ఫలదాశానికురుంబముల్ పరిలుఠద్బ్రహ్మాండముల్ సైకత
స్థలితాంభోనిధిగర్తముల్ ఘుమఘుమత్రయ్యంతగ్రంథంబులౌ
పులుగున్ రాయలతెక్కమొక్కచలనంబుల్ బాపుఁ బాపంబులన్. 5

ఉ. ఓ మధుసూదనా యన నో హరీ యని తార్క్ష్యునీకన్న మున్ను ప్రా
ద్ధామెత వచ్చు శౌరికిని దా మును గాఁ జని తాంతదంతిర
ట్ధామతి నక్రమస్తకము చెక్కులు చేసినచక్ర మెప్పుడున్
క్షేమ మొసంగి చక్రపతిఁ జేయుత సీనయమంత్రిభాస్కరున్. 6

ఉ. హైమవతీశమాన్యము జితాసురసైన్యము నభ్రవిభ్రమ
స్థేమఘుమంఘుమధ్వనివిజృంభితజన్యము పాంచజన్య మా
త్మామలకీర్తికార్తికనిశాబ్జధుతారి నొసర్చు దైవత
స్వామినిభోగలీల గెలుపం గలపంగలసీనయార్యునిన్. 7

గీ కళుకుజగజంపువిడికెంపుకంకణంపుఁ
బలుకు లొలయంగ హరి కేలు పట్టు విడని
యమితభోగద యా గద యాగదాన
భరితు సీనార్యు సత్కళాభరితుఁ బ్రోచు. 8

ఉ. సోమసహోదరీరమణుసొంపులకెంపులచెక్కడంపుని
ద్దామెఱుఁగున్బరంజు గురు దాయరుదారిమదారిదారిత(?)
స్వామఱుఁ బ్రోచుఁ గాత కృప వేంకటరాఘువదీక్షితేంద్రవం
శామృతభాను సీనయ దయానయమానయశోభిశోభితున్. 9

చ. కలుములకొమ్మ క్రొమ్మెఱుఁగు గా నతజాతులు జాతులై తగన్
విలసిత వేంకటాఖ్యపృథివీధరశేఖరకృష్ణమేఘమం
దెలసిన శార్ఙ్గచాపము సమీహితవర్షము నించుఁ గాత వం
గలకుల మెల్ల వృద్ధి చెలఁగం గృతినేతకు సంతసంబుగన్. 10

శా. వాధూలాన్వయవార్ధివిష్ణుఁ బ్రతిభావర్ధిష్ణు వేదాంతవ
న్యాధిష్ఠానవసంతు శ్రీవరదగుర్వంతేవసంతున్ గవి
త్వాధారున్ గుణహారు ధీరు విగతాహంకారు వాత్సల్యధా
రాధారున్ గృతిసిద్ధికై కొలుతు శ్రీరామానుజాచార్యునిన్. 11

మ. వరలాలిత్యపదక్రమంబులను సద్వర్ణస్థితు ల్గాంచి శ్రీ
కరశాఖన్ గ్రహియించి యంగకలనాకాంతున్ కళ ల్మీఱఁగా

సురసాహిత్యరసానుభావములచే నుప్పొంగుచున్ వాణి మో
హారతిం దేల్చువిధాత సీనయకు దీర్ఘాయుష్య మిచ్చున్ గృపన్ 12

చ. తనశర మొక్కటే పదివిధంబులఁ దేజరిలన్ ధనుర్గుణం
బనుపమశబ్దరూఢిని సహస్రముఖంబులఁ బల్కుచుండఁ దే
రనిశ మనంతరీతిఁ బొలుపారఁ బురంబుల నోర్చిపేర్చుజో
దనవరతంబు వైరివిజయంబు నొసంగుత సీనమంత్రికిన్. 13

సీ. నీతోడిపొందిక ల్నాతరమా యెంచ
జాతు లేర్పఱిచినజాణ వాదు
వీనాఁట నీపాటి నే నెచ్చటను గాన
ఘనరాగసంగతి గాంచితి బళి
మోహనలీలచే మొనసి బాగైతివి
నయము లుపచరించు నటన నీది
కాంచి ఘంటారవకలన నిన్మెచ్చెద
శ్రుతి వియ్యముగ నను కృతివి గావె

గీ. యనుచు పతితోడ సరసోక్తు లాడునట్టి
వాణి శుకపాణి పికవాణి వనదవేణి
సీనయముఖాబ్జపీఠికాసీన యగుచు
శ్రీనయసమృద్ధి వర్ధిల్లఁ జేయుఁ గాత. 14

ఉ. పుట్టినయింటి కెంతయు సమున్నతి చల్లటనంబు మీఱఁగా
మెట్టినయిల్లు గహ్వరము మీఱియు వెండిఁ బ్రసిద్ధి కెక్కఁ జే
పట్టినవల్లభుం డతనుభాసితలక్ష్మి తగన్ మదద్విపం
బట్టితనూభవుం గనినయంబ కృతిప్రభుఁ బ్రోచుఁ గావుతన్. 15

ఉ. దంతనిశాతహేతి నిరుదంతనిశాచరకోటిఘాటిదు
ర్దాంతనియంతవిక్రముని దాంతుని శాంతనిశాంతమానసున్
సంతతభక్తిమద్భవనవసంతుని గాంతసుకీర్తి నెంతయున్
మంతుకు నెక్కువీరహనుమంతుఁ దలంతు నిరంతరంబుగన్. 16

మ. హరజూటానటదాపగాంబుఝరి తుండాగ్రంబునం బీల్చి సా
దరతం దజ్జలజంబు తల్లికి సముద్యత్పుష్కరాకృష్టసా
గరగౌర్యగ్రజకంధరాంతరఫణిగ్రైవేయకం బద్భుత
స్ఫురణం దండ్రి కొసంగి ముద్దు గొను దేవుం డిచ్చు నిర్విఘ్నతన్.

సంస్కృతకవిస్తుతి.

ఉ. ప్రాకటసత్కవిత్వపరిపాటిని లోకము వారెఱుంగఁగాఁ
జేకొనఁ జేసి వేదములచిక్కులు దీసి మృదూక్తి సాహితీ
వ్యాకృతి వాగ్వధూటి త్వమహ ష్మని వా దొనరించ మించు వా
ల్మీకిఁ దలంతు వ్యాసుని నమింతు నుతింతును గాళిదాసునిన్. 18

ఆంధ్రకవిస్తుతి.

ఉ. నన్నయభట్టు మైత్రివలన న్నయ మొప్ప గణించి తిక్కనన్
బన్నగభూషణాఘనవిపన్న గభీరవచోనియుక్తికై
ము న్నతిఁ జేసి యెఱ్ఱనసమున్నతి యుక్తిఁ దలంచి శేముషీ
మన్నమనీయులం గవుల మన్ననఁ గావ్యనిరూఢి కెంచెదన్. 19

కుకవినింద.

మ. పరపాకంబులఁ గోరి యెందుకయినం బ్రాల్మాలి వృత్త్యర్థ మై
యొరుపాదంబుల నంటి యర్థకలనాయోగంబు లేమి న్నిరం
తరచింతన్ దగురీతి దోఁపక వివర్ణత్వంబునన్ దీనులౌ
చరులం జూచి సుదృగ్జనంబు రసవన్నర్మోక్తులం బల్కునే. 20

కృతిబీజము.

వ. అని యివ్విధంబున నిష్టదేవతావందనంబును శిష్టకవిజనాభినందనం
బును దుష్టకవినిందనంబునుం గావించి శృంగారభంగతరంగితంబును
మకరందబిందుసందోహ నిష్యంద మాధురీసాధురీత్యనుబంధ సుగంధి
పదనిబంధబంధురంబుగా నొక్కప్రబంధంబు రచియింప నెంచి
యుండునవసరంబున. 21

సీ. వంగలకులకుంభవారాశి జనియించి
కన్నుల కామోదగరిమ నించి

యందంద సకలకలాభ్యాసి యై మించి
జైవాతృకత్వప్రశస్తి గాంచి
కౌముదీప్రజ్ఞానగౌరవంబు వహించి
సతతంబు కవిసమాచరణ మించి
యి మ్మైనగానామృతమ్ములు గురియించి
యరికులంబులగర్వ మపహరించి
యతిశయితలక్షణాఢ్యత నధిగమించి
ధాత్రి రామానుజమహాచరిత్రఘటన
కలనఁ గువలయవికసనకళ ధరించి
సీనఘనకుండు సర్వజ్ఞశేఖరుండు. 22

వ. వెండియు నఖండమండితమహీమండలమండనాయమానపాండ్యమధు
రాధరాఖండలశ్రీవిజయరంగచొక్కనాథమహీనాథకృపాకటాక్షవీక్ష
ణానుక్షణవర్ధమానపరబలార్ణవమంథశైలాయమానగంధమంధర
సింధురఘటాపవనజవనసింధుకాంభోజగంధర్వకోటీసమాటీకనచటుల
రథచ్ఛటావీరభటసహస్రకిరణకిరణోపమాన మాణిక్యసేవాసమాగ
తగాణిక్యశరశ్చంద్రచంద్రికారుచిరుంద్రచంద్రశాలాసౌధసంబాధమ
ణికుట్టిమహిరణ్మయద్వారబంధబంధురమందిరారావగ్రామవివిధచీని చీ
నాంబరనవరత్నఖచిత భూషణపేటికాచేటికాహాటకాందోళికాశిబికా
భద్రాసనడోలికాప్రముఖనిఖిలసంపత్పరంపరాకంపితనిలింపనాయ
కుండును నాశ్రితాభీష్టదాయకుండును బాదారవిందవందనానందిత
చతురంతసామంతమహీకాంతమంత్రిమండలుండును నిజకథాకల్పిత
విద్వత్కర్ణకుండలుండును నతులవితరణవిలసితహసితని తకరకల్పకశిబిక
ర్ణఖేచరుండును శ్రీరంగనాథకరుణాకటాక్షగోచరుండు నగ్నిష్టోమాతి
రాత్రవాజపేయపౌండరీకధర్మపౌర్ణమాసచాతుర్మాస్యపశుబంధప్రకృతి
వేదోక్తసత్కర్మసమారాధితమాధవకృపాతరంగితాపాంగ వీక్షణా
లంకార వేంకటరాఘవదీక్షితేంద్రతిరువేంగళమ్మబహుజన్మతపః పరి
పాకశుభావతారుండును కాంచనాచలధీరుండును సేతుహిమాచల

మధ్యవర్తి సమస్త బాంధవజనతామనోరథప్రపూరణకుతూహలహల
హాలికాసమాకలితచిత్తుండును విహితకర్మాచరణవృత్తుండును నిత్యా
న్నదాన సంతర్పితసకలభూసురుండును నప్రతిహతప్రతాపభాసురుం
డును సత్యభాషానవీనహరిశ్చంద్రుండును సజ్జననయనకువలయపూర్ణ
చంద్రుండును ఘననయదేశీయకమనీయ గ్రామమూర్ఛనాబహువిధ
విన్యాస ధన్యాసమాన తాళమాన నానానూనతాన వితానభంగీతరం
గితసంగీతవిద్యావిశారదుండును వీణానినాదవినోదభూలోకనారదుం
డును వాదిమదగజప్రపంచపంచాననగర్జావిస్ఫూర్జిత తర్క వేదాంత
వ్యాకరణశాస్త్ర సమ్మతానర్గళోపన్యాసవైఖరీ వాగ్వధూనాథుండును
నాథమునియామునప్రముఖపూర్వాచార్యచర్యాభిరాముండును
రామానుజ దివ్యచరిత్రప్రబంధసాహితీమోహితానల్పసంతోషవిశం
కటవేంకట నగాధీశ్వరుండును నీశ్వరాంఘ్రికంజాత శింజానమంజీర
మంజుల ఝాళంఝుళీనిగుంభన స్తంభన గంభీరసంభాషణ విస్మితనిఖిల
సభాస్తారుండునునిరుపమనీతివిస్తారుండును తారపటీరతుషారధరణీధర
సానుచరశబరీవిబుధనీలకబరీనిబిరీసవచనరచనాసముద్ఘాటితశశిమకుట
రజతగిరికటకకపటకిటిధరణీభృదురగవరసురతురగశరదకుందశరదరవిం
దవిమల ధవళగరుదమలకమలకుముదసముదయసమిదశసవిస్ఫూర్తికీర్తి
గంగాతరంగిణీప్రక్షాళితమేదినీపంకుండును వంగలాన్వయపాలనాం
కుండును నయవినయశమదమజ్ఞానవిజ్ఞానకృతజ్ఞతాభిజ్ఞ వరదగురు
చరణ పరిచరణకరణశరణాగతరక్షణవిచక్షణతాసత్యసౌశీల్యవాత్స
ల్యమాధుర్యగాంభీర్యౌదార్య చాతుర్యశౌర్యధైర్యస్థైర్యమార్దవా
ర్జవశుచిత్వకృతిత్వప్రముఖనిఖిలసుగుణమణిగణరోహణాచలుండును
నిశ్చలుండునుపాసితవిబుధయూథుండు నూర్జితప్రబోధుండునుసరస
పదపద్యగద్యరచనాభోజుండును సంతతసుముఖాంభోజుండును నైన
సీనయామాత్యబిడౌజుం డొక్కనాఁడు పరిచితశబ్దతర్కమీమాంసు
లైనవిద్వాంసులును వాఙ్మాధురీధురీణభారతీరమణీమణీరమణీయమణి
నూపురరవు లైనకవులును నఖిలజనశ్రవణానందదాయకు లైనగాయ

కులునువివిధవిచిత్రతానవితానతాళపాళికానిసర్గసర్గప్రవీణవీణాపాణి
కు లైనవైణికులును హర్షవిస్మయకళారంగంబు లగుప్రసంగంబులఁ
బ్రొద్దుపుచ్చుచు నుండ నిచ్చలంపుఁబాలగచ్చుల మెచ్చులు మీఱు
కొలువుకూటంబునం గొలు వుండి. 23

క. నను రంగేశ్వరపదయుగ
ఘనతరభజనానిరూఢకవితాసామ్రా
జ్యుని శేషము కృష్ణసుధీ
తనయుని బిలిపించి పలికె దయ దయివాఱన్. 24

చ. అసదృశభక్తి సద్గురుకటాక్షము గాంచి సమంచితాత్మతన్
బిసరుహమాకరందరసపేశలకౌశలవన్మృదూక్తులన్
రసికుల కింపుగాఁ గృతిపరంపరలన్ రచియించి కీర్తిచే
నెసఁగితివయ్య వేంకటపతీ బళి శేషమువంశసత్కృతీ. 25

క. నీ విప్పుడు మాపేర శు
భావహము శశాంకవిజయ మనెడుప్రబంధం
బావిష్కృతశృంగారతఁ
గావింపుము రసికహృదయ కౌతుక మెసఁగన్. 26

వ. అని సగౌరవంబు గా నానతిచ్చి కర్పూరతాంబూలంబును కనకాం
బరంబు లొసంగి బహూకరించుటయు నేనునుం బ్రమోదభరిత
మానసుండ నై యిమ్మహాప్రబంధంబున కారంభించి కృతినాయకుని
వంశావతారక్రమం బభివర్ణించెద. 27

## కృతిపతివంశావతారము.

సీ. సుద్దంపుటద్దంపునిద్దంపుఁజెక్కిలిఁ
బాలసంద్రపుఁబట్టి పట్టి నొక్కఁ
దులకింపుబలుకెంపుతలకింపుజిగిమోవిఁ
బంటలవాల్గంటి గంటు సేయ
నెలకూనపాలు పైన యళికాన నీళాన
తిలోకతిలకము తిలక మునుప

రతి సొక్క మతిఁ దక్కి శ్రుతిచక్కి గోదాఖ్య
మంజువాణీమణి మణిత మొసఁగ
గీ. నఖిలశృంగారములకు నిమ్మయి వెలుంగు
భువనస ప్తద్వయీగణ్యపుణ్యగంధ
సముదితసుఖంబు శారదసమయవికచ
పంకజసఖంబు శ్రీరంగపతిముఖంబు. 28

ఉ. అందు జగన్ను తాగమసహస్రదృగాశయలబ్ధవర్ణ్య ల
స్పందమహామహావాంతరవిషాదితపుణ్యజనాగ్రణుల్ సదా
నందనపుణ్యగంధసుమనఃపరిశోభితు లాది నుద్భవం
బొందిరి భూసురుల్ శమదమోదయభాసురు లచ్యుతాశ్రయుల్.

క. చిత్రము తద్ద్విజకులము ప
విత్రముగా సంభవించె విధిమానసమం
దత్రిగుణప్రతిబంధుం
డత్రియుగపదాబ్జభక్తుఁ డత్రి ధరిత్రిన్. 30

శా. మాయావాదిభుజంగభంజనగరుత్మంతుండు శిష్యావళీ
శ్రేయస్సాగరపూర్ణచంద్రుఁడు త్రయీసిద్ధాంతసింహాసన
స్థాయిశ్రీయతిసార్వభౌమపదపద్మధ్యాయి తత్త్వాన్వితుం
డైయాఖ్యన్ వెలసెన్ కిడాంబికులజుండై యత్రిగోత్రంబునన్. 31

క. వేంకటకృష్ణయ ఫణిప
ర్యంకపదాబ్జప్రసన్నుఁ డాచార్యకులా
లంకారుఁ డాహిమాచల
లంకారమణీయయశుఁడు రహిఁ మీఱె మహిన్. 32

సీ. చెలువంబుచే జీరుచిలుక తేజివజీరు
విమలోక్తిచేఁ జేరు విరులచేరు
కరుణాపరత నమ్ము గరళకంధరునమ్ము
నతిబలంబున మీఱు నలసమీరు

ఘనధైర్యరమ గట్టు కడవన్నె బలుగట్టు
స్థిరశక్తిచే మారు శివకుమారు
తెలితరిచే నంటు కలువకన్నియ నంటు
పటుదత్తి నెరసూను భానుసూను
గీ. మంత్రిమాత్రుండె యాతఁడు దుర్మంత్రిగంధ
సింధురోదగ్రజాగ్రన్నృసింహమూర్తి
చెంజి వేంకటన్నపతి సాచివ్యకారి
కీర్తిగుణహారి వేంకటకృష్ణశౌరి. 33
చ. నలుదెసలందు భూమిలలనామణిహారము లగ్రహారముల్
వలనుగఁ జేసి కీర్తి గనుపంగల వేంకటకృష్ణమంత్రిరా
ట్తిలకుఁడు శౌర్యసంపదవధీరితకృష్ణు విలాసకృష్ణు వి
ద్యల మునిరాజకృష్ణుఁ గనె నాత్మజరత్నము పెద్దకృష్ణునిన్. 34
ఉ. హాత్తినకీర్తికాంత విపులాంబరలాలనఁ గల్మి నెచ్చెలిం
జిత్తె మెలర్చుచూపులను జిత్రవిలాసకళాకలాపవి
ద్వత్తను భారతీయువతిఁ దన్పుచు శ్రీ పెదకృష్ణమంత్రిలో
కోత్తరవర్తనం దనరియుండియు దక్షిణలీలఁ గన్పడున్. 35
క. అతనికి కొప్పెరకృష్ణయ
సుతుఁ డయ్యెఁ దదీయహేతి శూరాలివధూ
వితతులకొప్పెర గొనుటక్
క్షితి కొప్పెరకృష్ణుఁ డన సుకీర్తిం దనరెన్. 36
సీ. ధార్మికలక్ష్మీనిదానంబు దానంబు
గుణయుక్తబంధుసంకులము కులము
భువనసమ్మానితాభోగంబు భోగంబు
దినదినత్యాగసాధనము ధనము
రుచిర సౌమ్యగుణానురూపంబు రూపంబు
ఘనశుభలక్షణాకరము కరము
మహితకౌరవోప్యపమానంబు మానంబు
వరమంత్రికోటీరపదము పదము
గీ. కలితసాఫల్యకవిపచోగణము లతని
గుణము లెన్నుట కొకవేయుఫణము లున్న

నలవి యగు మంత్రిమాత్రుండై యరివిదారి
విష్ణుమతధారి కొప్పెరకృష్ణసూరి. 37

క. రంగన్నిజభుజశక్తి
న్వేంగలు లై రిపులు సమరవీథి న్బఱవన్
వెంగన్న యట్టు వంగల
వెంగన్న నతండు గని యె వేడుక మీఱన్. 38

సీ. తనకీర్తి నిఖిలవిద్వన్మనఃకైరవ
నిచయంబులకు చంద్రరుచులు గాఁగఁ
దనప్రతాపంబు శాత్రవదర్పనీహార
మండలంబునకు నీరెండ గాఁగఁ
దనయనారతభూరిదానంబు యాచక
సస్యపాళికి నభస్యంబు గాఁగఁ
దనచరిత్ర మశేషధార్మికచారిత్ర
పంక్తులకును మేలుబంతి గాఁగ

గీ. నమరు సన్మార్గచారిజిహ్వాద్విజిహ్వా
ఖండనాంకుండు వినతోపకారశాలి
సామఘనపక్షుఁ డవదాతచారుముఖుఁడు
చెలఁగు వెంగన్న ద్విజకులశ్రేష్ఠుఁ డెన్న. 39

మ. అలవెంగన్నకుఁ గూర్మితమ్ములు ఘనుం డౌకొప్పెరామాత్యుడున్
కలితాధ్వర్యుఁడు కళ్లకృష్ణుఁడును రంగప్పయ్య తిర్వేంగళ
ప్పలసత్కీర్తిఃహారుఁ డార్యుఁ డనుకంపాధుర్యుఁ డాచార్యుఁడున్
లలితు ల్వత్తురు ధాత్రి వంగలకులాలంకారులై యేవురున్. 40

క. మోచారుచిపరిభవకృ
ద్వాచారుచిరన్ శుచిత్వవర్ధిష్ణు యశ
శ్శ్రీచారుసత్కులీన
న్నాచారు వరించె వేంగనప్రభుఁ డెలమిన్. 41

క. వెంగనకృప నాచారమ
యంగన యలబుచ్చికృష్ణయార్యున్ శేషా
ర్యుం గస్తురి నాదివరా
హుం గనె గాయత్రి నిగమయుగయుగముఁబలెన్. 42

సీ. ఏజగద్బంధుం డహీనతేజస్స్ఫూర్తిఁ
దమ్ముల కామోదదాయి యగును
నేపురుషోత్తముం డినమండలీపూజ్యు
మానుఁడై శుభదశాత్మకతఁ జెందు
నేవిబుధాధ్యక్షుఁ డితసిద్ధగంధర్వ
విద్యాధరశ్రేణి వేడ్కఁ బ్రోచు
నేగోత్రనాయకుం డిలకు నాధార మై
విష్ణుపదాశ్రయవిఖ్యాతి కాంచు
గీ. నతఁడు లోకతమోహరుం డచ్యుతాఖ్యఁ
దంచితసుధర్ముఁ డమితసత్త్వాశ్రయుండు
భూష్ణుఁ డుజ్జ్వలకీర్తివర్ధిష్ణుఁ డలరు
బుచ్చికృష్ణఘనుండు సత్పుణ్యధనుఁడు. 43
ఉ. దానవవైరి వైభవనిదానవధూమణిఁ బెండ్లి యైనటు
ల్మానవతీలలామ ముఖమండలనిర్జితసోమ రూపలీ
లానవపద్మధామ నవలా మధుసూదనపాదపంకజా
సీనమనోమిళింద యగుసీనమ నయ్యనఘుండు చేకొనెన్. 44
ఉ. పండితమండలీహృదయపంకజభానుఁడు బుచ్చికృష్ణయా
ర్యుండును సీనమారమణియుం దొలి నోమిననోముపంటగా
హిండితకీర్తియుక్తి జనియించెను వేంకటరాఘవాధ్వరీం
ద్రుండు విభాసమానగుణరుద్రుఁడు వంగలవంశచంద్రుఁడై. 45
సీ శరదభ్రవిభ్రమాస్పదవాజపేయాత
పత్రంబు ఫణిఫణాపటలి గాఁగఁ
సతతరక్షోపాయచణము లై భుజముల
శంఖచక్రంబులు చందు మీఱ
మిత్రనందకపుష్టి మైత్రావరుణయష్టి
కౌమోదకీమోదకలనఁ జూప
మఖవిశేషప్రాప్తమణికుండలంబులు
మకరకుండలము లై మహిమఁ దెలుప
గీ. సజ్జనానందకృత్సదాచరణజనిత
కీర్తిగంగాతరంగిణీస్ఫూర్తి నింప

లలిత తిరువేంగళమ్మ శ్రీలలన గాఁగ
నలరు వేంకటరాఘవయజ్వశౌరి.

ఉ. ఆశువిశేషణప్రతిభ నార్భమహాబడబాగ్ని చేఁ బయో
రాశి శమించిపోమికి ధర న్గత మేమొకొ నిచ్చనిచ్చలు
న్వాసట లేక యన్న మిడు వేంకటరాఘవయజ్వయింట మృ
ష్టాశనదానవార్ధ్యసహాయత యాయత మై చెలంగఁగన్.

సీ. ఋగ్యజుస్సామాదిరీతు లేర్పడఁజేసి
భాట్టశాలలఁ బెట్టె వ్యాసులట్లు
ప్రాకారమణిమంటపాదికైంకర్యము
ల్బరకాలుగతి రంగపతి కొనర్చె
ఛాయలు గల్పించె జలధరప్రౌఢిమ
సాలలు వేయించి జనులకెల్ల
బుధులకు నవరత్నభూషణాంబరములు
కల్పవృక్షంబులకరణి నొసఁగె

గీ. వెలయ నారదవరదున కలఘుభక్తి
నిష్టభోగంబు లొసఁగె ఫణీంద్రులీల
భజనతోషితఖగసార్వభౌమవాజి
సుగుణ వేంకటరాఘవసోమయాజి.

క. శ్రీమద్వేంకటరాఘవ
సోమాసిమహాకుల ప్రసూత సుకీర్తి
స్తోమ తిరువేంగళమ్మక
భామారత్నమును ధర్మపత్నిగఁ బడసెన్.

సీ. రుక్మిణి కమనీయరూపసంపదచేత
సత్యభామ మృదూక్తిసరణివలన
ఋక్షజాతాభిఖ్య యిలశ్యామ యౌటచే
లక్షణ యగు శుభలక్షణముల
మిత్రవిందయు బాంధవత్రాణమహిమచే
భద్ర యే గమనసౌభాగ్యకలన
సరవిఁ గాళిందియె సాధుజీవనయుక్తి
రహి సుదంతయె కుందరదన యగుట

గీ. యనఘ వేంకటరాఘవయజ్వశౌరి
చిత్త మలరంగ మెలఁగుచు శీలవృత్తి
పరమపాతివ్రతీనిష్ఠ పరఁగ ధరణి
ననఁగ తిరువేంగళమ్మ కుందనపుబొమ్మ. 50

గీ. ఆమహాధ్వరి యాసాధ్వియందు శేష
కృతినిసీసేంద్రు వేంకటకృష్ణధీరు
ఘనుని వేంకట వేరమాళ్లఁ గాంచి వెలసె
నలువ నాల్గుమొగంబులఁ జెలఁగినటుల. 51

సీ. తనదుసర్వజ్ఞత కనుగుణంబుగఁ దాల్చె
గంగోదకం బుత్తమాంగమునను
తన శేషసంజ్ఞకుఁ దగఁ దండ్రియే దైవ
మనుచు శుశ్రూషలు తనరఁ జేసెఁ
దనకళాశాలిత కనురూపముగ యశ
శ్చంద్రిక ల్నిలిచె దిక్సంధులందుఁ
దనలోకబాంధవత్వమునకు నీడుగా
వేదమయుం డని వినుతిఁ గాంచెఁ

గీ. పురుషసింహత్వవిఖ్యాతి పొసఁగ నఖర
లీల హైరణ్యదానైకలోలుఁ డయ్యె
నతఁడు సామాన్యుఁడే వంగలాన్వయుండు
శిష్టసన్నుతజనుఁ డైన శేషఘనుఁడు. 52

క. ఆరసికుననుజుఁ డురుబల
వైరికుభృత్పవిభేది వల్గుసుధర్మా
ధారుఁడు శ్రితమందారుఁడు
శ్రీరమ్యుఁడు సీనమంత్రి జిష్ణుఁడు వెలయున్ 53

సీ. తనదర్శనస్ఫూర్తి తనదర్శనస్ఫూర్తి
కరణి శ్రీధామైకగరిమఁ బూనఁ
దనయుక్తివైఖరి తనయుక్తివైఖరి
మహి నహీనప్రౌఢి మంతు కెక్కఁ
దనయాభిరూప్యంబు తనయాభిరూప్యంబు
గతి మహిళాశ్చర్యకరము కాఁగఁ

దనదానచాతురి తనదానచాతురి
దారిఁ బ్రత్యర్థివర్ధనమొనర్ప
గీ. ఘనత గాంచును శిబికర్ణకామధేను
కల్పకద్రుమములై మర్థ్యకారి భూరి
వితరణామోదితాశేషవిబుధసుకవి
శిష్టనుతిహారి వంగలసీనశౌరి. 54
శా. లోకాలోకము పాదు సప్తజలధుల్ తోయంబు శేషుండు వే
రాకు ల్దిక్కులు హైమశైలము పటీరాగం బుపఘ్నంబులై
యాకాశం బురుకాయమానముగ సొం పౌ తద్యశోవల్లికిన్
రాకాచంద్రుఁడు పండు తద్రసభుజుల్ రక్షింతు రాసీనయన్. 55
సీ. సకలసామాజికసంఘంబుమదికి నిం
పుగ బృహస్పతిలీల బుద్ధిఁ దెల్పుఁ
గార్యఖడ్గక్రియాఘటనాఘటనశక్తి
దొరను ప్రమోదంబుఁ బొరయఁజేయు
జననంబు మొదలుగా సకలజనోపకా
రంబు వ్రతంబుగా రహిఁ నొనర్చు
జనకునివైఖరి జ్ఞానకర్మప్రప
దనభక్తిగురునిష్ఠ లొనర మెలఁగు
గీ ధర నుపనయనకన్యకాదానశతము
లన్నదానంబు జలదాన మాదియైన
దానము లొసంగుఘనుఁ డభిమానధనుఁడు
శ్రీపతినిభుండు వంగలసీనవిభుఁడు. 56
శా. హాహాహూహూలు గానగర్వమున హాహాహూహూ లంచుఁ దుస్స్వరా
రోహప్రక్రియఁగాఁ దురంగతను లై రూప్యంబు నానన్ వృథా
సాహంకారులు మర్త్యగాయకులు జోడా నీకుఁ బాండ్యేశ్వర
స్నేహాలంకృత! వంగలాన్వయమణీ! సీనా! కవిగ్రామణీ.! 57
ఉ. మానుజరూపమన్మథ ! రమానుజకీర్తివతంసితాశ ! భీ
మానుజశౌర్య!†నీవు విని మాను జయింతువు దత్తి నీతి రా

† 'నీవును సమాను జయింతువు నీదుదంతి', 'నీవు వినుమానుజయింతువు దత్తి
నీది' అని పాఠములు. అర్థము చింత్యము.

మానుజనుశ్చరిత్రకృతి మానుజనాథుల నీవు హెూభర
మ్మాను జగానఁ గానము సమాను జనుల్ భువి నీకు సీనయా. 58

చ. అని జను లెన్న వన్నెఁ గని యాచకవాచకమేచకీచ్ఛటా
ఘనఘనసంగవైఖరిని గామితకామితసృష్టి నించుచున్
దనరువలంతి పాండ్యవసుధావసుధామునిమన్నన ల్వహిం
చినదొరలందు మేటి యగు విమ్మనమంత్రికిరీటి వర్ధిలున్. 59

చ. స్ఫుటపటిమార్భటీనినటిషుస్మరజిన్మకుటీకుటీసుధల్
ఘటముల గుమ్మరించి రస ఘుమ్మన రాట్సభ జంత్రగాత్రముల్
పటుమతి విన్కిఁ జేయుచు శిలాపటలిన్ సలిలంబు చేసి వేం
కటపెరుమాళ్ళధీరుఁడు జగన్నుతుఁడౌ సరసత్వ మేర్పడన్. 60

క. ఇళయపెరుమాళ్లు రాముని
వెలయన్ భజియించురీతి వేంకటపెరుమాళ్
సలలితగీతకళానిధి
విలసితమతిఁ గొలువ సీనవిభుఁడు చెలంగున్. 61

చ. జనకునకున్ మది న్ముద మెసంగఁగ భూస్థలజాతయై మహా
వనమతి గాంచి పుణ్యజనవర్ధనతం దగి రామభద్రుఁడే
యనఁ దగు సీనయన్ బరిణయం బయి సీతమ శాస్త్రవాసనా
ఘనులనుబుత్త్రులం గనె నఖండితకీర్తి జగంబు నిండఁగన్. 62

చ. కులమును శీలమున్ విభునికూరిమి బాంధవపోషణంబు ని
శ్చలమృదుసూక్తి సత్త్వమును జక్కదనంబును గల్గి యొప్పుచున్
సలలితచర్య భర్తృపదసారసభక్తిజితార్య యార్య రం
జిలు నలసీనయార్యసతిసీతమ శీతమయూఖకీర్తియై. 63

క. అనుజుఁడు లక్ష్మణుఁ డై తగ
ననయభరతకలన నిత్యశత్రుఘ్నమతిం
దనరుచు సీతాసతితో
మను సీనయ రామచంద్రమంజులయశుఁడై. 64

సీ. సప్తకులాచలీసౌధదేశంబుల
నెందాఁక నవని యానంద మొందు
నవనీవధూమణిహారమణిచుకాంచి యై
యంభోధి యెందాఁక నలరుచుండు

సంభోధిశయనుఁడై యజుల సృజించుచు
నెందాఁక శ్రీహరి యెలమిఁగాంచు
శ్రీహరియురమందె శృంగార మెసఁగంగ
నెందాఁక యిందిర యింపు మీఱు
గీ. వెలయు నందాఁక వంశాభివృద్ధి గల్గి
సకలసంపత్పరంపరా సాంద్రభోగ
బహుసుపుత్త్రాయురారోగ్య భాగ్యగరిమ
శేముషీ దేవతామంత్రి సీనమంత్రి.

షష్ఠ్యంతములు.

క. ఏవంవిధగుణమణికిన్
శ్రీవంగలకులపయోధిచింతామణికిన్
ధీవిజితాదిమఫణికిన్
శ్రీవైష్ణవమతకువలయశీతలఘృణికిన్.
క. శ్రీమన్నరురంగాధిప
నామాంకితగేయకల్పనాస్తుతమతికిన్
రామానుజవిజయాంకగ
వీమధురసమోదమాన వేంకటపతికిన్.
క. ఆహవసాహసశౌరా
షాహునకున్ సిద్ధవిజయసన్నాహునకున్
స్నేహాబహూక్ృతి సుకవి
వ్యూహునకు వసంతవితరణోత్సాహునకున్.
క. వేంకటరాఘవమఖికుల
పంకజభానునకుఁ గురునృపతిమానునకున్
గంకటవత్సేనునకు ని
రంకుశదానునకు సజ్జనాధీనునకున్.
క. వాధూలవరదదేశిక
సాధిష్ఠకృపాకటాక్షసంపాదితమే
ధాధీశ్వోభయవేదాం
తాధికసామ్రాజ్యసంభృతానందునకున్.

# ప్రథమాశ్వాసము.

---

## కథాప్రారంభము.

65 వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నాయొనర్పం బూనినశశాంకవిజయం
బనుమహాప్రబంధంబునకుఁ గథాక్రమం బెట్టి దనిన. 1

గీ. వెలయు ధరలోన నుజ్జ్వలవిమలహృదయ
పద్మపద్మాసమాశ్లిష్టపరమపురుష
సంతతధ్యానసానంద సాధుమాని
66 నవ్యకీర్త్యావృతదిశంబు నైమిశంబు. 2

ఉ. ఆవనసీమ శౌనకమహామునిముఖ్యులు తాపసోత్తము
ల్పావనసత్కథారసవిభాసిముఖాబ్జవినీతు సూతు సం
భావనఁ జేసి యిట్టు లని పల్కిరి సద్ద్విజరాజితోర్జిత
67 శ్రీ విలసిల్లుచంద్రకథ చిత్తమున న్వినఁ గోరువారలై. 3

ఉ. పంకజగర్భునంశమున భాసిలి యిద్ధర నత్త్రి కెట్టు లే
ణాంకుఁడు పుట్టె నాతఁడు బృహస్పతికిన్ సతి యైనతార ని
68 శ్శంకత నెట్లు పట్టె నది సైఁప కెదిర్చినదేవతాతతిన్
గొంకక యెట్లు గొట్టె విన గోరెద మాకెఱుఁ గెల్లఁ దెల్పుమా. 4

క. అన విని సూతుఁడు మనమున
వినయం బిగురొత్త మునుల వీక్షించి నట
69 త్కనకాచలచాపజటా
ఘనగాంగతరంగభంగి గా నిట్లనియెన్. 5

మ. కలఁ డంభోరుహగర్భమానససుధాకల్లోలినీనాథని
స్తులమందారమహీరుహోత్తఫలసత్పుత్త్రీభవద్బ్రహ్మవి
71 ష్ణులలాటాక్షకథావిచిత్రితజనస్తోమస్తుతోద్యద్యశ
స్తిలకాలంకృతధాత్రి యత్త్రివిలసత్తేజోధురాపాత్రియై.

చ. మునికులచంద్రుఁ డాతఁడు ప్రమోదముచే ననసూయ భక్తిమై
తన దగుపేరు నిక్కముగఁ దాలిమి మీఱఁగ సేవ సేయఁగా
ననుదినముం జపంబు తప మధ్యయనంబు వ్రతంబు లగ్ని సే
వన మతిథిప్రయుక్తవరివస్యయు మీఱఁగ ధర్మనిష్ఠుఁ డై. 7

ఉ. కొన్ని దినంబు లుండి తనకున్ సుతలాభము గల్గురీతికై
పన్నినకోర్కి చిత్తమునఁ బాదుకొనన్ వనితాసమేతుఁడై
కిన్నరకామినీమృదులగీతవినూతనజాతపల్లవా
చ్ఛిన్ననికుంజమంజువనచిత్రము గాంచెఁ దుషారగోత్రమున్. 8

క. కాంచి యుదంచితవిస్మయ
కంచుకితమనస్కుఁ డగుచు కడు వేడుక నా
చంచలలోచనఁ గనుఁగొని
యంచితవాగ్వృత్తి నిట్టు లనుచుం బలికెన్. 9

సీ. పుడమి వింతలు చూడ నడరుకోరిక గన్న
మిన్నేరు దిగుటకు మెట్టు దొరకె
జన్నాన బన్నంబుఁ గన్నసతీదేవి
పుట్టినిల్వారుసలపట్టు గాంచె
నొండొంటితో రాయుకొండలజగడంబు
రహిఁ దీర్చి యేలంగ రాజు గలిగెఁ
దనయకుఁ దగుభర్త ననయ మారయు హాట
కాద్రికిఁ దగునట్టియల్లుఁ డబ్బె

గీ. గండు మీఱిన చండాంశు నెండవలన
నుండ వెఱచినమంచుకు దండ గలిగె
నిందుబింబాస్య యీపర్వతేంద్రువలన
నెంచి యీతనిమహిమ వర్ణింపఁ దగమె. 10

క. ధర మొన వై తిరిగెడుతఱి
గిరు లెల్లను దాని కితని క్రేపుగఁ జేయన్
దొరసి చను ద్రావ నెలవుగఁ
దొరఁగిననుదు వనఁగ మంచు దోఁచె లతాంగీ! 11

క. శిరమున శశాంకరేఖయు
హారు వగుఘనలీల కంధరాప్తియుఁ గలయీ

గిరిపతి గిరీశుచాయన్
గుఱుతుగఁ గనుపట్టె సమదకోకిలవాణీ! 12

సీ. కురువిందరుచిబృందపరికందళత్ప్రవా
        ళభ్రమాగతకోకిలవ్రజంబు
తతహీరకరవారికృతశారదేందురు
        క్స్ఫారణాధావచ్చకోరకంబు
ఫణితేంద్రమణిసాంద్రఘృణిరుంద్రయామవ
        త్యాలోకభీతరథాంగకులము
సురథార్యవైడూర్యవరనిర్యదాఖుభు
        క్ప్రకరనేత్రప్రభాచకితశుకము
గీ. నుదితగైరికధాతుమయూఖనివహ
విహితహరిహయధనురనువిదితజలద
సమయభయరయపరిచలదమలగరుడ
నీక మీకులశైలంబు నెలఁత! కంటె. 13

చ. సవరము లచ్ఛమైనఘనసారము కస్తురియున్ జవాది వే
ణువుల జనించుముత్యము లనూనత నిచ్చటిచెంచుముద్దియల్
హావణుగఁ గల్పవృక్షసురకై సురలోకపుఁబువ్వఁబోండ్ల కా
ర్జవమున నిత్తు రోచకితచంచలచారుచమూరులోచనా! 14

క. అని యనురాగము మీఱఁగ
ననుఁగుంజెలితోడ ననుచు నగ్గిరిమీఁదం
జని చని మునిపతి విస్మయ
ఘనతరహర్షములు మదినిఁ గ్రందుకొనంగన్. 15

చ. కులసతిఁ జూచి యోసమదకుంజరగామిని! వీరిఁ జూచితే
కలకలకంఠకంఠమృదుకాకలికాకలనీయగీతికా
కలితుల సిద్ధదంపతులఁ గంటె యదూరసరన్మరుజ్ఝరీ
జలలహరీవిహారములు సల్పెడియత్తులఁ గేళిదత్తులన్. 16

మ. ఇది గంధర్వవిహారభూమి యదె కంటే సిద్ధమార్గంబు ల
ల్లదె సౌగంధికపుష్పము ల్గలకొలం కాచాయ నుఁ మానసం
బదిగో చైత్రరథం బదే కద కలాపాఖ్యామహాగ్రావ మో
మదిరాక్షీ! బదరీవనం బదె జగన్మాన్యంబు చూపట్టెడిన్. 17

క. అని యచటివిశేషమ్ముల
ననసూయకుఁ దెల్పుచుణ్ మహామునివర్యుం
డనుపమశీతలపవనం
బున బడలిక దీరఁ బోవఁ బోవఁగ నెదుటన్. 18

సీ. శరభంబు లాహార మరసి పోషింపంగఁ
జెంగుచెంగున దాఁటుసింగములును
సింగము ల్దమగోళ్లచేఁ గటంబులతీఁట
దీర గీరఁగ మీఱువారణములు
వారణంబుల నిడువాలుతుండంబుల
జెలఁగి యూఁచఁగఁ గూర్కుచిఱుతపులులు
చిఱుతపులు ల్మొండ్లు సెలఁగి తా వొనరింప
నిదురఁ బెట్టుచు నుండుకొదమలేళ్లు

గీ. లేళ్లకొమ్ముల నైనబల్బిలములందుఁ
బరఁగుపాములు పాములపడగనీడ
నలరుచుఁ జెలంగునెలుకలు తలవరు లయి
వరుసఁ గావంగ వెలయునీవరులు గలిగి. 19

సీ. అలికి ముగ్గులు పెట్టి వెలయ వేదికలందు
నాహుతు ల్గాంచుత్రేతాగ్నికణము
త్రేతాగ్నికణధూమజాతమేఘములచే
నెండ కన్నెఱుఁగనివృక్షములును
వృక్షము ల్ఫలముల నెపు డియ్య నతిథుల
మిగులఁ గైకొనుగృహమేధికులును
గృహమేధికులసదాకృతసపర్యలచేత
నతిహర్షము వహించుయతిచయంబు

గీ. యతిచయధ్యానసంతోషితాంబుజాక్షు
పాలితజగత్త్రయంబునఁ బావనంబు
కాంత మేకాంత మాశ్రితానంత మగుచు
శ్రమము లెడఁబాపుబదరికాశ్రమముఁ జేరి. 20

గీ. పర్ణశాలను నిర్మించి పత్నితోడ
స్వర్ణదీతోయమునను సుస్నాతుఁ డగుచు

జీర్ణపర్ణానిలాహార సేవనమునఁ
బూర్ణ మగునిష్ఠను దపంబుఁ బూని యపుడు. 21

చ. ధర బొటవ్రేల నూని రవిఁ దప్పక చూచుచు నూర్ధ్వబాహుఁడై
స్థిరత జితేంద్రియుం డగుచుఁ జిత్తముతత్తరపాటు మాన్చి చి
త్తరువున వ్రాసిన ట్లచలతన్ దగి వాయునిరోధ మొప్పఁగా
హరిహరపద్మగర్భుల సమాహితవృత్తి మదిన్ దలంచుచున్. 22

క. ఫలములు చివురులుఁ బువ్వులు
జలములు దర్భలును వ్రేల్మి సమిధలు నవలా
వలయునవు డోసఁగ సలిపెన్
బొలుపుగఁ దప మత్రి యత్రిపుత్త్రాప్తికి నై. 23

క. ఈయమరిక రెండున్నొక
వేయేఁడులు దివ్యమానవిఖ్యాతము గా
నాయత్రి తపముఁ జేయఁగ
నాయననిష్ఠకును మెచ్చి యతిహర్షమునన్. 24

సీ. హరినీలపుఁదెఱంగు నరదివజ్రపురంగు
మెఱుఁగుఁగెంపుపొరంగు మేను లమర
బెడఁ గైనయక్కున నెడమమైదిక్కున
నడరెడువాక్కున నతివ లలర
చిలువపోఁజులఁ ద్రొక్కుపులుమేఁపులకు సొక్కు
తెలిదూండ్ల వెస మెక్కు తేజు లమర
మకుటంపుజిగిసొంపు రకమైన నెలవంపు
చికిలికెంజడగుంపు శిరము లమర

గీ. స్వర్ణమయచేల గజచర్మవల్కలములు
గట్టువారలు శంఖచక్రత్రిశూల
డమరుదండకమండలు సమితికరులు
హరిహరబ్రహ్మ లపుడు ప్రత్యక్షమైరి. 25

క. ఈలీలం బొడకట్టిన
వేలుపుఁబెద్దలను జూచి విస్మయవినయో
ద్వేలభయహర్షసంభ్రమ
శాలితఁ బ్రణమిల్లి యత్రిసంయమి పల్కెన్. 26

సీ. కమలాశ్రయత్వసంగతిపరిభ్రాజితు
నభిమతార్థ్యాధారతాభిరాము
పరమహంసకపాలితాశ్రితలోకు
హంసాధికరణవిఖ్యాతియుక్తు
వర్ణితఘనసారవర్ణాత్మకాధీశు
ద్విజరాజసంప్రాప్తదివ్యచరణు
నురుతరసత్కృపాభ్యుపగతభద్రుని
సుజనసంస్తుతలసదజసమాఖ్యు
గీ. నిన్నుఁ గొల్చెద భక్తిమై నీరజాక్ష!
యోవిరూపాక్ష! యష్టాక్షరోరుపక్ష!
రక్షణసదీక్ష యసకృత్క్షరమ్యవీక్ష!
ఈక్షణమె నన్ను రక్షించు హితసమక్ష! 27
చ. అని నుతి సేయునాయనసమంచితభక్తికి మెచ్చి వార లి
ట్లనిరి మునీంద్ర! నీవలయు నట్టివరమ్ము లొసంగువారమై
యనితరదర్శనీయమహితాకృతు లేమిట వచ్చినార మిం
పెనయఁగ నీవు కోరినయభీష్టము లిత్తుము వేఁడు మిత్తఱిన్. 28
చ. అనువపు డాతఁ డిట్లను మహామహులార! గుణాభిరాము లా
తనయులఁ గోరి నే నిపుడు తత్పరతన్ దప మాచరించితిన్
ఘనతరకీర్తియుక్తుల జగన్నుతులన్ మిమువంటిపుత్త్రులన్
మనమునఁ గోరెదన్ గరుణ మన్నన మీఱఁగ నీయఁగాఁదగున్. 29
మ. అనిన న్నవ్వుచు మమ్మువంటిసుతు లెం దైనన్ గలారే జగం
బున నత్రీ! విను మేము మువ్వురము త్వత్పుత్త్రాకృతుల్ దాల్చి మీ
యనురాగం బొనఁగూర్తు మం చని యదృశ్యాకారులై రట్టిచో
ననసూయాసతి గర్భమయ్యె భువనాహ్లాదంబు సంధిల్లఁగన్. 30
చ. నెల మసలెన్ శ్రమం బొదవె నిద్దవుఁజెక్కులు వెల్లనయ్యె వే
విళు లుదయించెఁ జన్మొనల నీఁకయుఁ గప్పును దోఁచెఁ జిట్టుముల్
వెలసెను రోమరాజి గనిపించె రుజంబుగఁ గౌను పైఁబయిన్
బలిసె వళుల్ సెలంగె జడిమంబు నడన్ గనిపించె నింతికిన్. 31
క. ఈమాడ్కిని దద్గర్భము
శ్రీ మెఱయుచు వృద్ధిఁజెందఁ జేడియ తగెఁ జిం

తామణికౌస్తుభకల్పక
భూమిజయుతజలధిలహరిపోలిక మీఱన్. 32

శా. అంతన్ గొన్ని దినంబు లేఁగ ననసూయాదేవి భూమీజనుల్
సంతోషింప శుభగ్రహాళి ననువౌలగ్నంబునం దద్భుతా
నంతశ్రీఁ దగుపుత్త్రులం గనియె దత్తాత్రేయు దుర్వాసునిన్
గాంతామోహనచారుమూర్తిరుచిరేఖాసాంద్రునిం జంద్రునిన్. 33

క. దత్తమునీంద్రుఁడు సుగుణో
దాత్తుఁడు హరియంశమున శివాంశంబున లో
కోత్తరుఁ డగుదుర్వాసుం
డుత్తముఁ డబ్జభవునంశ నుడుపతి పుట్టెన్. 34

క. హరిహరసరసిజసంభవ
పరమాంశజులైనసుతులఁ బడసి మునీంద్రుం
డరు దగుసమ్మోదమునన్
బెరసెను పెన్నిధులు గన్న పేదయుఁబోలెన్. 35

ఉ. అప్పుడు వేలుపుందెరవ లాడిరి పాడిరి కిన్నరాంగన
ల్చిప్పిలుసోనతేనియలు చిందఁగఁ గ్రందుగఁ బువ్వులన్ సురల్
గప్పిరి దేవదుందుభులు గ్రక్కున దింధిమినాదవైఖరిన్
గుప్పున మ్రోసె దివ్యమునికోటులు దీవన లీయ వేడుకన్. 36

క. ఆమువ్వురలోఁ జంద్రుఁడు
తామరసభవాంశభవుఁడు దననెఱిసీటున్
గోమును జక్కదనంబును
వామాక్షులు మెచ్చ నిచ్చ వర్ధిలు చుండెన్. 37

సీ. కలువలచెలికాఁడు కళల కెల్లను వీడు
నెత్తమ్మినేస్తకానికిని జోడు
రాతిరియెకిమీఁడు జోతియుండెడువాఁడు
మగువలఁ దమిఁగొల్పుమాయకాఁడు
జక్కవగమిసూడు చక్కనివగకాఁడు
చిమ్మచీఁకటిఁ జిమ్ము ద్రిమ్మరీఁడు
మరునివజీరుఁడు నెఱసీటుగలవాఁడు
ముద్దుగుమ్మలమొగమ్ములకు నీడు

గీ. అంకమున జింకఁ దాల్చినయందకాఁడు
అంబుజాక్షునిమోహంపు టన్నతోఁడు
సద్ద్విజన్ములఁ బ్రోచునక్షత్రంపుజోఁడు
కలికితనమున మెఱయుచుక్కలకు ఱేఁడు. 38

క. సుద్దులచే బుద్ధులచే
ముద్దులచేఁ దల్లి దండ్రి ముద మలరంగాఁ
దద్దయుఁ దద్దయ నెసఁగెను
ప్రొద్దుకుఁ బ్రొద్దుకును వింతపోఁణిమి మీఱన్. 39

గీ. జాతకర్మాదిసత్క్రియాజాతములను
బూతతనుఁ డైనయతనికిఁ బ్రీతి నత్రి
నాతియును దాను నుపనయనం బొనర్ప
నాతనిఁ గనుంగొనఁగ వచ్చె ధాత యపుడు. 40

ఉ. వచ్చి నిజాంశసంభవు నవారణవారణడింభమో యనన్
హెచ్చినపెక్కువం జెలఁగునిందుని రమ్యముఖారవిందునిన్
మెచ్చి దయోదయస్ఫురణ మీఱఁగ దీవన లిచ్చి యిచ్చమై
యచ్చరనేత తచ్చరిత మచ్చుపడం బరికించి యిట్లనున్. 41

ఉ. ఈతఁ డనిన్ సురాసురుల కేనియు గెల్వఁగరానివిక్రమ
ఖ్యాతిని మించి రా జనఁగ నంచితకీర్తి వహించి తారకా
నేతయు నోషధీశుఁ డవనీసురజాతికిఁ బాలకుండు నై
భూతల మేలు మేలు దలపోయును జేయును రాజసూయమున్. 42

మ. అని యిట్లానతి యిచ్చి యంబుజభవుం డమ్మేటికిం గాండివం
బనువి ల్లక్షయతూణయుగ్మ మఖిలాస్త్రాభేద్య మౌకత్తళం
బనిలోద్దామతురంగమాన్వితసహస్రాదిత్యసంకాశ మై
యను వౌదివ్యరథంబు నిచ్చెఁ గరుణాయత్తైకచిత్తంబునన్. 43

క. కర మురుసమరజయశ్రీ
కరమును సుఖకరము కాంతికరమును గడు మీఁ
సరమును బరాగగణధూ
సరము నయినకలువవిరులసరము నొసంగెన్. 44

క. నలువ మరుమామ కీగతి
నలు వమరువరంబు లొసఁగి నగుమొగమున ముం

గల నతులశిల్పవైఖరి
గలనతు నవ్విశ్వకర్మఁ గనుఁగొని పలికెన్. 45

చ. హతబహుకిల్బిషం బగుప్రయాగము యాగముదావహంబు సాం
ప్రతముగ నందు నిందిరకుఁ బట్టనఁ బట్టణముల్ సృజింపుమా
యతులితశిల్పశక్తిఁ గొని యంచని యంచ నిరూఢి నెక్కి యం
చితగతి ధాత యేఁగె జపసిద్ధులు సిద్ధులు తన్ భజింపఁగాన్. 46

ఆశ్వాసాంతము.

శా. ఆలంకారికసమ్మతోజ్జ్వలకవిత్వాగాధ గాథాశతో
ద్వేలస్తుత్యయశోవిశోధితధరిత్రీఖండ ఖండాధిక
స్వాలాపామృతసేచనోల్లసితవిద్వత్కర్ణ కర్ణాబ్ధిచం
ద్రాలంబాపదదాన దానయుతవేదండాశ్వపూర్ణాంగణా. 47

క. సజ్జననాదిబుధావన
సజ్జనయనకజ్జలాశ్రుఝరరచితసదా
మజ్జనరిపుయోషావతధీ
మజ్జనజేగీయమాన మాననిధానా. 48

మాలిని. ఖలవిమతచమూరాడ్గర్వనిర్వాపణౌజా
యలఘునిజగుణాళీహర్షవత్పాండ్యరాజా
వలదురుకవివిద్వద్వర్గసౌవర్గభూజా
విలసితశుభయుక్సద్వేంగళాంబాతనూజా. 49

గద్య. ఇది శ్రీజానకీరామచంద్రచరణారవిందవందనకందలితానందకందాళ రామానుజగురుచరణసేవాసమాసాదితసాహితీవైభవ శేషము కృష్ణయార్యతనూభవ సుకవిజనవిధేయ వేంకటపతినామధేయ ప్రణీతం బైన శశాంకవిజయం బనుమహాప్రబంధంబునందుఁ బ్రథమాశ్వాసము.

---

శ్రీ రస్తు.

# శశాంకవిజయము.

## ద్వితీయాశ్వాసము.



విజయరంగచొక్క-
త్మావిజయగురుప్రసాదసంపన్నిత్యా
శ్రీవరదాచార్యమణి
శ్రీవరదాసైకకృత్యసీనామాత్యా! 1

వ. అవధరింపుము సూతుండు శౌనకాదిమహామునీంద్రుల కిట్లనియె. 2

శా. ఆలీలన్ గమలాసనుండు చన నయ్యాజ్ఞాపనం బొదలన్
బాళిం గైకొని విశ్వకర్మ యుచితాభ్యాసైకశిల్పక్రియా
శాలిత్వంబు ప్రతిష్ఠ గాంచఁగఁ బ్రతిష్ఠానాఖ్యచే నెంతయున్
మేలౌపట్టణమున్ బ్రయాగమును నిర్మించెన్ జను ల్మెచ్చఁగన్. 3

క. ఆపురివిభవము శివునకు
నూపుర మగుచిలువతేఁడు నుతి సేయంగా
నోపురహా గాంచ నేరఁడు
కాపుర మై లచ్చి యచట కదలక యుంటన్. 4

మ. నగరీసౌధములన్ గుమారికలు వీణ ల్మీటుచో నీలపుం
జగతు ల్వజ్రపుగోడలుం జలముగా సప్తర్షిసంఘంబు మం
త్రగణోచ్చారణతో సితాసితసరిద్భ్రాంతి న్జలం బాడి యా
మగువ ల్నవ్విన భ్రాంతికిం బురుషధర్మత్వంబు సిద్ధింపఁగన్. 5

మ. అఱజాబిల్లిమెఱుంగు ఫాసికముచాయం బూనఁగా తారక
ల్నెరయన్ జల్లినసేసఁ బ్రాలకరణి న్మిండార సౌవర్ణని
ర్ఝరిణీకంకణయుక్తకేతుకరకంజం బొప్పఁ దద్రత్నగో
పుర మాగోపురలక్ష్మి పెండి లయి యొప్పెన్ బ్రాప్తకల్యాణమై. 6

చ. విలసితపద్మరాగమణివేల్లిత మై తగుమేటికోటకొ
మ్మలు దళపఙ్క్తు లై మెఱయ మంజుహిరణ్మయసౌధయూథము
ల్దల మగుకేసరంబులుగఁ దత్ప్రభుగేహము మిద్దె గాఁగ ను
జ్జ్వల మగుతత్పురాబ్జమున సారసవాసన నించు నిచ్చలున్. 7

ఉ. పా టొకయింత లేనిఘనపత్త్రసహస్రము రాజమాన్య మా
పాటవము న్జడోపచితభంగి యెఱుంగనివృద్ధియోగమున్
బాటిలఁ జారుచిత్రనవపద్మగతి న్విలసిల్లి కంటకో
ద్ఘాటన లేక యుండురమకాపురమాపురమందు నిచ్చలున్. 8

సీ. వసుమతీవలయాధిపత్యరాజద్రాజ
        పరితోవిజృంభితపరిధి యనఁగ
విక్రమత్రయభృశోపక్రమాధోక్షజ
        చరణవిస్రస్తహంసక మనంగ
భువనత్రయాద్భుతపురరమాకటిలగ్న
        ధగధగన్మణికాంచిదామ మనఁగ
నఖిలభూభరణసామ్రాజ్యయాచ్ఞాయాత
        మండలీకృతమహాకుండలి యన

గీ. నెసఁగు బహుజీవనప్రదాతృత్వవిష్ణు
పదసమాశ్రయతాభోగభాసురత్వ
పురుషరత్నాభిరామత్వపూర్ణమహిమ
విమలహేమకవాట మవ్వీటికోట. 9

గీ. జాళువాకోటకొమ్మలు చాలుదీప
ములుగఁ బై మొగు ల్ధూమవిస్ఫూర్తి గాఁగ
నవ్యనీరాజనంబు తన్నగరలక్ష్మి
విష్ణుపదమున కర్పించు వేడ్క మీఱ. 10

చ. కళుకుకడానిచాయ మెయిఁ గన్పడఁగా మెఱుఁగుందురాయితో
విలసిత మైసనీఁ ఘనవేణికచేఁ జెలువొందుకోటకొ
మ్మలఁ గని చంద్రుఁడున్ రవియు మాపును రేపును రక్తి మీఱఁగా
మెలఁగుచుఁ జుట్లఁ బెట్టుదురు మే నొకయించుక సోఁక నప్పురిన్. 11

చ. అలపురికోటకొమ్మగమి నానను దగ్గరుడోపలద్యుతిన్
జిలువలపగ్గము ల్బిగరఁ జిక్కుపడున్ రథ మొంటిబండి నే

కలశభవాచాంతజలధి నింపఁగఁ జాలు
నివె యన్నగతి వమథువులఁ జల్లు
నొంటి నెత్తఁగ రాదె యుర్వినాగాధిప
త్రయధృతి ననుమాడ్కిఁ దాల్చు పట్టిఁ
బుడమి యెల్లను నాలుగడుగుల నడుగు నం
చనుగతి ముందటికడుగు లిడును
గీ. కీలు మేలును మదభరోద్వేలధార
లోలిఁ గురియంగ నెలయేళ్లఁ జాల మెఱయు
శైలములలీల నాలానజాలబద్ధ
లైనమత్తేభఘట లొప్పు నప్పురమున.
శా. బ్రద్దల్వాఱె ధరిత్రి లీలఁ దెలిబాబాఁ జూచి వేఁటాడుచున్
రుద్ధుల్ ఘల్లున కొమ్ముకల్లెగయఁగా నూరారు సన్నల్వడున్
సద్దైచోప్పేటను విన్న డీకొను నిజచ్ఛాయ న్మహావృక్షముల్
ప్రోద్దామస్థితిఁ బెల్లగించు నచటల్ బొల్పొందుమత్తేభముల్.
సీ. కసవుమోపరిగాలి గఱుతియే మా కంచు
నగినట్ల వదనఫేనముల రాల్చు
ధర సరి లేదు పాతాళమం దేనియుఁ
గండ మన్గతి ఖురాగ్రమునఁ ద్రవ్వు
నిసరథాశ్వములట్ల మునుఁగుదు మే పూద్దు
మబ్ధు లన్గతి రేఁచు సంక్షిప్రజము
తముఁ గూడి వచ్చుచిత్తమ్ముల నల్కచే
నదలించుకరణి నల్లార్చు శిరము
గీ. లురము నందంబుఁ బలుకంద ముదుటుఁగన్ను
లరిది వెన్నులు తగ నంద మై యొసంగ
సింధుకాంభోజశకపారసీకధట్ట
బాహ్లీకారట్టఘోటకపంక్తు లచట.
మత్తకోకిల. చక్రము ల్జత గూడ బంగరుచాయ నింగి చెలంగఁగాఁ
బ్రక్రమాదృతపద్మతల్ శరవర్షణాస్పదవృత్తులై
వక్రగామిత లేమిఁ జైత్రనవప్రతాపవిజృంభణో
పక్రమస్థితి మీఱుఁ దేరులు భానుమండలవైఖరిన్.

క. తురగము రౌతును బల్లము
గరకరి సేపడఁగ రథము గావించి యశం
బరుదుగ నెదు రంపుదు ర
ప్పురభటులు సురాళి గురియు బువ్వులజడికిన్. 27

సీ. కర్ణాటకామినీకర్ణావతంసిత
కర్ణికారపరాగగణముఁ దాల్చి
మధురాధరాచరన్మధురాధరావున
ర్నిధువనోత్సాహము ల్నిగుడఁ జేసి
కుంతలాంచదరాళకుంతలాగరుగంధి
కుంతలామోదము ల్క్రాల్ల లాడి
లాటశుద్ధాంతలలాటఘర్మాంబులీ
లాటనక్రియలఁ బాయంగఁ ద్రోసి

గీ. నలినకువలయనవలయనటనపటిమ
చలితలలితనదళికులకలకలకల
వితతగతిక్కృతిచతురత వెలసి పొలసి
విసరు మరుదంకురంబు లవ్వీట నెపుడు. 28

చ. కలువల కేమి నీ విపుడు కన్గొనినంతనె తెప్పతెప్పలౌ
నలినము లెన్ని రావు లలనామణి నీవిటు మోము ద్రిప్పినన్
వలసినసంపెగ ల్గలుగవా మఱి నీమెయిచాయ డాయ నం
చెలమి విటాళి పల్క విరు లిత్తురు నప్పురిఁ బుష్పలావికల్. 29

మ. కులుకుంజందురుకావిపావడపయిన్ గ్రొందళ్కు రాయంచ యం
చులజిల్గుం దెలిదుప్పటంబు రహి మించం గుచ్చెల ల్జాఱునన్
దొలుక న్మెట్టెలసద్దుల న్మనులపద్దు ల్వీడఁగా వారకాం
తలు తద్వీథుల వత్తు రచ్చిగురుఖాణారౌతు తేజీ లనన్. 30

శా. బాగై మించినయప్పురోత్తమము క్రేవన్ జూడ నయ్యేన్ రకం
బై గంగాయమునాసరస్వతులు చంద్రావేశు యాత్మన్ గొన
ల్సాగ న్జంద్రికయున్ గళంకరమయున్ సౌగంధికశ్రీయు ను
ద్యోగం బొప్పఁగ వచ్చె నందు మదిలో నుర్వీజనం బెన్నఁగన్. 31

క. అనగరంబునఁ జంద్రుఁడు
భూనుతవైభవ మెసంగఁ బొలుచు నిజకథా

గానసుధాపానబుధా
నూనవిధామోదమోదయుక్తుం డగుచున్.

ఉ. పిన్నటినాఁటనే తనవివేకము లోకమువారు మెచ్చఁగా
వన్నెకు వాసి కెక్క గురుభక్తియు యుక్తియు బంధురక్తియుః
సన్నుతసూనృతోక్తి భుజశక్తియుఁ జక్కదనం బెలర్పఁగాఁ
గన్నులు చల్లసేయు నలకైరవమిత్త్రుఁడు లోకమిత్త్రుఁడై.

క. అత్త్రి నయ మలర నిట్లను
నత్త్రిసయనునట్టిపట్టి కతిహర్షముతోఁ
బుత్త్రా! నీదగుబుద్ధికి
పాత్త్రం బగుగురునికరుణఁ బడయఁగ వలదే.

చ. చదువునఁ బ్రజ్ఞ దాన సరసజ్ఞత యందునఁ గార్యఖడ్గకో
విదతయు దానఁజేసి ప్రతివీరనృపాలజయంబు దానిచే
నదనుగ మీఱుసంపదలు నందునఁ ద్యాగము భోగ మందుచే
బదపడి కీర్తి దాన ననపాయపదంబును గల్గు నెంచఁగన్.

ఉ. ఆఱనిదీవె యక్షయమహానిధి జూపునవాంజనంబు నూ
రూరికి వచ్చి తోడుపడ నోపినబంధుఁడు జ్ఞాతివర్గము
ల్గ్లోరనిసొమ్ము దేవనరలోకవశీకరణౌషధం బసా
ధారణ మైనవిద్య వసుధ న్నుతియింప వశంబె యేరికిన్.

క. చెఱకునకుఁ బండు పసిఁడికిఁ
బరిమళమును చిత్త్రమునకుఁ బ్రాణంబును దా
నరుదుగఁ గల్గినరీతిని
నరపతులకు విద్య గలిగిన న్నలు వాసఁగున్.

క. దురమున కలుకనితురగము
వరగుణ యాయువిద వినయవంతుఁడు సుతుఁడు
స్వైరతుఁడు బుధుఁడు వివేక
స్ఫురితుం డగుమంత్త్రి రత్నములు నీ యైదున్.

ఉ. కావున నీవు ప్రాభవము గల్గుటకు న్ఫల మొందువైఖరి
న్దేవగురున్ బృహస్పతి నతిప్రతిభాస్థితి భారతీపతి
న్సేవ యొనర్చి నీదగుసుశీలతచే ముద మందఁ జేసి మే
ధావిభవంబున న్దనరి తత్కృప విద్యల నెల్లఁ గాంచుమీ.

క. అన విని చంద్రుఁడు జనకుని
పనుపున సంతస మెసంగ భాసురవిద్యా
ఖని యగుగీష్పతిపాలికిఁ
జని ప్రణమిల్లుటయు నతఁడు సమ్మద మలరన్. 40

ఉ. మైత్రి యెలర్ప ని ట్లను కుమారక! సారెకు సచ్చరిత్రుఁ డా
యత్రికి సేమమా కుశలమా యనసూయకు నీకు మేలె లో
కత్రయవందనీయులు సుఖస్థితులే భవదగ్రసోదరు
ల్చిత్రము నీదురాక సవిశేషముగా నెఱిఁగింపు నావుడున్. 41

ఉ. మాతలిదండ్రు లన్నలును మాతలిసారథికార్చనీయ! సం
ప్రీతిగ నున్నవా రచట మీచరణాంబుజసేవఁ జేయ న
న్నీతఁడె బంపఁగా నెలమి నే నిట వచ్చితి నన్ను శిష్యుని
న్నీతనుజాతురీతిని వినీతుని గా నొనరించి ప్రోవవే. 42

ఉ. ఒజ్జలు నిర్జరావళికి నుజ్జ్వలబుద్ధిసమృద్ధు లెంతయుం
సజ్జను లిజ్జగంబునను సన్నుతి గాంతురు మీర లట్టిమీ
పజ్జను జేరి యొజ్జ గని భక్తి యొనర్చుచు విద్య నేర్చిన
న్మజ్జననంబు సార్థము సమజ్జనతావన! లోకపావనా! 43

శా. మీచెంత న్బహువేదశాస్త్రపఠన న్బేక్కండ్రు విద్వాంసు లై
వాచోయుక్తిపటుత్వ మొందిరి గదా వారంద ఱౌ నౌ ననం
ధీచాతుర్యము మించ శాస్త్రముల నర్థి న్నేర్చి యుష్మద్దయా
సాచివ్యంబునఁ బేరుఁ బ్రౌఢియుఁ బ్రతిష్ఠారూఢియు న్గాంచెదన్. 44

క. సదమలగురువిశ్వాసము
త్రిదశులు మనుజులును మెచ్చ ధృతి మీయొద్దం
జదివెద మీపరిచర్యను
నొదవెద తుదఁ గీర్తిఁ దెత్తు సురుతరలీలన్. 45

మ. అనిన న్సంతస మంది గీష్పతికుమారా! యత్రిగర్భంబున
న్జననం బొందిననీకు నీవినయము న్సౌజన్యమర్యాదవ
ర్తన మంచన్మధురోక్తులుం దలఁప వింత ల్గావు రాజత్కళా
ఖని వై యొప్పెడినీవు శిష్యుఁ డగుభాగ్యం బెన్న సామాన్యమే.

క. పదునెనిమిదివిద్యలు నినుఁ
జదివించెద వేయు నేల జగముల నెందుం

బదు లితనికి లే దనిపిం
చెద నిను నాయంతవానిఁ జేసెదఁ జంద్రా! 47
చ. అని మది మోద మందుచు బృహస్పతి యాహరిణాంకు నింటికిఁ
గ్గొని చని యాదరించి తనకు స్సహధర్మిణి యైనతారఁ గ
గ్గొనె యితఁ డత్రిపుత్రకుఁ డనూనగుణాఢ్యుఁడు తల్లిదండ్రిపం
పున మనవద్దకుం జదువుపూనిక వచ్చినవాఁడు తొయ్యలీ! 48
ఉ. నీరజగంధి! వీఁడు జననీజనకు ల్గడు గారవంబున
న్వారకఁ బెంపఁగాఁ బెరిఁగినాఁ డతికోమలదేహుఁ డీతని
న్నేర యెఱింగి యాదరము మీఱఁగ వేళకు వేళకు న్మనం
బారసి యన్నపానముల కాఁకొననీయక ప్రోవఁగాఁ దగున్. 49
మ. అనినన్ దారయు నట్ల కాక యని విద్యాసక్తుఁ డౌచంద్రునిన్
దినము న్మజ్జనభోజనాదివిధి నర్థిం బూని పోషింప న
వ్వనజాతాక్షియు భక్తిగౌరవము విశ్వాసంబు సంధిల్లఁగా
ననిశంబు న్గలిదండ్రుల న్మఱచె నయ్యాచార్యసేవారతిన్. 50
మ. పరమప్రీతి నహర్నిశంబు త్రిదశోపాధ్యాయవర్యుండు సు
స్థిరతం బాఠము సెప్పి చింతనలు ప్రీతిం దానె చేయించి ప
ల్మరు నయ్యర్థ ముపన్యసింపు మని లీలం దానె శంకించి యు
త్తరము న్దెల్పఁగ నేర్పె సభ్యనుతవాదప్రౌఢిమం దిద్దుచున్. 51
క. ప్రఖ్యాతిఁ గాంచఁగలఁ డని
ముఖ్యుం డగుశిష్యుఁ డనియు ముద ములరంగా
నాఖ్యానాఖ్యాయికలన్
వ్యాఖ్యానముఁ జేయ నేర్పె నాతనిప్రేమన్. 52
సీ. చదివెను ఋగ్యజుస్సామాది వేదంబు
లధికరించెను దద్రహస్యజాత
మభ్యసించెను లక్షణానీకముల నెల్ల
నధిగమించెను షడంగాంగములను
బఠియించెఁ గాణాదభాష్యమీమాంసలు
తెలిసె వ్యాసమతంబు తేటపడఁగ
గ్రహియించె సాంఖ్యయోగములమర్మము లెల్ల
నాకళించెను బురాణాదికముల

గీ. నేర్చెఁ జెల్లముగా దండనీతిశాస్త్ర
మరసె నాద్యంతముగను వైద్యాగమంబు
నెఱిఁగె సాంగధనుర్వేద మెల్ల నపుడు
సోముఁ డుద్యత్కళాస్తోమధాముఁ డగుచు. 53

చ. అరసి విశుద్ధశబ్దములు నర్థములు న్ధ్వనివైభవం బలం
కరణము రీతి వృత్తులును గల్పన పాకము శయ్యయుం బ్రస
న్నురణము దోషదూరత యచుంబితభావము లొప్పఁ జిత్రవి
స్తరమధురాశులీలఁ గవిత న్రచియింపఁగ నేర్చె నంతటన్. 54

క. అంగనలసౌఖ్యమందుగ
సంగీతము భరతశాస్త్రసరణియు విద్యా
సంగతులగు గంధర్వుల
సంగతి నమ్మేటి నయ మెసంగఁగ నేర్చెన్. 55

క. అఱువదినాలుగువిద్యలు
నఱువదినాలుగువితంబు లయ్యె నుతింప
న్సురగురునికరుణఁ జిరభా
సురగురునియతి న్సుబుద్ధి సోముఁడు నేర్చెన్. 56

క. నానావిధవిద్యలకు
స్థానాస్పద మగుచు నమృతధాముఁడు బొలిచె
న్మానుతబహువిధరత్నని
ధానం బగుజలధివిధము దైవాఱంగన్. 57

ఉ. అంత ననంతవిభ్రమనిరంతర మై జిగికుందనానకు
వింతగ సౌరభంబు ప్రభవించినవైఖరి జుంటితేనె క
త్యంతము తేట పుట్టినటు లాతనిమేనికి వన్నె దెచ్చుచు
న్గాంతి నెసంగె జవ్వనము కాంతలకు న్నయనోత్సవంబుగన్. 58

క. పరువంపుఁబ్రాయమున నా
సరసునినెన్నడుము మిగుల సన్నం బయ్యెన్
మరునిమరు లెసఁగ నిచ్చలు
తరుణులు చూడంగ దృష్టి తాఁకినరీతిన్. 59

చ. అలనలినారి పొల్చె నిజయౌవనవేళ స్వకీయబింబలీ
లలు దననెమ్మొగంబునఁ గళంకరుచుల్ నునుమీసకట్టునన్

వలుదద యారుణద్యుతులు వాతెఱ వెన్నెలడాలు లేఁతన
వ్వులనమృతంబుఁ బల్కులను బూనెనొనాఁగ మనోహరాంగుఁడై.

సీ. తను జూచుజవరాండ్ర కెనయుకోర్కులభంగి
నిడుదలై బాహువుల్ నిటు మెఱయ
గని సొక్కుకాంతలయనునయోక్తులరీతి
యొగుబుజంబులు కర్ణయుగళి సోఁకఁ
దిలకించుభామలబలుచింతయును బోలె
విస్తీర్ణమై ఱొమ్ము వీఁకఁ దనర
పీడించుకన్నెలవిరహాబ్ధికై వడి
లలితవాక్కులు గభీరత వహింప

గీ. మిసమిసలు దేరునునుపైనమేనిసొబగు
కన్నులను గాంచి మది మెచ్చుకమలముఖుల
మనసువలె బాల్యము గరంగ మరునిమాను
సొంపు గనెఁ జాల యెలజవ్వనంపువేళ.

ఉ. చక్కనిసోఁకబోదె నగఁ జాలుగళంబును గేల నొక్కినం
జిక్కనిపాలుగాఱునునుఁజెక్కులు సంపెఁగమొగ్గయందముల్
ద్రొక్కెడుచారునాసికయుఁ దోరపుడాల్వొలిదమ్మిరేకులల్
మిక్కిలి గెల్చుకన్నులును మించునొయారము నింపు నింపఁగన్.

క. చక్కెరవిల్తునొయారపుఁ
జక్కెర పం చని వలంచుచక్కదనాన
న్మిక్కుటముగ విలసిల్లెను
చుక్కలగమికాఁడు మిగులఁ జూపఱు లెంచన్.

చ. మునుమును వింతగాఁ జిలుకముక్కుజిగి న్దగునుక్కుగోటిచే
ననువుగ గీరునామము నొయారముగా నిడ నేర్చెఁ బెన్నెఱు
ల్వెనుకకు నొత్తి జాఱుసిగ వేయఁగ నేర్చెఁ గడానితమ్మిపూ
పనినునుఁబచ్చడంబ వలెవాటు వహింపఁగ నేర్చె నీటునన్.

సీ. పలుమాఱు ముగ్ధభాషలు పల్కుటలు మాని
యమరి జాణతనంబు లాడఁ దొడఁగె
సతతంబు వేదశాస్త్రప్రసంగము మాని
శయ్యలొక్కొకసారి చదువ సాగె

సహజంబుగా వధూజనులఁ జూచుట మాని
సొలపున నోరగాఁ జూడఁ గలిగె
వేడ్క బాలురతోడ విహరించుటలు మాని
సరసులతోఁ జెల్మి సలుపఁ బూనె
గీ. వటువు జిగిమోవి మెఱయ నవ్వట లెఱింగె
వింతవింతగఁ గైసేయువితముఁ దెలిసె
మొలకమీసలు వడి గొల్పుమురువు సేర్చె
రసికతానందశృంగారరసము నేర్చె. 65

ఉ. వానియొయారపున్నడలు వానిచకచ్చకలీనుపొన్నొడ
ల్వానిరుటంపుఁ బెందొడలు వానిరువారపుసిబ్బెపుంబొడ
ల్మానవతుల్గనుంగొనిరి మానసవీథి మనోరథానుసం
ధానము పూని సూనశరదారితభూరితరాభిమానలై. 66

సీ. కులుకుఁ జూపులను గన్గొనని యేణాక్షియు
ననురక్తిఁ గననిబింబాధరయును
బలుక నుంకింపనిచిలుకలకొలికియుఁ
దమి జెంది కుందనికమలముఖియుఁ
బెనఁకువ కాసఁ జేయనిలతాతన్వియుఁ
బారవశ్యంబుఁ దాల్పనిప్రమదయు
ఘనమైనమరుకాఁక గొనని హేమాంగియు
సరసతఁ జెందనిజలదకచయు
గీ. డాసి దయ నేలు మనుచు వేఁడనియబలయుఁ
గదిసి కేలెత్తి మ్రొక్కనిగజగమనయు
లేదు ధారుణిలోఁ గల్గు లేమలందు
జవ్వనంబున రేరాజు నివ్వటిల్ల. 67

ఉ. హాటకగర్భవంశ సమృతాంశుఁడు నుజ్జ్వలమూర్తి యాజగ
న్నాటకసూత్రధారకుమనం బలరంగ మెలంగినట్టియ
మ్మేటి కళానిధిత్వమున మించినవాఁ డెలజవ్వనంబు స
య్యాటలు మీఱుచోఁ గువలయాక్షుల కిం పొనరించు టబ్రమే. 68

ఉ. ఆలలితంబు లాసొగసు లానెఱజాణతనంబు లాకళా
శాలిత యాసురూపరుచిసంపద లాహవణింపుసొంపులున్

హాళిమెయిం గనుంగొనినయంతన వేలుపుటొజ్జలయ్యయి
ల్లాలు విరాళి నొందె మది నంగజమాయ తరింప శక్యమే. 69

ఉ. రాకకుఁ బోకకుం గలుప రాయనిచక్కదనంబు కంటి కిం
పై కనుపట్టి యచ్చెలువ యప్పటికప్పటికిన్ మనంబునన్
వ్యాకులతన్ వహింప మరుఁ డంతట నంతట తమ్మిగుమ్మితిం
జేకొని వీఁక మై మొనలఁ జిమ్మఁ దొణంగెను గొమ్మ లొమ్మునన్. 70

మ. ప్రమదారత్నము తార చంద్రు నెనయన్ భావించుఁ దోడ్తోన న్యా
యము గా దంచుఁ దలంచుఁ దాళఁగలనా యంచున్ వితర్కించు వం
శము శీలంబు మదిం గణించును బ్రతిష్ఠ ల్పాచినం దీరునా
తమి యంచుం గమకించు భీతి మదిలోఁ దర్కించుఁ గాంచు న్వెతన్.

ఉ. ఒప్పుగ నొజ్జయొద్ద శశి యున్నతఱిం దలు పోరఁ జేసి యా
యొప్పులకుప్ప వానిమెయి యొప్పిదముం గనుఱెప్ప వెట్టకే
తప్పక చూచి కన్మొగిచి తళ్కు తళుక్కనఁ గమ్మ లూఁగఁగాఁ
గొప్పసియాడఁ జెక్కులు గగుర్పొడువం దలయూఁచు మెచ్చుచున్.

ఉ. కమ్మజవాదివాసనలు గ్రమ్మఁగ నోరపయంట జాఱఁగా
నెమ్మెలు మీఱ నగ్గురునియింతి తొలంగఁగ నిమ్ము లేనిమా
ర్గమ్మునఁ జంద్రునిం గదియఁగాఁ జని వానిభుజమ్ము సోఁకఁగా
జిమ్మును జన్మొనన్ గళలు చెమ్మగిలన్ దనువెల్ల జల్లనన్ 73

ఉ. పాయనిప్రేమ బాల్యమునఁ బాపఁడ! చిన్నకుమార! రార! బా
బా! యనుపల్కులం దొఱఁగి యాగజగామిని సామి! యేమిరా
కాయజమోహనాంగ! వగకాఁడవురా నెఱపెంపుకారివా
నోయి! పరాకు జాణ! యనుసూక్తులు పల్కఁగ సాగె వింతగన్. 74

మ. జనము ల్లేనియెడన్ శశాంకుసరసన్ సాంబ్రాణిధూపంబు వా
సన గుప్పన్ నెఱిగొప్పు విప్పి పయఁటన్ జందోయి నిక్కంగ వే
డ్కను గిల్గింటు ఘటించి చెంగలువమొగ్గ ల్చెక్కి రేరాజ! యీ
నన నీ వంటిన విచ్చునం చతని మేనన్ మోపుఁ దా నవ్వుచున్. 75

క. పరిపరివిధముల నిట్లా
సరసునిఁ జెనఁకుచును నిలుపఁ జాలనిప్రేమన్
మరునురవడివిఁకీరుసున
మెరమెర భావంబు లోన మెఱవఁగ మఱియున్. 76

/సీ. కనుఱెప్పవెట్ట కాతసి నెగాదిగఁ జూచుఁ,
జూచి యల్లన తల యూఁచి మెచ్చు
మెచ్చి మోహము బయ ల్పఱయఁ బక్కున నవ్వు,
నవ్వి తోన గిరుక్కునను దొలంగుఁ
దొలఁగి వెంటనె యోరఁ దళుకొత్తఁ గన్గొను,
గన్గొని వానిఁ జెంగటికిఁ బిలుచుఁ
బిలిచి యూరక సీమఁ గలముచ్చటల నాడు,
నాడి యేకాంత మటంచుఁ జేరుఁ
గీ. జేరి చెవిలోన గుసగుస ల్చెప్పినట్లు
మోహమున వానిచెక్కిట మోముఁ జేర్చుఁ
జేర్చి చెక్కులఁ బులకలు చెంగలింప
నవశ యై చొక్కుఁ దమి మీఱి యామిటారి. 77
చ. గడెతడ వాతఁ డొక్కపనిగాఁ జని యింటికి రాకయుండినన్
దడఁబడు మీఁ దెఱుంగదు వితాకున నుండును జిన్నవోవుఁ దా
బుడుతలచేతఁ బిల్వఁబనుపున్ మఱి వచ్చిన నింతసేవు నె
క్కడ నని మోడిగాఁ బలుకుఁ గ్రక్కున నవ్వును నాతఁ డల్గినన్. 78
/ఉ. అందపుజాఱుఁగొప్పు నసియాడెడుకౌనును లేఁతవెన్నెలల్
సిందెడునవ్వు నబ్బురపుసిబ్బెపుగుబ్బ సగంబు గానరాఁ
గ్రిందును జీరుపయ్యెదయు గిల్కు గిలుక్కని మ్రోయుమట్టియల్
చందమరంగ నిందుముఖి చందురుముందఱనిల్చుఁ గుల్కుచున్. 79
ఉ. మట్టుకు మీఱుమోహమున మానిని వానికి మేలిదుప్పటు
ల్గట్టఁగ నిచ్చుఁ గుంకుమముఁ గస్తురిఁ దానె యలందుఁ గ్రొవ్విరు
ల్చుట్టు ననర్ఘ్యరత్నములసొమ్ములు వెట్టును భోజనం బిడున్
గట్టెఁడు తెల్లనాకులును గప్పురబాగలు నిచ్చు నిచ్చలున్. 80
సీ. జిలుఁగువల్వ వదల్చి చెంగావి ధరియించి,
యది బాగొ యిది బాగొ యనుచు నడుగు
ఱైక సడల్చి యారజపుఁబైఁట ఘటించి,
యది మేలొ యిది మేలొ యనుచు నడుగు
జడ విచ్చి వింతగా జాఱుకొ ప్పమరించి,
యది నీటొ యిది నీటొ యనుచు నడుగు

హొచ్చుముక్కర దీసి పచ్చుతళ్కు ధరించి,
యది లెస్సొ యిది లెస్సొ యనుచు నడుగు

గీ. గమ్మకస్తురితిలకమ్ముఁ జిమ్మి సమ్మ
దమ్ము గ్రమ్మఁగ జగికుందనమ్ముఁదళుకు
తిలక మలికమ్మునను జిగి దొలఁకఁ బూని
యందొ యిందునొ యంద మం చడుగు వాని.

గీ. ఇంట మెలఁగెడివారిలో నెవ్వ రైన
నతనిఁ దారామనోహరా! యనుచుఁ బిల్వ
డెంద మానంద మొంద నాయందకాని
మొగముఁ గనుఁగొని ముసిముసి నగవు నగును.

క. అద్దము గానము తిలకము
దిద్దర నుదుట నన నతఁడు దిద్దుచు నుండన్
ముద్దిడ వాతెఱ యొగ్గును
ముద్దియ యతఁ డూరకున్న మోడిగఁ జూచున్.

ఉ. చేరఁగ రార నీకురులు చిక్కెడలించెద నంచు నేర్పుతో
సారసగంధి పిల్చి బిగిచన్నులు వెన్నున నాన నిల్పి శృం
గారపువింతమాటల వికావిక వాని నగించి నవ్వుచుం
గూరిమి మీఱ గీఱి కొనగోటఁ జిటుక్కన నొక్కుఁజొక్కఁగన్

ఉ. ఒక్కొకవేళ నాసరసుఁ డొంటిగ నింటను నిద్ర పోవఁగా
నక్కలకంఠి తమ్మరస మంటఁగ గెంటనిప్రేమ వాని ను
న్జెక్కులు ముద్దు వెట్టుకొని నిద్దుర లేచినయంత వింతసే
పెక్కడఁ బోయి తీగుఱుతు లేదవి యద్దముఁ జూచికొ మ్మనున్.

సీ. గుబగుబ మని పల్కుకోకిల పల్కులు,
విని యవి నేర్తువా యనుచు నవ్వ
గవ గూడి పొదలుజక్కవల మక్కువపెక్కుఁ,
గాంచి వానిగుఱించి కన్ను గీటు
నీవు పెక్కువొ లేక నేను బెక్కునొ యంచు,
సరి నిల్చు వానిభుజంబు సోఁక
మడుపులు చుట్టి యేర్పడఁగ గోరులు వెట్టి,
లలి మీటు మరునికిల్లాకు లనుచు

గీ. మురిపెమున మేను విఱుచుఁ గెమ్మోవి దెఱచుఁ
గుబ్బల విదుర్చుఁ బయ్యెదకొంగు జార్చుఁ
గొసరు వగ నవ్వుఁ గొనగోటఁ గొప్పు దువ్వు
నొంటి నరికట్టు నిలు మంచు నొట్టుఁ బెట్టు. 86
క. ఈరీతిన్ వానియెడన్
నారీతిలకంబు మేలునన్ వర్తిలఁగా
నారసి యారసికునిపైఁ
దారసిలెన్ గిన్క మీఱి దర్పకుఁ డంతన్. 87
క. ఆపాలఁతి తలఁపు వలపున
దాపక తోఁ దోపులాడు నయు తరితీపుం
జూపుల కోపుల నేపుల
వైపుల మై పులక లెసఁగ భావము గరఁగన్. 88
సీ. కులుకులాడిని ప్రేమ దొలుకుఁజూపులఁ జూచి,
యలుక మీఱఁగ దోస మనుచుఁ దొలఁగు
కనకాంగి తనుఁజేరఁ జెనకంగ నుంకించి,
వెనుకటి కిది మాట యనుచు వెఱచు
సరసిజాననతోడ సరస మాడఁ దలంచి,
వరుస కా దంచు భావమున నెంచు
నెలఁతఁ గన్గొని సొక్కి నిచ్చలు తన కిదే,
మరు లాయె నని హరిస్మరణ సేయు
గీ. నొంటిపాటున నవ్వాలుగంటి నంటి
యొంటుకొనఁ జూచి హాహా యయుక్త మనుచుఁ
దలఁచు దలఁచియు మరునికిఁ దల్లడిల్లు
నుల్లమున నుండు యామినీవల్లభుండు. 89
ఉ. చెంతఁ దనంత నింతి కడుఁ జేరిక సేయఁగ సంతసంబునన్
గంతుఁడు రం తొనర్పఁ బరకాంత యటంచు నధర్మ మంచు లో
నెంతయుఁ జింత నొందు మన సిట్టటు కొట్టుక నాడ సాహసం
బింత భయం బొకింత రుచి యింత యసమ్మతి యింత గన్పడన్. 90
క. వెండియు దినదినమును దన
దండను వేదండయాన తరితీపువగల్

మెండుకొన నుండఁ గన్నుల
పండువుగాఁ జూచి కామపరవశుఁ డగుచున్.

ఉ. ఈయబలాలలామ కెన యేయుగమందును గాన నీబెడం
గీయెలప్రాయముం జెలువ మీకొమరున్ మఱి దీనికే తగున్
వే యన నేల ధాత్రిఁ బ్రభవించినవారికి నీమిటారిమై
చాయ యొకింత సోఁకినను జాలు నదే కనకాభిషేకమౌన్.

క. చన్నులు కౌఁగిటి కణఁగవు
కన్నులు చేరలును గొల్వఁగా సరిమించున్
వన్నెలు పలుకులు వేలుపు
టన్నులయందైన దీనియందము గలదే.

సీ. నిద్దంపుటద్దంపునిగనిగల్ గలదీని,
ముద్దుచెక్కిట నుంచుమోము మోము
జగజంపుజిగికెంపునగ నింపునీయింతి,
మోవిపై నానించుమోవి మోవి
బలుకోకముల వీఁక నలవోక గెల్చునీ,
కలికిచన్గవఁ బట్టు కరము కరము
క్రొమ్మించునమ్మించు నెమ్మేన మెఱయునీ,
సుదతియందము చూచుచూపు చూపు

గీ. మదనదవదహనోద్దూయమానమాన
సాబ్జసంజీవినీవిద్య యైనదీని
రవకొసరుఁబల్కు వినువాని చెవులు చెవులు
తనియ నీయింతిఁ గూడినతనువు తనువు.

ఉ. ఎందఱిఁ జూడ మిద్ధరణి నిందునిభాస్యల వారి కెల్ల నీ
యందము చందముం గలదె యక్కట! మిక్కుట మైనకోర్కిచే
నందఁగరానిమ్రానిఫల మాస యొనర్చినచంద మాయె నే
మందు మనోజుఁ డేగతిని నారడిఁ బెట్టఁదలంచినాఁడొకో!

సీ. కలకంఠితళ్కుగాజులు గల్లు మనినంత,
మనసు ఝల్లని చాల మమత నొందఁ
జిగురాకుఁబోఁడి మై జిగి దళుక్కనినంత,
తాల్మి చెళుక్కని తత్తరిల్లఁ

గులుకుగుబ్బెతజాఱుకొప్పుఁ ఘుమ్మనినంత,
సొక్కి జుమ్మని మేను సొమ్మసిల్లఁ
జేరి మాటాడక చెలి గిరుక్కున నేఁగ,
మతి చురుక్కని చాల వెతలఁ జెంద

గీ. బాళిఁ గడు దూలి జవరాలిపై విరాళి
బయలు మతిమాలి తమి పోలి బయిసిమాలి
వనరువిత మాయె నౌర భావజునిమాయ
నేకరణి నిల్వఁగా నేర్తు నెట్టు లోర్తు. 96

ఉ. మున్నొకనాఁడు సంగనల ముద్దులసుద్దు లెఱుంగనట్టిచో
వన్నెలు మీఱ నందమున వావిరి వింతకు వింత యైనయీ
క్రొన్ననబోణి తాన ననుఁ గోరికఁ జేరిక సేయ నూరకే
యున్నయెడ న్మనోజుఁ డిది యోర్చునె దైవము మేలొనర్చునే?.

ఆ. అలక లురులు గాఁగ యలనాభి చెలమగా
మెఱుఁగుఁదియ్యమోవి మేఁత గాఁగ
చెలియదీమమునను వలరాజు వేఁటాడఁ
జిక్కె నామనంబు జీనువాయి. 98

ఉ. ప్రేంఖదధర్మవర్తనకు భీతిలి గోలతనాన నిప్పు డీ
శంఖసమానకంఠిని వశంవదఁ జేసుక పొందనైతి నా
పుంఖితబాణుఁడై మరుఁడు పొంచినవాఁ డెటులో "శరీరమా
ద్యం ఖలు ధర్మసాధన" మటంచు వచింపఁగ నాలకింపమే. 99

క. ఈవనితబెళుకుఁజూపులు
భావజుతూపులవితానఁ బైఁ బర్వినచో
నేవేదము లేశాస్త్రము
లేవాదము లేవివేక మేలా నిల్చున్. 100

సీ. పాలయక్కలోన నీపాలఁతుకతోఁ గూడఁ,
దర్కించువేడుక తర్కశాస్త్ర
మంగజుకేళి నీయంగనతోఁ గళా,
స్వరములు పల్కుటే శబ్దశాస్త్ర
మదనమహాతమి దీనియాస్యంబున నిజాస్య,
యోగ మొనర్చుటే యోగశాస్త్ర

మిమ్ముగా నిమ్ముద్దుగుమ్మగుణమ్ములు,
సంఖ్య యొనర్చుటే సాంఖ్యశాస్త్ర
గీ. మలఁతికొనగోట నొక్కి నీయతివనీవి
మోక్ష మొనరించుటే యెల్ల మోక్షశాస్త్ర
మేను నీవని పైకొనుటేను ద్వైత
మిరువు రొక టైన నద్వైత మిద్ధరిత్రి. 101
క. మెఱుఁ గెక్కినయద్దముగతిఁ
బరఁగినయా చెలికపోలఫలకముమీఁదన్
చిరుత నెలవంక లుంచుట
సరసముగ గురుప్రతిష్ఠ సలుపుట గాదే. 102
చ. మెలఁకువ సెజ్జఁ గాంచి తమి మించి నయంబున బుజ్జగించి వై
పుల నెలయించి వింతసొలపుం దెలుపుంబలుపున్ వగల్ దగన్
గళల గఱంచి భావములు గాంచి రతిం దనియించి వేడ్క నీ
యలికులవేణిఁ గూడవలదా యిలఁ దాఁ దను వెత్తినందుకున్. 103
క. ఉన్నవి నామది కోరిక
లెన్నెన్నో యింతిహృదయ మేమో నన్నున్
మన్నన దయఁ జేయునొకో
క్రొన్నవిలుకానివెతలకుం ద్రోయునొకో. 104
మ. అని యంతంత నిరంతరాంతరదురంతానంతచింతామహాం
బునిధిస్ఫీతతరంగభంగురహృదంభోజాతుఁడై సంతతం
బును గుప్యద్ఝషమీనకేతనధనుఃపుంఖానుపుంఖోత్పత
ద్వనజానర్గళమార్గణప్రకరనిష్పత్రాకృతస్వాత్మతన్. 105
క. పువ్విలుతుఁ డొకఁడు ద్రిప్పఁగ
నెవ్వరు నెఱుఁగనివిరాళి హృదయంబు గడు
న్నొవ్వఁగ నెవ్వగఁ బొగలుచు
నవ్వనజారాతి మగుడ నాత్మగతమునన్. 106
చ. పలుకులనేర్పులున్ జిలుగుఁ బయ్యెదజార్పులు వింతమోడిన
వ్వులు నలయింపులన్ బెళుకుబోర యొయారపుఁజూపుసొంపులుం
గులుకులుఁ బ్రౌఢకామినులకున్ సహజంబులు వీనిఁ జూచి య
య్యలికచఁ జేరఁ గోరఁ దగవా నగ వారడి గాదు మీఁదటన్. 107

చ. తలఁపఁగ సాహసంబు తలిదండ్రులు విన్నను తాళ రీగురుం
డలిగిన మోస మింద్రుహృదయంబునకు న్వెలి యాదు నందుపైఁ
బొలఁతుల నమ్మఁ గూడ దెటు బో నెటు లౌనొ యిదేల తానె యీ
చిలుకలకొల్కి బల్మి దయచేసిన చూత మటంచు ధీరతన్. 108

క. అగ్గలిక మీఱఁ దాలిమి
తగ్గక మానసముఁ బట్టి తను వలచినయా
దిగ్గజకుంభ స్తనిపై
నొగ్గినభావంబు నూఁది యుడుపతి యుండెన్. 109

ఉ. అంత లతాంతకుంజసదనాంతవిహారవిలాసవత్వ్యప
క్రాంతవసంతరాగవిసరద్విగుణీకృతపల్లవోల్లస
త్కాంతిసదారుణోదయతతప్రమదాకులకోకకామినీ
సంతతరుచ్యుదంతము వసంతము దోఁచె వనాంతరంబులన్. 110

క. ఆకులపాటు వియోగుల
కే కాదు ప్రపంచధర్మ మెఱుఁగవివృతశా
ఖీకంబునకుం గలిగెఁ
ఢాక వసంతునిదె మిక్కుటంబుగ ధాత్రిన్. 111

ఉ. వాలుగడాలువానిదళవాయి వసంతుఁడు చైత్రయాత్రకై
సాలములందు జీర్ణదళసంఘము చీల్చిత బెట్టి క్రొత్తఁగా
మేలిదళంబుల న్నిలిపి మీఱటి యయ్యుక్తజనామితక్షమా
పాలి గ్రహించి నూత్నమగుపైకములన్ సనరించె నెల్లెడన్. 112

క. ఎలమావిని నునుఁబల్కులు
గలకోయిలఁ జేరనీక కాకము తఱిమెన్
లలితుఁ డగునృపునిచెంగట
ఖలుఁ డొక్కరుఁ డుండి కవులఁ గదిమెడిమాడ్కిన్. 113

మ. తెలిమొగ్గల్ బలుసిబ్బెపుంబొడలుగాఁ దేనె ల్మదోద్వేలధా
రలుగాఁ దేఁటులబారు బారిగోలునై రాణింప లేగుజ్జుపా
న్నలు పున్నాగము లై వనిన్ జిగురుఖాణామేటికి న్మెచ్చుగా
దళశృంగారము లై చెలంగె నిరుచెంతన్ మావు లొప్పారఁగన్.

గీ. సరజసారుణమకరందసారధార
గురిసె నప్పుడు కుసుమమంజరిని జాల

కమ్మవిలుకాఁడు విరహులఁ గ్రమ్మి దివియఁ
గిఱుసుకత్తిని దొరఁగునెత్తురు లనంగ. 1

ఉ. కోయిలపేరిగారడపుగొంటరి తా ఋతురాజుముందటన్
మాయ వహించి లేఁజిగురుమారునికత్తులు మ్రింగ వాఁడు ము
త్తాయతహారపఙ్క్తులు ప్రియమ్ముగ నీయఁగ దెచ్చి నించె నా
నేయెడ మొగ్గచాలు జనియించెను భృంగకులంబు మెచ్చఁగన్. 11

మ. అమరం గ్రొవ్విరితేనెచాలుకొణతా లందంద లాగించి పొం
కముగం బుప్పొడిమట్టిలోఁ బొరలి వీఁకన్ బోక పూమొగ్గగో
తములం ద్రొబ్బి సమీరమల్లుఁ డనువొందన్ మావిపూలోడిఁ ద్రి
ప్పు మెయిన్ గోకిలబాలుఁ డెంచికొను సొంపుల్ గుల్కు నాదంబులన్.

రగడ. వెలసె వనాంతరవీథి వసంతము
గలిగె జగంబులఁ గనకవసంతము
జిలిబిలియలరులఁ జిమ్మె లతాంతము
సొలపున మీఱె నశోకలతాంతము
మురువుగఁ బొన్నల మొగ్గలు పుట్టెను
సరసిజముల మధుసారము పుట్టెను
కరకరిఁ గంతుఁడు కైదువఁ బట్టెను
విరహిణులకు మది వెత చూపట్టెను
భుగభుగ మని సురపొన్నలు విచ్చెను
మగనికిఁ జెలి కమ్మనిమో విచ్చెను
పొగడమొగడలకుఁ బుట్టెను దావులు
తగె విటసంకేతమ్ముల తావులు
భసలవిసరములు బారులు తీరెను
మసలక పికములమౌనము దీరెను
కనుఁగొనవే శృంగారపువనములు
మన మలరించు నె మఱి జవ్వనములు
పొలిచె మహీజంబులు సదళంబులు
తులకించెను గంతునిషుదళంబులు
కననీయ నిదే కైకొను మరువము
వనితా! యిచ్చితివా నిను మరువము

మెలఁతరో! నావి సుమీ విరవాదులు
వలదే నాతో వలవనివాదులు
కలికీ! యిచ్చట కంతునికైదువ
నలికీ నరుగఁగ నచ్చటికైదువ
తగఁ బూచెఁ గదే స్థలనీరజములు
దిగు లొందించెఁ బథిని నీరజములు
పువ్వులు గలవఁట పోదమె దవులకు
నవ్వెదు జవ్వని! నను వెను దవులకు
ఇంతి! యెక్కడివె యీకోరకములు
చెంత నుండె నిచ్చెద కోరకములు
చెలి! మును నేఁ జూచితినే కొమ్మలు
బలి న్యాయముఁ జెప్పరె యాకొమ్మలు
నాతి! ప్రేంకణము నగె నీపాటల
చేతి కబ్బె నిదె చేకొను పాటల
తోయజలోచన! దొరకెను దవనము
వే యీడకు రావే మీఁద వనము
మోవి గంటివా ముద్దులగులు కదె
మోవిగంటి నా ముద్దులగులు కదె
విటపాళుల నీవేనలిఁ బెట్టుదు
విటపాళుల నీవే నలిఁ బెట్టుదు
ననిచినగో రంటను జెలి! మెచ్చవు
ననిచినగో రంటను చెలి మెచ్చవు
అని వనితామణు లాడఁగఁ బాడఁగ
ఘన మగుతమి మొగ్గలు గిలు పాడఁగ
నలు వగునబలల నారామంబుల
నళికులయుతముల నారామంబుల
పాటీరనగోపరిహారిచందన
వాటీ వేల్లితవల్లీస్పందన
పటిమ చెలంగుచుఁ బాండ్యవధూటీ
చటులోపరిరతిసంభ్రమఘాటీ

విలులితసురభిళవేణీచాలన
లలితసుపరిమళలహరీఖేలన
సరణిఁ బొదలుచుఁ జల్లగఁ గదలుచు
విరులను గురియుచు విరహుల నోరయుచుఁ
గమలము లంటుచుఁ గలువల నొంటుచు
స్తిమితతఁ గులుకుచుఁ దేనెలుఁ జిలుకుచు
నలసతఁ దూలుచు నళితతిఁ దోలుచు
మలసెను దారము మలయసమీరము. 118

సీ. ఏలాలతాజాలడోలాసమాలోల,
బాలామణీగానభాసురములు
ధీరానిలవ్రాత ధారాచలచ్చ్యూత,
దూరాపతద్రజోధూసరములు
మోదావహాంగనవేదాభరవభృంగ,
ఖేదావహజ్ఞాతికేసరములు
నాళీకదృక్కాంతపాళీనవైక్రాంత,
కేళీపరిస్యూతకేసరములు
గీ. కనఁ దగె నకుంఠకలకంఠకంఠనాద
పటుభటాహ్వానకుపితబిభ్యత్ప్రపంచ
పంచసాయకమదహస్తిపైసరములు
మీసరమ్ములు మధుమాసవాసరములు. 119

క. ఆమని యేమని చెప్పెద
నామనికిఁ వికచకుసుమితారామతరుల్
కామనిరంతరకీర్తి
స్తోమముగా నిఖిలదిశల సొబ గొందు నెడన్. 120

చ. ప్రతతభుజానిరర్గళపరాక్రమపాలితలోకుఁ డౌశత
క్రతుఁ డవు డత్యుదారత నొకానొకయాగము సేయఁ బూని దై
వతగురుఁ డైనయాంగిరసుపాలికిఁ జారునిఁ బంప వాఁడు శీ
ఘ్రితఁ జనుదెంచి గీష్పతినిఁ గాంచి జొహారొనరించి యిట్లనున్. 121

క. తిన్నగ జన్నము సేయుమ
తిన్నగవైరి నను బంచె దేవరకడకుం

బన్నుగ నాతని ఫలసం
పన్నుఁగఁ జేయఁ దగు శిష్యవత్సల! యనినన్. 122

క. హృదయమ్మున సమ్మోదము
గదుర సురాచార్యుఁ డట్లు కాని మ్మనుచున్
మది రాగము కుదురారఁగ
మదిరాయతనేత్రఁ జూచి మధురమధురోక్తిన్. 123

పంచచామరము.

పయోజపత్రనేత్ర! గోత్రపత్త్రభంజనుండు స
త్ప్రియోగ మైనయాగ మర్థి తా నొనర్చుపూనికిన్
బ్రియంబునన్ రయంబు మీఱఁ బిల్వఁ బంచె నన్ను యో!
వియోగవేగ మెట్టు లోర్తువే గజేంద్రగామినీ! 124

శా. ముల్లోకంబుల నేలురాజు సవనంబున్ దీర్ప రమ్మన్నచో
నుల్లంఘింపఁగ రాదు గావునఁ బదుద్యోగంబు గాఁ జేసి సం
పల్లాభంబున వేగ వత్తు నిపు డాత్మన్ ఖేదముం జెందకే
యిల్లున్ వాకిలిఁ జూచికొమ్ము మదమత్తేభేంద్రకుంభస్తనీ! 125

చ. అలకలు దువ్వరాదు సరసాన్నములన్ భుజియింపరాదు మై
కలప మలందరాదు తిలకంబు రకంబుగ దిద్దరాదు సొ
మ్ములు గయిసేయరాదు సుమముల్ ధరియింపఁగరాదు సాధ్వియౌ
నలినదళాయతాక్షికిని నాథుఁడు చెంగట లేక యుండినన్. 126

గీ. కాన నీవును మారాక మానసమునఁ
గోరి యీరీతి సత్పథాగారగరిమ
మీఱ నుండుము చారుచకోరనేత్ర!
నీవెలుంగనినీతి నిర్ణీతి గలదె. 127

చ. మఱియొకమాట బోటి వినుమా మనమారసి యీడ కేము క్ర
మ్మఱఁ జనుదెంచునంతకును మాప్రియశిష్యుఁడు చంద్రుఁ డన్నిటన్
వెఱవరి నీమనం బరసి వేడ్క మెలంగుచు నింట నుండు నీ
వఱమఱ లేక కావలయునట్టిపను ల్గొను మంబుజాననా! 128

చ. వయసున బాలుఁ డయ్యుఁ బరువంబగు తెల్వని జాలపెద్ద యెం
తయు గృహకృత్యవర్తనల నన్ మఱపించును నిచ్చలున్ సుఖో

దయమున నెండ కన్నెఱుఁగఁ డారయఁ జూచినఁ గందు మేను స
త్ప్రియహితవర్తనుం డితని వేఱుగ నెంచకుమా తలోదరీ! 12

క. ఇంటికిఁ బ్రాపై యెప్పుడు
కంటికి ఱెప్పవలెఁ గదిసి కాచు నితని కాఁ
కంటికి నన్నుం బిడి వా
ల్గంటీ! కడు బ్రేమఁ బ్రోవఁ గాఁదగుఁ జుమ్మీ. 13

చ. అనినఁ దదీయదార సముదారముదారమదాత్మభావగో
పనమున నోరచూపులను బ్రాణవిభుం దిలకించి యుస్సురం
చని వెస నూర్చి చెక్కిటఁ గరాబ్జముఁ జేర్చి ధరిత్రి వ్రాయుచుః
గనుగవ నశ్రువుల్ దొలుక గద్గదికన్ దల వాంచి యిట్లనున్. 13

శా. ఔ! లెం డేమిటిమాట! హా పయనమా! హాస్యానకుం బల్కుటో
బాళి న్నాహృదయంబుఁ జూచుటకో! నాపైఁ గోపమో! కాక నః
జాలిం బెట్టెడిలాగో! నైజమొ కటా! నన్నొంటిగా నుంచి పో
నేలీలన్ మన సొగ్గె మీకు నహహా! యేనా మిముం బాయుటల్

ఉ. ఏ మనుదాన నేకరణి నే మనుదాన వియోగసాగరం
బేమని యీఁదుదాన గతి యేమని పల్కెడువారిఁ గాన హా!
గామిడి దైవ మీవితము గామిడిమేలపుసేఁత నిర్దయన్
సీమలు గానిసీమలకుఁ జెల్వుఁడ! యేఁగఁగ దెచ్చె నక్కటా! 18

ఉ. పైన మిదేల యన్నఁ గ్రతుభంగము చేసినదోస మశ్రువుల్
పూన నమంగళం బగును బొమ్మని పల్కను నోరెటాడు మీ
తో నయినట్టిపాటు ననుఁ దోడ్కొనిపొమ్మన నెంతభారమో
యా నది మీకు నెట్టు లహహా యెడఁబాయుదె నేమి సేయుదున్

గీ. తలఁపు లొక్కటి గాఁగ నగ్గలపువలపు
చెలిమికలిమిని దొలఁకక కలసి మెలసి
భువిని క్షీరోదకన్యాయమునను వెలయు
దంపతులు చేసినట్టిదే తపము తపము. 18

సీ. తీర్థాల వెంబడిఁ దిరుగుట కొన్నాళ్ళు,
జన్నంపుదీక్షలఁ గొన్నినాళ్ళు
తుద లేని యొక్కప్రొద్దుల చేతఁ గొన్నాళ్ళు,
ఘోరతపంబులఁ గొన్నినాళ్ళు

గురుకులవాసపుగోష్ఠిచేఁ గొన్నాళ్లు,
పున్న మమా సంధుఁ గొన్నినాళ్లు
ఋతుదినంబు లటంచు మది నెంచి కొన్నాళ్లు,
పన్నినవేసటఁ గొన్నినాళ్లు
గీ. గాఁగ యెలప్రాయ మెల్ల నీకరణి నేఁగె
యెన్నఁడును నీదుకౌఁగిలి యెఱుఁగ నైతి
యిపుడు నీవద్దనుండుట కేని యోగ్య
దాయెఁ బగదాయదైవ మీదారి నకట. 136
చ. గళరవమంత్రము ల్చెలఁగఁ గా జిగిసిబ్బెపుగుబ్బచన్ను ల
న్కలశము లంది యంది జఘనం బనువేదికయందు నుండి యు
జ్జ్వలరశనన్ గ్రహించి జిగివాతెరసోమరసంబు గ్రోల వే
డ్కలు గలమన్మథక్రతువు కన్నను వేఱొకజన్న మున్నదే. 137
గీ. తఱుచుమాటలు నేర నిర్దయత మీఱి
నింట నన్నొంటి నుంచిన నేవితానఁ
దాళఁగలదాన నెన్ని చందాల నైనఁ
బైనమైరాక మాన మీపాద మాన. 138
చ. అని కపటాంతరంగ మెనయంగఁ బొసంగఁగఁ బల్కునంగనన్
గని దయ రాఁగ రాగరసకందళికిం దలిరాకుబాకునన్
ఘనముగఁ దుంటవింటిదొరకాయము గాయము సేయ జాయతో
ననిమిషదేశికుం డనియె సాదరమోదరసాదరాత్ముఁడై. 139
చ. వగపకు మింతకంటె బలవంతపువంత పురంధ్రి! మా కిదే
నెగు లెగయించెఁ బువ్విలుగ నీమది నీ మది దోఁచకున్నె నె
మ్మి గదుర వచ్చి పొం డిటకు మీ రన మీఱ నయుక్త మిందుపై
నిగఁ బసిగోల గోలతన మేలను మే లనుకూలమయ్యెడిన్. 140
ఉ. ఇచ్చటియగ్నిహోత్రతతు లెవ్వరిపా లతిథివ్రజంబులన్
వచ్చినయాప్తబంధుల ఘనంబుగ నెవ్వరు పూజసేయువా
రిచ్చట నున్నశిష్యులకు నేగతి నన్నెడఁబాయ లేనిబ
ల్మచ్చిక నీవు వచ్చిన బలా! యబలా! ప్రబలాఘ మంటదే. 141
క. నటవిటవారవధూటీ
పటలీసంవృతము స్వర్గపట్టణ మటకున్

ఘటకుచయుగ ! సతులకు నేఁ
గుట యుచితమె వలదు మదినిఁ గోపము నాపైన్. 142

వ. నావచనంబులకుఁ బ్రతివచనంబులు వచియింపకు నాయాన యాన్యం
బు విడువుము శుభోదయంబుగా మమ్ముఁ బైనంబు పంపుము పోయి
వచ్చెద మనిన నక్కల్కి కల్పితవిషాదంబును కపటలజ్జాభరంబును
గైతవాశ్రుపాతంబునుం గనుపట్ట మీ రిట్లు పల్కిన నేమి సేయఁగల
దాన విరహసాగరం బేరీతిఁ గడవఁ గలదాన నైనను మీయానతికి
సమ్మతింపడితి నన్నుగారాతిజన్నంబు సేయించి పిమ్మట నిమిషమా
త్రం బైన నచ్చట నిలువవలదు మీమాట జవదాఁట నే నంత
చేలనే యాత్మ కుమారునింబలె యీయత్రికుమారునిం బోషించెద
విశేషించి నేఁటనుండియుఁ బ్రాణపదంబుగా గారవించెద మీకుం
బ్రియుం డఁట యితని యేనుం బ్రియునిఁ గాఁ దలంపవలవదె
యిచ్చటివిచారంబులు మాని నెమ్మదిగాఁ బయనమ్ముఁ బోయిరమ్మని
యనుపుటయు నయ్యనిమిషగురుండు శతమఖమఖనిర్వర్తనకౌతు
కాయత్తచిత్తంబున నమరావతీపురంబునకుం జనియె ననుటయు.

—ఆశ్వాసాంతము.—

శా. అర్ణోరాశిగభీర! భీరహితచిత్తాభోగ! భోగావళీ
వర్ణోదీర్ణవిభా! విభావశమితవ్యాపాద ! పాదాంబుజా
భ్యర్ణప్రాప్తసుహృదమిత్ర ! మిత్రహితసంపద్వాస ! వాసచ్ఛటా
స్వర్ణాంచత్కవిరాజ! రాజకసదస్సమ్మాన్య ! మాన్యగ్రణీ. 144

క. కల్పకసమదానకళా
కల్పక నిజపాణిపద్మ ! కాంచనపద్మా !
కల్పక సత్కవివినుతా
కల్పక ! సత్కీర్తిసూత్ర ! గాయకరత్నా ! 145

పృథ్వి. మంతుకృద్వైరిసామంతమంత్రిస్మయ
ధ్వాంతవిధ్వంసనోదగ్రజాగ్రద్రవీ!
సంతతౌదార్యసౌజన్యగంభీరతా
శాంతిసంపన్న రాజద్గవీ భారవీ! 146

గద్య. ఇది శ్రీజానకీరామచంద్రచరణారవిందవందనకందళితానందకందాళ రామానుజగురుచరణసేవాసమాసాదితసాహితీవైభవ శేషము కృష్ణయార్యతనూభవ సుకవిజనవిధేయ వేంకటపతినామధేయప్రణీతంబైన శశాంకవిజయం బనుమహాప్రబంధంబునందు ద్వితీయాశ్వాసము.



శ్రీ ర స్తు.

# శ శాం క వి జ య ము.

## తృ తీ యా శ్వా స ము.

—∞( )∞—



రంగపతిపదాంబుజ
సారంగచ్ఛిత్త ! చిత్తజాతజయంతా
కారా ! కవిమందారా!
క్షీరాంభోనిధిగభీర ! సీనయధీరా!

వ. అవధరింపుము సూతుండు శౌనకాదిమునీంద్రుల కిట్లనియె నవ్విధం బున బృహస్పతి దివస్పతిసదనంబునకుంజనిన యనంతరంబ యిక్కడ,

ఉ. ఒంటిగ నచ్చెఁ జంద్రుఁ డిపు డొంటిగ వాతెరజుంటితేనియల్
గెంటనిప్రేమఁ గ్రోలి రని కేళిని దేలక యున్నముత్యపుం
బంటవలంతివింటిదొరబారికి నోరువలే నటంచు నా
తుంటరిగుబ్బలాఁడి వగతో విగతోరువివేకపాక యై.

గీ. గురునివెంబడిఁ దా నొకకొంత దూర
మరిగి యాతనియనుమతి నంబుజారి
క్రమ్మఱఁగ వచ్చునాలోనఁ గంబుకంఠి
పట్టఁగూడనితమకంబు నెట్టుకొనఁగ.

సీ. సరసాన్నపానము ల్నాకపాకంబులు,
వింతవింతగఁ జేసి దొంతి నునిచి
యొప్పైనవలుగులు నుష్ణోదకంబులు,
నొనర మజ్జనగేహమున నొనర్చి
చెలువొందువలువలు వెలపొచ్చుసొమ్ములు,
పొందళ్కుతట్టలఁ బొందుపఱిచి
కుంకుమంబు రసంబు గోరజవ్వాజియు,
రతనాలగిన్నెల జతనపఱిచి

గీ. పువ్వుబొత్తులపాన్పులు ప్రీతిఁ బఱచి
పొంకముగఁ గేళిగృహము నలంకరించి
యింతి యాతనిరాకకు నెదురు చూచు
చుండఁ దారామనోవల్లభుండు వచ్చె. 5
క. వచ్చినయాతని వేగమె
పచ్చలగద్దియను నునిచి ప్రమదామణి తా
నొచ్చంబు లేనికూరిమి
ముచ్చట లాడుచును బ్రేమ ముప్పిరిగొనఁగన్. 6
ఉ. ఊరికిఁ బంపి వచ్చితివె యొజ్జల నీగురుఁ డమ్మచెల్ల! సం
సారముమీఁదిభ్రాంతిఁ జనఁజాలఁడు దవ్వుగ సాఁగిపోయెనే
దారున రాఁడుగా మరలి దైవకృతంబున నొంటిపాటు చే
కూరిన దింక నీమనసుకూరిమి నేగతి నాదరించెదో. 7
గీ. ప్రొద్దు వోయెను లెమ్మింక సుద్దులేల ?
శిరము మజ్జన మొనరింప వరుస నేటి
కనుచు నమ్ముద్దుచాన యత్యాదరమున
నలపు సొలపును వలపు సయ్యాట మెసఁగ. 8
సీ. ఫాలభాగమున వజ్రాలపాపటబొట్టు,
తళుకుతళుక్కని తాండవింపఁ
గరసరోజముల బంగారుగాజులు రత్న,
కంకణమ్ములు గల్లు గల్లు మనఁగఁ
జెమటచేఁ జాఱినచికిలికస్తురిబొట్టు
ఘుమఘుమతావులఁ గుమ్మరింప
మెఱుఁగారుకమ్మలు మృదుకపోలములపై,
ధళధళత్కాంతులు దళుకు లొత్త
గీ. గొప్ప ముడివీడ నుదుట ముంగురులు గూడ
గుబ్బచనుదోయి హారముల్ గుసిసియాడ
నీటువగ మీఱ వన్నెకానికి మిటారి
దమక మెద నంట సంపెఁగతైల మంటె. 9
గీ. చెండ్ల గెలిచిన మెఱుఁగుపాలిండ్లతోడ
బీరములు చూపవచ్చు జంబీరములను

జించి సారస్య మంతయు వంచినట్లు
నిమ్మపండ్ల రసంబున నెలఁత యంటె. 10

మ. తరుణీరత్నము బాలకైతకదళోదంచన్నఖాగ్రంబులన్
గురులన్ మెల్లనఁ జీరిపాయలిడి చిక్కుల్ పాయఁ గాఁ బ్రాముచున్
గరపంకేరుహరత్నకంకణఝుణత్కారంబు తోరంబుగా
వరగంధామలకంబుఁ బెట్టెను సుధావారాశితొల్పట్టికిన్. 11

ఉ. జాలుపయంటఁ జెక్కి బిగి చన్గవ నిక్కఁగ బాహుమూలశృం
గారరుచుల్ వెలిం బొలయఁగా నగుమోము చెమర్ప రత్నకాం
చీరవముల్ సెలంగ నభిషేక మొనర్చె లతాంగి వానికిన్
మారునిమాలు సాగరకుమారునిఁ బట్టము గట్టెనో యనన్. 12

సీ. పసమించుమాదరపాకపోరువలచేఁ,
దడియార నొత్తి కుంతలము లార్చి
సాంబ్రాణిధూపవాసన నించి జవ్వాది,
చేనంటుచును కురుల్ చిక్కు దీర్చి
అఱవిరివిరిజాజివిరులు చుట్టినజాలు,
సిగను జంటరుమాల సొగసుపఱిచి
తళుకునిచ్చులపునెత్తమ్మిపూవులబంతి,
పుట్టంబు హొయలు గాఁ గట్టనిచ్చి
గీ. కమ్మకస్తురిచేఁ దిలకమ్ము దీర్చి
యొంటివజ్రంపుబావిలీ లుంగరాలు
చేసరాలును సరిపెణ ల్చిలుకతాళి
పంకజేక్షణ వాని కలంకరించె. 13

చ. బలురతనంపుఁజెక్కడపుఁబళ్లెర ముంచి పసిండిగిండిలో
సలిలము నుంచి ముత్యసరిసన్నపుబియ్యపుటన్న మొల్పుఁబ
ప్పులుఁ బొడికూరగుంపు కలుపు ల్వడియంబులు చారు లూరగా
యలు కలవంటకాలు పరమాన్న మిడెన్ లలితాంగి వానికిన్. 14

సీ. విరహాగ్ని నీరీతి గరఁగె నామానసం,
బనినట్ల వెన్న గాచినఘృతంబు
పాలఁబోల్పఁగ యను నీపాలు సేయుట కిదె,
యానవా లన్నట్టు లానవాలు

నెమ్మి నీరీతి నాకెమ్మోవిగ్రోలుమీ,
పూని నీ వన్నట్టు పానకంబు
తనవచోమాధుర్య మెనయునా యివి చూడు,
మన్నట్టు మేలిరసాయనములు
గీ. నొప్పుగా గిన్నియల నుంచి యుపచరించి
పాణిపంకజకంకణక్వాణ మెసఁగఁ
బువ్వుసురటిని విసరుచు భోజనంబు
కాంత సేయించెఁ దనమనఃకాంతునకును. 15

క. బంగారుబొమ్మ రంగగు
భృంగారుజలంబు వంపఁ బ్రియ మిం పెసలా
రంగా మోదంబున సా
రంగాంకుఁడు ధౌతపాణిరాజీవుం డై. 16

ఉ. కాంత యొసంగువీడియముఁ గైకొని యింతి యొనర్చునవ్విధం
బంతయుఁ జూడ వింతవగ యై కనుపట్టె నటంచు నెంచుచుఙ్
గంతునిరంతు లోర్చుక చొకాటపుగాటపుఁ బువ్వుదోఁట నే
కాంతముగా వసించె హృదయంబునఁ బెక్కుదలంపు లూరఁగన్.

క. అలపొలఁతుక దా నంతట
వలపులు వడ్డికిని బాఱ వాంఛలు మీఱఙ్
దలపోయుచుఁ బనిదోఁపక
నిలుపం జాలనివిరాళి నెమ్మదిఁ బొదలన్. 18

సీ. తేట యాగొజ్జఁగినీట మజ్జన మాడి,
వలిపచెంగావిపావడ ధరించి
పసిడిరాయంచుబవంతిచీర ధరించి,
రాణించుపై ఠాణిరైక దొడిగి
వదనాంబుజమున జవ్వాదిచారికఁ దీర్చి,
గొప్పఁగా నెఱజాజుకొప్పుఁ బెట్టి
గమగమ వలఁచుకుంకుమము మేన నలంది,
మృగనాభిపంకంబు మెడను బూసి
గీ. మినుకకాటుకరేఖ కన్గొనలఁ దీర్చి
చరణయుగమున లత్తుక జాజుకొలిపి

తన యొయ్యారంబు నిలువుటద్దమునఁ జూచి
యపుడు గైసేసి గడిదేరి యామిటారి. 19

సీ. చిగురాకువిలుకాని చేతిచక్రమురీతిఁ,
  గమ్మలు ధగధగత్కాంతి గులుక
కుసుమసాయకధనుర్గుణనినాదములీలఁ,
  గలమేఖలాఘులంఘులలు వెలయ
చెఱకువిల్తాప్తినిబిరుదుడిండిమలీలఁ,
  జరణనూపురఝుళంఝుళ లెసంగఁ
బంచసాయకసార్వభౌమసత్కీర్తి నాఁ,
  దారహారము తళతళ యనంగ
గీ. సారె రతిరాజుమ్రోల హెచ్చరిక దెలుపు
చక్కి మెట్టెలు గిలుకుగిలుక్కు మనఁగ
లలితకందర్పసామ్రాజ్యలక్ష్మి నాఁగ
గంధగజయాన వచ్చె శృంగారవనికి. 20

వ. ఇవ్విధంబున నచ్చకోరలోచన యచ్చటికి వచ్చి విచ్చు నిచ్చలు నొబ్బర విచ్చి విచ్చలవిడి కాలిననిచ్చలంపుఁబచ్చకపురంపుఁబరాగంబునం బ్రోదులుగాఁ బాదులు గట్టి సజ్జకం బైనగుజ్జగొజ్జంగినీరు నించి పెంచినపొన్నలుపొగడగున్నలు గన్నేరులుక న్నెగోరంటలుచిన్నిసురపొన్నలు నిమ్మలు కమ్మసంపెఁగలు నింపు మీఱునునుపోఁకమాఁకులు డంబు మీఱునారికేళంబులు తావులకుం దావు లయినమావుల నెలమావుఁబ్రోవులు వాసనాసారదంబు లగుశారదంబులు నారదంబులు నీరదంబులడంబు విడంబించుచీఁకటిమాఁకులును లికుచకుచాకుచసాదృశ్యఫలంబులపోడిమి మీఱుదాడిమీనికుంజంబులు జంబూవృక్షంబులు జంబీరంబులు ఫలరసజంబాలంబు లైనపనసతరుజాలంబులు సాలహింతాలతాలతక్కోలసాలంబులుం గలిగి యెల్లెడల నల్లిబిల్లిగా మొల్లమిగ నల్లికొనినమల్లియల నుల్లాసంబునం దిరుగు తేఁటిపిల్లలగరులగములఁ గనినిగనిగనిజిగి మిగులు మొగులతెగ లని ముచ్చికలం బురివిచ్చి యాడుమవ్వాంపుఁజిలువ జవ్వానుల తెక్కు మొక్కు తెరల మరువున మలయపవననటనర్తితలలితలతికాలతాంగులనటనంబులకు న్ఘటనంబులుగా జోకమీఱుతదీయకేకారవంబులు షడ్జంబులుగా

సమదకోకిలకాకలీరవంబులు పంచమశ్రుతులు గా గానంబుఁ జేయు
తేఁటిబోటిపాటల కనుగుణంబుగా నుగ్గడించుభరతపిట్టలదిట్టంపు
సొల్లుకట్టులం గమ్మి యఖండనాదమేదురం బై యయత్నకల్పితసంగీత
మాధుర్యంబునం బొలుపొందునందనోద్యానంబుచందంబున హృద
యానందం బగునమ్మందిరోద్యానంబునఁ జెంగల్వకొలనిచెంగటరంగా
రుబంగారుకలశంబులం బొలుపొందుజీవదంతపుఁజవిక వసియించునమ్మ
నోహరాకారునిం దూరంబునం గాంచి కాంచీకలకలంబులు నిగుడ
గబ్బిమబ్బులోపల నొరపు సెరపుమెఱపుఁదీఁగెలాగునం బొదరిండ్ల
డాఁగుచు మనోన్మాదంబునఁ దూఁగుచు నిద్దంపుటద్దంబులగతిముద్దు
గులుకుబాహుమూలంబులరుచులు చెమచెమక్కని వెలిం బర్వఁ
దళుక్కునఁ జనుగుబ్బలు నిక్క నిక్కి విరులు గోసి కప్పుగొప్పునం
జెక్కుచుఁ బుప్పొడితిన్నియల నెక్కుచుఁ జిఱుచెమటజాఱినతిలకంబు
తేటనీటిబావులనీడం జూచి నీటుగాఁ గొనగోట దిద్దుచుఁ జేనున్న
పూబంతి కాలువ నద్దుచు మొయిళ్లనుండి ముత్తియంబులు రాలువి
ధంబున గొప్పునుండి తెలిమల్లెమొగ్గలు రాలఁ దేనెవాఁకలు దాఁటు
చుఁ జిగురుటాకుల నెలవంకగోళ్లు నాటుచుఁ జెదరినముంగురులు
చక్కందువ్వుచు నల్లనల్లనం గులుకుచుఁ బల్లటీలం గని నవ్వుచు మల
యానిలంబున నరజాఱుపయంటమాటిమాటికిం జేర్చుచు రాయంచ
లకుఁ దనగమనవిలాసంబు నేర్పుచు వెడవెడసడలినపోకముడి బిగి
యించునెపంబునఁ దనపొక్కిలిచక్కదనంబుఁ గన్పడం జేయుచుఁ గర్ణా
వతంసంబునకై చివురులం గోయుచు మరువంపుఁబొదులజాడ ద్రాక్ష
పందిళులనీడఁ గప్పురపుటనంటులమాటునఁ బోఁకమ్రాఁకులచాటునఁ
బటికంపు మెట్టికలకేళాకూళులతేవఁ గుసుమకేసరపరాగధూసరం
బైనత్రోవం జేరవచ్చు నవసరంబున. 21

కనియె మృగాంకుఁ డాచెలిని గన్గొనినంతనె తళుక్కుబెళుక్కుగా
ననిచి కటారి నూరి యెద నమ్మదనుం డెద నాట మీటఁగా
మనసు ఝుళుక్కున న్మెయిఁ జెమర్పఁగ నోర్వఁగ రానితత్తరం
బునఁ బులకల్దనర్ప ధృతి మొగ్గగ దిగ్గున లేచి యాత్మలోన్. 22

ఔరా చక్కదనంబు హాసు! మురిపెం బయ్యారె! యొయ్యారమా
రౌరా! మైసిరి హైసరే! సొగసు మే! లాహా విలాసంబు! ల

జ్ఝారే జవ్వన! మద్దిరా వగలు! మజ్ఝారే తనూవిభ్రమం!
ఈరామామణితోడ నీడు గలరా యీరేడులోకంబులన్ ? 23

గీ. కొమ్మ గా దిది బంగారుబొమ్మ గాని
యింతి గా దిది జాజిపూబంతి గాని
కలికి గా దిది మరునిపూములికి గాని
భామ గా దిది లావణ్యసీమ గాని. 24

చ. నవతనుకాంతియుక్తిని ఘనప్రతిభం బని తాను తారకా
నివహ మెదిర్చి యింతి తపనీయరుచి న్నిజసత్త మాయఁగా
బవలు దొలంగి చేరి పదపద్మముల న్నఖరత్నవైఖరిన్
దివిరి భజించెఁ గా దనఁ దదీయసమాఖ్యను దన్వి పూనునే ? 25

క. పాటలగంధి మొగంబుం
దేటను నే నోడి బంటు తెలఁగైతి నిదే
సాటిగ ననుఁ గొల్చినయుడు
కోటియు నీచెలువనఖరకోటికి నోడెన్. 26

ఉ. పల్లవజాతిబింకములఁ బాపుట కే నిటు సాటి కాంతిసం
పల్లవనిర్జితంబులు ప్రవాళము లవ్వివరంబు గన్నదే
పల్లవపాణిపాదములఁ బర్వ్వజపాధికలీల వాటిసొం
పల్లవసిష్ఠుతండ్రి గనినట్టివిలంతియు నెన్న నేర్చునే ? 27

ఉ. కామతరుప్రవాళనవకందళరేఖలొ లేక మన్మనః
ప్రేమ నవానురాగఝరి పేరినతావులొ కాక యుల్లస
త్కోమలకాంతిపూరనదశోకనదంబులొ లేక మోహరా
త్రీముఖసాంధ్యరాగపరదేవతలో కనకాంగిపాదముల్ ! 28

గీ. కమలగర్భాదుల జయించుకలికిజంఘ
లాత్మరాశిగ మకరంబు నరసి ప్రోచె
స్వజనసంరక్షకైకతత్పరుల కెందు
నెదుటిమందాధికారత నెంచ నేల ? 29

చ. కరభము లన్నపేరు వినఁగానె వికారము దోంకు దెల్పెడిన్
కరివరతుండము ల్సమతఁ గైకొని వచ్చి ధరిత్రి వ్రాలె నీ
హరివరమధ్య పెందొడలు హైసరె జానులపేరియందవుం
గరుడులపైడి కంబములె కాయజమల్లుని బంధనోచితిన్. 30

చ. గొనబురువారపుంజలువకోకకు బంగరునీటిచిన్కు_డా
ల్గొనకొనఁ జేసి మాటికిఁ దళుక్కనుచు న్వెలిఁ బర్వుకాంతి నిం
పెనసినయీయెయారితోడ లింతుక పోఁకినయంత నబ్బు గో
బ్బునఁ బడివేలరంభలఁ గవుంగిటఁ జేర్చినసౌఖ్య మొక్కటన్. 31

క. ఈనారీమణినునుతొడ
లేనుఁగుతుండములె కాని యెద నుడిఁ బెట్టన్
బూనినకదళీతరులన్
దా నేలా పిల్లపిల్ల తరముల్ దరమున్?. 32

చ. కటి యొకటే ధరిత్రి నవఖండము లేఁగఁ జాలు నందుపైఁ
బటుజఘనంబె చక్రములఁ బంపు లిడున్ గుచము ల్మహోన్నతం
బిటు సృజియించి దీని కొకయించుక కౌను సృజింపఁ డాయె నే
మిటికొ విరించి యింతిమెయి మించు కనుంగొని మోహ మందెనో?

సీ. ఈలేమ చక్కదనాలవెల్లియొ కాక,
తళుకుకన్నెడిస బెళుక నేల?
యీరామ రతిదేవియారామమో కాక,
పొక్కిలిపొన్నపూ పుట్ట నేల?
యీకల్కి మదనునిచేకటారియొ కాక,
కౌనువేరిటిపిడి గాంచ నేల?
యీరాజముఖి పంచదారరాసియొ కాక,
యారుచీమలబారు చేర నేల?

గీ. మేటియీబోఁటి లేటపన్నీటిచెర్వు
కానిచో వళివీచిక ల్కలుగ నేల?
యీవనిత నాదుపుణ్యంపుఁదీవె యరయఁ
గానిచో చన్నుగుత్తులు పూన నేల?. 34

గీ. అంఘ్రులకుఁ బద్మసారూప్య మతులకును
గమలవరగర్వసంపద కర్ణములకు
శ్రీవిలాసంబు గలిగియుఁ జెలియకౌను
కేలనో లేమి దాని యదృష్టరేఖ!. 35

ఉ. బంగరుకుండ లంచు విరిబంతు లటంచును జెండ్లటంచు నా
థాంగయుగంబ టంచు సమదద్విపకుంభము లంచు నెంచి ప

ల్కంగ నయుక్త మిక్కిలికిగబ్బిచనుంగవ కంతురాజరా
జ్యాంగములందు నెక్కుడగుసంగము యౌవనరేఖఁ బొల్చుటన్. 36
సీ. వీణకాయలు గుణశ్రేణిపై నిడుకొన,
* యెఱుఁగవు యొరుక్రింద నీఁగియుంట
తమ్మిక్రొమ్మొగ్గలు తమముద్దు చూపెడి,
నలజన్మపంకంబు † దలఁప నెఱుఁగ
వరయక నెరపుబంగరుకుండ ‡ లరయంగఁ,
జేరి వేఁడిమి చూప నీరు గావె?
§ బట్టగూర్చుతనానఁ బుట్టచెండ్లగరీని,
మఱచెనో తలకొట్లమారితనము
గీ. నొమ్ము గాస్పించె బలుగజనిమ్మపండ్లు
గలుఁగుసారస్యమును దాము కాసుఁ జేయఁ
గలవె యీయింతిబిగిచన్నుఁగవకు సాటి
యొకటొకటితోడ జోడుగా నొనరుఁ గాని. 37
చ. కమలదళాక్షి హస్తములు గన్గొనఁ బద్మిని కౌనుదీవెపో
ణిమఁ బరికింప శంఖినియె నెన్నడ హస్తిని యౌఁ బరేంగిత
క్రమ మరయంగఁ జిత్తినియె గా కటు పల్కులు వేయునేటికిం
బ్రమద మెసంగ నిక్కలికి పక్కన నవ్విన జాతు లేర్పడున్. 38
చ. మృగమదసారసౌరభము మీఱినయాసతికంఠలక్ష్మి న
చ్చుగ నెదిరించు కౌనుపాలుసుంగనుశంఖ మదెంత చుట్టియుం
దెగువ మొగాన నిల్వవలదే యపు డేర్పడకున్నె దానియా
సొగసులుగుల్కు పల్కుబడి సోయగముౝ దనరిత్తకూఁతలున్. 39
క. పగడంబుల తెగడంబుల
జగడంబుల గెలువఁ జాలుసఖిమోవి జగా
నిగరాల న్మగరాలౝ
నగరాల న్వ్రేలకు నమ్ము నాతిరదమ్ముల్. 40
క. అంబుజముఖి నెమ్మొగ మన
యంబును నిద్దమగు నద్దమగుఁ గానియెడౝ

* ఎఱుఁగరు తమయొళవెల్లవారు. † దల్లఁపవేమొ. ‡ లవియంత. § ఫ్లాని గుర్తుతనానఁ బూలచెండ్లరిదిని.

బింబమునకుఁ బ్రతిబింబము
డం బౌకెమ్మోవి పేరిటం దాలుచునే?. 41
ఉ. చక్కదనంబు పాల్కడలిచాయఁ దగెం గుచమందరాద్రి యా
చక్కినె రోమరేఖనుభుజంగము గన్పడె నందుచేఁ గదా
యిక్కడి తియ్యమోవిసుధ లింపులు గుల్కెడు దీని గ్రోలకే
యెక్కడి సౌమనస్యము? హరీ! యిది నీకృప లేక కల్గునే?. 42
సీ. ఇది మనోహరకాంతి కింపైనబింబంబు,
బింబంబు గా దిది బెడగుకెంపు
కెంపు గా దిది తేఁటియొంపనిమంకెన,
మంకెన గా దిది మంచిచిగురు
చిగురు గా దిది వింతజిగిహెచ్చుపగడంబు,
పగడంబు గా దిది పానకంబు
పానకం బిది గాదు పలుచనిచెఱకుపా,
ల్చెఱకుపా లిది గాదు కురుజుతేనె
గీ. కురుజుతేనెయుఁ గా దిది కుసుమరసము
కుసుమరసమును గా దిది గొనబుజున్ను
జున్ను గా దిది చవిగుల్కుసుధలదీవి
సుధలదీవియుఁ గా దిది సుదతిమోవి. 43
ఉ. నీరజగంధిమోవిజిగి నెక్కొనుముక్కరముత్తియంబు దా
మారుఁడు ధాతువాదపటిమన్ ఘుటికాకృతి గట్టినట్టిసిం
దూరితపారదం బనఁగ నూత్నరుచిం దనుపట్టెఁ గానిచోఁ
గారణ మేమి నాసకును గాంచనకోశసమృద్ధి గల్గఁగన్. 44
మ. తళుకుం దేటయు విప్పు సోఁగతన మందం బొప్పఁగాఁ దారకా
కలితచ్ఛాయల నింపు సొం పెసఁగునీకంజాతకన్దోయితోఁ
జెలువారన్ సరసంపునవ్వులకు వచ్చెన్ జూడు రేఁజీకటిం
దలవంపు ల్గనునట్టితమ్మియు దివాంధం బైనలేఁగల్వయున్. 45
క. కులుకునెఱవంకకన్బొమ
సొలపుల నీయింతివాలుచూపులఁ జూడన్
వలరాజువంటివాఁడును
విలునమ్ములు వైచి దాస్యవృత్తికిఁ జొరఁడే. 46

సీ. పదపల్లవంబులఁ బద్మసంపదయును,
ప్రపదంబులను గచ్ఛపప్రభూతి
రక మైనజంఘల మకరలీలాయోగ,
మూరుల వరమనోహారితయును
గొనబుటూరున నామఃకుందనందకలక్ష్మి,
చారుగళంబున శంఖగరిమ
యందంపురదములఁ గుందంపువిభవంబు,
పరఁగుమోమున మహాపద్మసుషమ
గీ. యలకముల నీలకాంతియు నెలవుకొలిపి
నలువ నవనిధులను గూర్చి చెలువఁ జేసి
వరుస నాలెక్క లిరువంకవ్రాసె ననఁగ
నీనలినపత్త్రనేత్రకు వీను లమరె.
క. నుదురా జిగి క్రొన్నెలచె
న్నుదరాగతమునను దేంట్లనుదురా వెట్టు
న్నదురా యని ముంగురు లె
న్నదురా నెఱివేణి జీవనదులాజసమున్.
సీ. సవరంబు తనకుఁ దాసవరంబుగా నెంచు,
మలయు మజ్జను మజ్జ మాను మనును
బర్హాంబు కనికరం బర్హాంబు గా దను,
నళితెక్కకప్పులకప్పు లొసఁగు
నీలంబు జిగి గాంచి నీలంబు వల దను,
నలరారు నాచు మున్నాచుదరమి
చీఁకటిమా నోర్చు చీఁకటి ప్రాన్పడ,
తమము గైకొన దనుత్తమము గాఁగ
గీ. కంపు సాంబ్రాణిధూపంబు పెంపు పెంపు
వంపు మరువంపుటిందీవరంపు రంపు
గుంపు మృగమదవాసన ల్గుప్ప రనఁగ
సాటిలే కొప్పు నీయింతిజాలుకొప్పు.
గీ. ఆకృతిని హేమరూపి యగానైనముక్క
ఛాయఁ జూడఁ దిలోత్తమసరణి దోఁచె

మోముఁ జూచిన శశిరేఖమోడి యమరె
మాటపోడిమిఁ జూచిన మంజుఘోష. 50

ఉ. పన్నగకన్యల న్మనుజభామల యక్షసరోరుహాక్షులన్
గిన్నరసన్నుతాంగులను ఖేచరభామల సిద్ధకాంతలన్
జన్నపువిందుసుందరులఁ జారణవారణరాజయానలన్
గన్నది కాదె దీనిమెయి కైపులు వైపులు చూడ మెచ్చుటన్. 51

గీ. చూడకుండంగఁ గూడ దీసుదతిసొబగు
చూచినంతనె మదిలోనఁ జొచ్చెఁ బాళి
యేమిటికి వచ్చె నిచటికి నిందువదన
యెట్టులున్నదో యింక రతీశ్వరాజ్ఞ ! 52

క. అని చింతించుచు నుండఁగ
వనజాయతనేత్ర వచ్చి వానిసమీపం
బునఁ గూర్చుండెను మేనం
గొన బగుజవ్వాదితావి గుబులుకొనంగన్. 53

గీ. వచ్చి కూర్చున్న వాఁడు నవ్వన్నెలాడిఁ
జూచి ధృతి గుంది యందంద చోద్యమంది
తనువు పులకింపఁ జిత్తము తత్తరింప
వివశతను జెంది మఁగుడ వివేక మొంది. 54

క. ఏటికి వచ్చితి నే నీ
తోఁటకు నిందేల వచ్చెఁ దోడ్తోడనె యీ
బోటి మరుండు మనోధన
పాటచ్చరుఁ డేమిపాటుఁబడ నున్నాఁడో!. 55

క. నిలువర మయ్యెను మును నా
తలఁచినయది మది విరాళి తహతహపడి తా
నెలమిన్ బైకొనవచ్చెను
గలకంఠుల నమ్మరాదుగా కల నైనన్ !. 56

క. వినను గానీ నాచే
నైనగతి న్నిలిపి చూతు నను చిత మగుచో
నానా మోహం బనుచున్
మానవతిం జూచి న్యాయమార్గము దోఁపన్. 57

మ. ఇది యే మిచ్చటి కేల వచ్చితివి నీ కింతం బను ల్లేవె యొ
ప్పుడు పోపో పతి యూరలేనియెడ నీపల్పోకశృంగారముల్
సుదతు ల్సేయుదురే రహస్యమున నిచ్చోఁ జేరి నా చెంత నుం
డెద విట్లుండిన లోకు లూరకయ సందేహింపరే చూచినన్. 58

క. అనఁ జిఱునవ్వు మొగంబున
దనరఁ జకచ్చకితకర్ణ తాటంకరుచుల్
దనుకఁ మకమక చినుకఁ
కనకాంగి హొయ ల్చెలంగఁగా నిట్లనియెన్. 59

ఉ. వచ్చిన నేమి రావలసివచ్చితి నేపని యున్న దింట నీ
విచ్చట నుండఁగా మనసు కింపగుసొమ్ములుఁ బెట్టినంత నే
యొచ్చెము లేనినీసరసనుండుట కేమియు నోచ నైతినా
యొచ్చట నున్న నేమి మనకేమిటి కెవ్వరు సంశయింపఁగన్. 60

ఉ. కాకయె సంశయించినను కాదన నేటికిఁ గంతుబారికిన్
లోకువ గానివారు ధరలోఁ గలరే యిపు డిన్ని నాళ్ళకై
చేకుఱె నొంటిపా టిచటఁ జేసినపుణ్యముచేత నింక నన్
గాఁకలఁ బెట్టకే విను ముఖాముఖిఁ బల్కెద దాఁచనేటికిన్. 61

ఉ. నీ నెఱనీటు నీసొగసు నీరసికత్వము నీవిలాసము
న్నీ నవమోహనాకృతియు నీయెలప్రాయముఁ జూచి చూచియున్
మాననిప్రేమ నేచి యభిమానముచేఁ దమి దాచి యున్నినా
ళ్లేను మనోజుబారికి సహించితిఁ బొంచితి మోహ ముంచితిన్. 62

సీ. కమ్మనినీముద్దుకెమ్మోవి గని యాస,
మీఱంగ గ్రుక్కిళ్ళు మ్రింగి మ్రింగి
యొఱ పైననీదు పేరురముచందముఁ జూచి,
గుబ్బచన్నుల బయల్ గ్రుమ్మి గ్రుమ్మి
యింపైననీచెక్కు లీక్షించి ముద్దిడ,
నూరకే వాతెర యొగ్గి యొగ్గి
చూడఁజూడఁగ వింతసొబగైననినుఁ గాంచి,
తహతహ పైఁ బడఁ దలఁచి తలఁచి

గీ. యెపుడు పైకొందు ముచ్చట లెపుడు గందు
నెపు డొదవుఁ బొందు విరహాగ్ని యెపుడు డిందు

ననుచు నే నుందు నేటికి నచ్చె సందు
లీలఁ బెంపొందురతులఁ దేలింపు మిందు. 63

చ. అన విని గుండె జల్లనఁగ నచ్చెరుపాటును రిచ్చపాటు నె
క్కొన గరుపాటునుం గదురఁ గొండొకసే పటు లూరకుండి నె
మ్మనమునఁ దెల్విఁ బెట్టి మటుమాయలమారుని దిట్టి యక్కటా
వనితలభావము ల్తెలియవచ్చునె యంచుఁ దలంచి యిట్లనున్. 64

క. తగునే నీ కిది యెంతటి
తెగువే యీసు ద్దొకింత తెలిసిన జగతి
న్నగ వారడి యపయశమున్
మగువా! చేపట్టినట్టిమగవాని కగున్. 65

ఉ. ఇంతిరొ పాలవంటికుల మీవు జనించిన దౌట నెన్నఁ గా
నెంతయు వన్నె వాసిగను నింటను జొచ్చిన దేమి చెప్ప కం
చంతటికోఁపురంబు సతు లౌననఁ జేసెదు జాతి నీతి యొ
క్కింత దలంప కిప్పనికి నేటికి నేఁటికిఁ గ్రొత్తఁగాఁ జొరన్. 66

ఉ. ఓర్వదు బంధుజాల మడకొత్తున నొత్తును మామగారి దే
పర్వినమాత్ర పంట పగఁ బట్టును బావ మగం డటంటిమా
దుర్వ్యవహారోషభీషణతఁ దోడనె చంపఁగఁ జూచుఁ గావునన్
సర్వవిధంబుల న్సతికి జారసమాగమకాంక్ష చెల్లునే ?. 67

చ. రమణిరొ! యేటి కిట్టిహపరంబులకు న్వెలి యైనయట్టియీ
క్రమమున విన్నపాటు తమకంబును దిట్టతనం బొయారమున్
బొమముడిపాటు జంకెనయుఁ బూనికయున్ మురిపెంబు మోడిపం
తము చిఱునవ్వు దోఁప వనితామణి కన్గొని వాని కిట్లనున్. 68

శా. కానీరా యిటువంటినీతము లనేకంబు ల్వినుం బోలివి
న్నా నేను న్నినువంటినీతిపరులు న్నారీకుచాభోగభో
గానందైకరసంబె బ్రహ్మ మని మోహాయత్తతన్ మానమున్
ధ్యానంబు న్జపముం దపం బుడిగి యుండం జూడమే యిద్ధరన్. 69

ఉ. గోలతనానఁ బల్కెదవు కుంభకుచాపరిరంభగుంభనో
ద్వేలసుఖోదయం బనుభవింపనివాఁడవు గానఁ గూరిమిన్
దాళఁగ లేనిదాన దయదాఁచకు నీకిటు తప్పునేమము
ల్చాలుర చాలు నీగొనబుచక్కెరమోవి యొసంగి యేలరా. 70

ఉ. సూనశరార్తికి న్మిగులఁ జొక్కుచు దీనతఁజేరి మ్రొక్కుచున్
దానయి కోరి పైఁబడినదాని నుపేక్ష యొనర్పఁ బాతకం
బౌ నిఁక నోర్వ నే నిమిషమైనను నాగొన బైనమే నిదే
కానుక నీకు రూప జితకై రవసాయక! ప్రాణనాయకా!. 71

క. గణ్యత నేమైనసరే
ప్రాణ్యావనముఁ జేయవలయు రసికసుతప్రా
వీణ్యా! "పరోపకారః
పుణ్యాయ" యటన్న వచనము న్వినలేదా. 72

క. అతివలహృదయము లారసి
రతికలన న్దేల్ప లేనిరట్టడిరూపున్
జతురతయు జవ్వనంబును
వితయ చుమీ యడవిఁ గాయువెన్నెలరీతిన్. 73

ఉ. ఎంచఁగ రానిమోహమున నే నిటు పిన్నటనాఁటనుండియు
న్బెంచితిఁ బెద్దఁజేసితిని బేర్మిగఁ బ్రాయము వచ్చినంతనే
యెంచక మాటలాడె దిపు డిన్ని ప్రియోక్తుల కిమ్ము పుట్టెఁగా
మంచిది నిన్నుఁ గూడుటకె మాకు స్వతంత్రము లేకపోయెనే. 74

ఉ. నావుడు నాతఁ డేమియు నన న్మన సొగ్గక మోహ మెట్టిదో
యేవగఁ ద్రోసినన్ విడువ దీవగలాడి బలారె యుక్తమా
యీవిత మంచు నిట్లనె సురేంద్రునకుం గురుపత్ని వై జగ
త్పావనకీర్తి గాంచితివి పాడియె నీకిటువంటిపోడుముల్. 75

చ. వికలచరిత్రుఁ డైన ముదివెంగలి యైనఁ గురూపి యైనను
న్ద్రికరణశుద్ధిగా మగఁడె దేవుఁ డటం చని విశ్వసించి యొం
డొకఁ డెటువంటివాఁ డయిన నొప్పదు కోరఁగ సాధ్వి యిట్లెటుం
గక మది దప్పె నేని కలన న్నిరయంబు రయంబున న్గనున్. 76

క. కోపము వల దిది నీ పీ
పాపమునకుఁ జొచ్చినం బ్రపంచంబున నిం
కేపోలఁతి మగని యొద్దన్
గాపుర మొనరించు వలదు కాపథ మవినన్. 77

క. కటకట! గురువులతోనే
గుటగుటలా నేను గోరుకోరిక వితగా

నటు నిటు ప్రొద్దులు పుచ్చుచు
నటనట: బెఱగాయసుద్దు లాడెద వారా! 78

చ. మగని నతిక్రమించుటలు మానినికిం దగ దంటి వొప్పితిః
మగఁడు మగం డనంగ మది నుక్కువ యెవ్వనియందొ కంటి కిం
పగునతఁ డెవ్వఁడో, యతఁడె! యాతనిఁ గా దని యన్యుఁ గూడినః
దగ దిది కాముకీజనులధర్మము మర్మము నే నెఱుంగుదున్. 79

ఉ. బాళి మనంబునం దణఁచి ప్రాయము వ్యర్థము చేసి యూరకే
దూలిన నేమి పుణ్య మని తోఁచెను ము న్నలదారుకావన
స్త్రీలు గిరీశునిః గలయరే వ్రజభామలు శౌరిఁ గూడరే
యాలలనాశిరోమణుల కందున నిందున నేమి చెప్పుమా. 80

సీ. కన్నకూఁతు రటంచు నెన్నక భారతీ,
తరుణిఁ గూడఁడె నీపితామహుండు
మేనత్త యనుమేర మీఁజి రాధికతోడ,
నెనయఁడే నిన్న నీ యనుఁగుబావ
వదినె యంచు నొకింత వావి లేకయె జ్యేష్ఠు,
నెలఁతతోఁ బొందఁడె నీగురుండు
మునిపత్ని యన కహల్యను బట్టఁడే నీదు,
సహపాఠి యగు పాకశాసనుండు

గీ. ఇట్టిమీవారినడతలు గట్టిపెట్టి
యమ్మ నే చెల్ల! న్యాయంబు లాడె దార!
కడకు నీరంకు నీవెఱుంగనివితాన
దూరెదవు నన్ను జలపోరి దోసకారి!. 81

ఉ. లోకములోనఁ గొంద ఱబలు ల్పతులం దనియింపలేక య
స్తోకమనీష నన్యపురుషు ల్దమకాంతల నంటకుండఁ దా
టాకులలోన వ్రాసిరి పరాంగనఁ గూడినఁ బాప మంచు న
య్యాకులపాటుఁ జూచి యిపు డాకులపాటెనయంగ నేటికిన్?. 82

ఉ. పాప మటంచు నీపనికిఁ బైకొన కుండితి వేని కంతుసం
తాపముచేత నాతనువు దాళఁగలే దిసుమంత నీకు ని
ష్పాపము పోవు టెట్లు నను పాలన సేయుము నీవు దీన నా
పాపము నాది ప్రాణపరిపాలనపుణ్యము నీది వల్లభా!. 83

ఉ. ఎక్కువ మాట లేల విను మే బహుభాషలదానఁ గాను నా
యక్కఱ చిన్నపుచ్చక ప్రియంబున నేలిన మేలు గానిచో
మక్కువ లేనివారిఁ బతిమాలిన నేమిఫలంబు చూడరా
గ్రక్కున నింద నీకు నయి ప్రాణము లర్పణఁ జేతు గట్టిగన్. 84

ఉ. ఒల్లను శీల మాపఁగని నొల్లను కాపుర మొల్ల మాన మే
నొల్లను చుట్టపక్కముల నొల్లఁ గులంబును నొల్ల నామనో
వల్లభ! నీదుకెంజిగురువాతెరఁ గ్రోలక మాన నేల నీ
యొల్లనిసుద్దు లింపెనసి యున్నదినం బొకటైనఁ జాలదే. 85

ఉ. ఏలర జాలిఁ బెట్టె దిపు డేలర వేగమె యెన్నిపువ్వులన్
వ్రాలదు తేఁటి? యట్లు మగవాఁ డనువానికి దోస మున్నదే?
బాలిని దానె పైఁబడినభామను బిగ్గ కవుంగిలించినం
జాలదె యింద్రభోగపదసౌఖ్య మన స్మృతి వేఱె యున్నదే. 86

సీ. చిత్తజాకార! నీ చెలువుఁ జూడఁగ లేని,
కమలాక్షి నిలువాలుఁగన్ను లేల?
కాంతుఁడ! నినుఁ జేరి కౌఁగిలింపఁగ లేని,
జక్కవగుబ్బెతచన్ను లేల?
ప్రాణేశ! నీప్రక్కఁ బవ్వళింపఁగ లేని,
తరలాక్షిచక్కనితను వ దేల?
రమణ! నీతోఁ గూడి రతికేళి నెనయని,
బాలికామణియెలప్రాయ మేల?

గీ. చిన్నివయసున నుండియు నిన్నె కోరి
యున్న నను బోయమరునికి నొప్పగించి
తేలచూచిన నిన్ను నే నేల విడుతు
కోర్కె దీరంగ వీఁకఁ బైకొందుఁగాక. 87

చ. సరసుఁడ! నీమనంబునకె సమ్మతి గావలె నంచు నింత నే
పరసితి యాఁచి యాఁచి యిఁక నంగజసాయకకీలికీలచే
నరనిమిషంబు నోర్వ నధరామృత మానఁగ నిమ్ము కానిచోఁ
దెఱవను జంపినట్టికొల దీరక తాఁకుసుమీ మనోహరా!. 88

చ. అని యిఁక మాఱు పల్క వల దంచును దీనత దోఁప నాడుచున్
జనుఁగవ యుబ్బఁగాఁ బయఁట జారఁగఁ గ్రొమ్ముడి వీడ దేహ మె

ల్లను బులకింప నీవి వదలం గరకంకణకింకిణీకన
ద్ఘనమణిమేఖలాధ్వనులు గ్రమ్మఁగఁ బైఁ బడి కౌఁగిలించినన్. 89

చ. పరవశుఁ డయ్యె వాఁడు నలపంకజగంధియుఁ జొక్కి వ్రాలె న
య్యిరువురు నట్లు మోహముల నేమియుఁ దోఁపక యుండి రంత నా
గురుకుచ వానిఁగౌఁగిట జనుగుబ్బ మొన న్నురమంగ వాఁడు న
య్యరవిరిబోఁడిమోవిచిగు రానఁగ నెం చినుమంత సోంకినన్. 90

ఉ. భావము గాంచి యావికచపంకజలోచన మంచ మెక్కియు
న్నావులు చాలురా హృదయవల్లభ! యం చని వానియందపు
న్మోవి బిఱాన పంటిమొన నొక్కుచు నానుచుఁ జొక్కు చుండఁగా
నావగఁ గాంచి యారసికుఁ డట్లనె దా నొనరింప నెంచినన్. 91

మ. తరితీపు న్వగలెత్తి మోవి మెలుపుందప్పింపులం జాల య
క్కఱఁ బుట్టింప నతండు తత్తర మొసంగ న్గొమ్మ ధమ్మిల్లముల్
జెరపిల్ గైకొని బాహుమూలయుగళి న్గిల్గింతఁ గావింప న
య్యరవిందానన నవ్వి నాతఁ డధరం బాసక్తిమై నొక్కినన్. 92

చ. కమలదళాక్షి సంకలితకంకణఝుంకృతి సీత్కృతు ల్సవి
భ్రమగతి మీఱ మేను గనుపార మనోజవికారపారవ
శ్యము దయివాఱ నీవి దిగజాఱ నొకంగము జాఱువారఁగా
రమణునిపేరురంబుపయి వ్రాలెను జంత్రపుబొమ్మకై వడిన్. 93

ఉ. మోమునుమో మురంబు నురము న్భుజము ల్భుజము ల్దొడల్దొడ
ల్ప్రేమఁ గదించి పాదములు పిక్కలు నొక్కటిగా మలంచి పో
రాములనిండుకౌఁగిటఁ దిరంబుగ సౌఖ్యపయోధి నేలి రా
లేమయుఁ బ్రాణనాథుఁడును లీల భుజంగయుగంబుపోలికన్. 94

సీ. కన్నాత లాఁగించి కాంతుమోము గదించి,
సారెసారెకు మోవిఁ జప్పరించి
రతిచాతురికి మెచ్చి రమణుఁ గౌఁగిటఁ గ్రుచ్చి,
మోహాన నూఱారుముద్దు లిచ్చి
తనియక యెదురెక్కి దయసేయు మని మ్రొక్కి,
గుదికాళ్లు వెల్పునఁ గూర్చి నొక్కి
మదనశాస్త్ర మెఱింగి మనసుకొంకుఁ దొఱంగి,
కాయంబు లొక్కటి గాఁగ మెలఁగి

గీ. యరిది సూదంటుశిలవలె హత్తి హత్తి
గౌనబుతీవియచందానఁ బెనఁగి పెనఁగి
కౌముదిని జంద్రశిలవలెఁ గరఁగి కరఁగి
సమరతుల నేలె నాబాల సరసలీల. 95

చ. ఎఱుఁగదు చన్నుదోయి బిగియించి కరంబులఁ బట్టు టెంతయున్
ఎఱుఁగదు వాఁడిగోళ్ల తుదనిక్కవ లెల్లను గ్రుచ్చుటేమియున్
ఎఱుఁగదు లేఁతమోవిచిగురెంతయుఁ గుమ్మెలువోవ నొక్కట
త్తరుణి యఖండసౌఖ్యరసతన్మయత న్మరుసంగరంబునన్. 96

ఉ. మక్కువఁ దిట్లుకొట్లు బతిమాలుట లూఁటలు లెచ్చిపోరుట
ల్పక్కమరల్పు నేర్పులును బద్దులు నబ్బినచోట ముద్దులున్
మ్రొక్కులు పల్కు మోడి విసరు ల్కసరు ల్కొసరు ల్చెలంగ నా
చక్కెరబొమ్మ నెమ్మి మరుసామున సోముని గూడె వేడుకన్. 97

మ. కనుదమ్ము ల్ముకుళింపఁగాఁ బులక లంగశ్రేణి నిండారఁ గాఁ
దనువు ల్సొక్కివిచేష్టితం బొరయఁగాఁ దత్తద్గతు ల్మాని నె
మ్మనము ల్నిర్వృతిఁ జెందఁగా నలరుచున్ బ్రహ్మైక్యలీలాసుఖం
బన నింపొందుసుఖోన్నతిం గనిరి రత్యంతంబునం దిర్వురున్. 98

సీ. చిలుక వ్రాలినమేలిచిఱుదొండపం డన,
మొనపంటినొక్కులమోవితోడఁ
గపురంపువీడెంపుఁ గఱ చుట్టుఁ గనుపట్టు,
గబ్బిసిబ్బెపుఁజనుకట్టుతోడఁ
గమనీయమణిమాలికాశశపదచంద్ర,
రేఖాంక మాతనురేఖతోడ
నలరువిల్తునిసాము జిలిబిలిచెమటచే,
సొగసు మీఱిననవ్వుమొగముతోడఁ

గీ. గొంగొకటి కట్టి మిగిలినకొంకఁ జుట్టి
కరమునను బట్టి పీడికచభరంబుఁ
దగ నమర్చుచు విభునికై దండఁ బూని
తారశృంగారలీలావతార వెడలె. 99

గీ. ఇవ్విధంబునఁ జనుదెంచి యిగురుఁబోఁడి
విభుని తనవెన్కనుంచుక వింతవారు

లేరుగా యంచు సదనంబుఁ బాఁగఁజూచి
యలబలము లేనినిజమందిరాంగణమున. 100
శా. పన్నీటం జలకంబు లాడి నునుజాళ్వాయంగదట్టంబుతోఁ
బన్నీటందవుజల్వఁ గట్టి హరు వొప్పన్ దావిగంధంబు మే
న న్నిండార నలంది జాజివిరిదండ ల్జుట్టి జవ్వాజిరే
ఖ న్నెమ్మోమునఁ దీర్చి నూత్న మగుశృంగారంబు రంగారఁగన్. 101
గీ. కాంతుసట్లనె కై చేసి కళ్కు వసిఁడి
తమ్మి మొగ్గల వాగ్రితయందంపుజిగులు
దుప్పటిని కట్టఁగా నిచ్చి తోడుకొనుచు
వచ్చి వాఁకిటితెలుపు తీవ్రముగ వైచి. 102
సీ. కసటు వోఁ బన్నీటఁ గడిగి పువ్వులతావి,
వల నైనకమ్మజవ్వాజివలపు
నెఱపెడిసురటీలగరులగాడ్పులు సోఁకి
పలుకుకిన్నెరతంతి యళుకు కులుక,
కెరలి యల్గించుకోకిలపల్కు తమి కింపు,
నింపుకెంపులగుంపు నిగ్గుజగ్గు
చప్పరకోళ్లమంచము సఖి నెలపాన్పు,
తలగడ బటువుబిల్లలును జిల్గు
గీ. తెరయు చౌశీతిబంధంబుటరిదిపటము
లగరుసాంబ్రాణిధూపంబుపొగలు నూడి
గమ్ము లొనరించుకీల్బొమ్మ గమియుఁ గల్గి
వెలయుపడకింట నాదంట విభునిజంట. 103
చ. జిలిబిలితేనియ ల్చిలుకుచెందొవచందువక్రింద నంద మై
చలువలఁజిల్లుసన్నవిరిజాజులపాన్పునఁ గమ్మతెమ్మెర
ల్పొలయఁగ నుండి ప్రాణవిభుమోముఁ గనుంగొని లేఁతవెన్నెల
ల్గలకొన నవ్వుచున్ దమిఁ జెలంగి పునారతికౌతుకంబునన్. 104
చ. గమగమవాసన ల్దిసలఁ గప్పఁగ నొప్పగుకప్పురంపుబా
గము లవు డిచ్చి లేఁతవిడిగాఁ దగు గేదఁగి రేకుటందవుం
దములవుటాకుమడ్పులును దా నొసఁగం గొఁటి కిమ్మటంచు నా
రమణుఁడు మోము ద్రిప్పటయు రాజముఖీమణి యట్ల చేయుడున్

మ. మొనపంట న్నదు పందుకొంచుఁ జెలికెమ్మో వింత యానంగ నం
గన సీత్కారకపోతకూజితచమత్కారంబు సంధిల్ల నా
తనిబింబాధర మాని నొక్కెఁ దమిచేత న్వార లీరితి నిం
పానరం జుబ్బనచూఱగాఁగఁ గొని రన్యోన్యాధరంబు ల్దమిన్. 106

క. అద నైనపికిలిగువ్వలు
గదుముచు నొండొంటిమీఁదఁ గవియువితానన్
మదవతియుఁ బ్రాణనాథుఁడు
మదనాహవకేళివేళ మార్కొని రంతన్. 107

క. గుత్తంపుగుబ్బ లురమున
హత్తుగసరి యాని యాని యారసికుండున్
బిత్తరియును బెనఁగిరి సరి
బిత్తరులుం బిరుదుజెట్లు బెనఁగినమాడ్కిన్. 108

చ. పెనఁకువత్తరంబునను బిత్తరి కత్తెఱ నీవి జాఱిన
న్నవిలుకానిసాదనకు నాథుని: బైకొన లాఁగి కేల్మెయిన్
ఘనమణిఘంటికాకటకకంకణకింకిణికాంచికా
స్వనములు నివ్వటిల్లఁ బురుషాయితకేళి కుపక్రమించుచున్. 109

చ. అమరిక మీఱఁగా నిలిచి యందపు మై సిరి నుల్లసిల్లఁగాఁ
గొమరుమిటారిగబ్బి చనుగుబ్బలవ్రేగునఁ గౌను నాడఁగా
రమణి క్రమక్రమంబున దురంపువగ న్నటియించె వింతగా
సుమశరసూత్రధారకుఁడు సొంపున దిద్దినపాత్రకైవడిన్. 110

సీ. కట్టుగంబంబునఁ గట్టినగంధేభ,
మనఁగ నల్లన నసియాడి యాడి
బిరుదుజెట్టియు నాఁగఁ బెనఁగి యారాటాన,
నందంపుఁదొడలచే నదిమి యదిమి
చికటారిమాష్టిని చెలువునఁ గూర్చుండి,
పూనిక మీఱంగఁ బొదలి పొదలి
చెండు గోరించినచెలువున లివ మీఱ,
నొయ్యారమునఁ గొంత యుచికి యుబికి
గీ. కలయ మెలఁకువ బెలుకుచుఁ గులికి కులికి
వలపుఁదెలుపుచు నరయరఁ బలికి పలికి

యలపుసోలపున నిలువక నిలిచి నిలిచి
మొనసి ప్రియుఁ గూడె మగపాడి ముద్దులాఁడి. 111
సీ. అరవిందమకరందమళి యానినటు లాని,
వరునివాతెఱ చిఱుపాలు గ్రోలు
గిరి హత్తుమదమత్తకరి వ్రాలునటు వ్రాలి,
చనుగుబ్బ లతనివక్షమునఁ గ్రుమ్ము
నెరసానిదొరసాని హరి నెక్కి దుర మెక్కి,
వగ వింతజోదైనవగపుఁ జూపుఁ
బవమానలవమాననవమాలి కన సోలి,
యదరునిట్టూర్పుల నలపుఁ దెలుపు
గీ. అమరికకు మెచ్చి కెమ్మోవి యాన నిచ్చు
నానికల నిచ్చు నరిపల్కు మని యదల్చుఁ
గేళిఁ బడలితి వని నవ్వుఁ గేల దువ్వు
బాల గిఱికొన్న బాళి పుంభావకేళి. 112
సీ. సొంపారఁ గుల్కెడుకెంపుబావిలితోడ,
నలరువజ్రపుఁగమ్మ లల్లలాడ
నుదుటిపైఁ జెమటబిందువులు గుంపులు గూడ,
ఘుమఘుమతావిని గొప్పు వీడ
రమణీయతారహారములముత్యము లూడ,
నిగ్గుపాపటబొట్టు నృత్య మాడ
నాయాసభరమున నాననాబ్జము వాడ,
విభుఁడు ప్రేమను దను వేడ్కఁ జూడ
గీ. మించుతీవియ మెఱసి నటించుజాడ
నరిదిచూపులు ప్రియుహృదయంబు గాఁడ
నంగజావేశమున సన్న మైనవ్రీడ
రమణునెద క్రీడ సలిపె నారతులప్రోడ. 113
ఉ. * నెయ్యక నెయ్యుచిక్కులును జిన్ని మిటారపుగోటినొక్కులున్
నెయ్యముఁ దొల్కుచూపులును నిచ్చలు మెచ్చుల గిచ్చువైపులున్

* అర్థము చింత్యము.

దౌయ్యనికూర్మలుం దనరఁ దౌయ్యలియుఙ్ శశియుఙ్ దివానిశం
బయ్యెడ నుండి రిట్లు మదనాహవమోహవశానురక్తులై. 114

వ. అనుటయు. 115

శా. ఆచంద్రాచలచందనాచలధరణ్యాకల్పకీర్తిప్రభా
శోచిష్కేశపటుప్రతాపశలభస్తోమీకృతారివ్రజా
ధీచాతుర్యలసద్వచోవిజితమాధ్వీగోస్తనీపాణితా
క్ష్వాచిత్కాంచితసత్కవిప్రవర వాగ్జాలప్రియంభావుకా. 116

క. స్వామిద్రోహరగండా!
సామాదికచతురుపాయసాధనశౌండా!
శ్రీమద్గుణప్రకాండా!
హైమగృహాళిందపూర్ణహయవేదండా! 117

స్రగ్విణీవృత్తము. దానధారాసుతా! ధర్మసత్యవ్రతా!
దీనరక్షాప్రియా! ధీరభావోదయా!
భానుభాస్వద్ఘృణీ! బ్రహ్మవంశాగ్రణీ!
మీనలక్ష్మాకృతీ! మేరుభూభృద్ధృతీ!. 118

గద్య. ఇది శ్రీజానకీరామచంద్రచరణారవిందవందనకందళితానందకందాళ
రామానుజగురుచరణసేవాసమాసాదితసాహితీవైభవశేషము కృష్ణ
యార్యతనూభవ సుకవిజనవిధేయ వేంకటపతినామధేయప్రణీతంబైన
శశాంకవిజయం బనుమహాప్రబంధంబునందుఁ దృతీయాశ్వాసము.

శ్రీ ర స్తు.

# శ శాం క వి జ య ము.

## చ తు ర్థా శ్వా స ము.



మధురాధిపసన్నుత
సామాదికచతురుపాయసంధానభవ
శ్రీమానితకవివినుత
క్షేమంకర సుగుణహార సీనయధీరా. 1

వ. అవధరింపుము సూతుండు శౌనకాదిమహామునీంద్రుల కిట్లనియె. 2

ఉ. అంత గురుం డనంతమహిమాతిశయంబున నప్పులోమజా
కాంతుఁ డొనర్చుయాగము నఖండితవైఖరి నిర్వహించి తా
నెంతయు భక్తియుక్తి నతఁ డిచ్చుబహూకృతు లంది హర్షిత
స్వాంతత నాశ్రమంబునకు వచ్చె వియచ్చరకోటి గొల్వఁగన్. 3

క. తారయు వాచస్పతికిని
దా రయమున నెదురు వచ్చి తాత్పర్యంబుల్
గూరిమియు భయము భక్తియు
గౌరవముల్ హర్షముల్ ప్రకాశింపంగన్. 4

క. పాదములు గడిగి పయ్యెద
చేఁ దడి యొత్తి పదజలము శిరమునఁ గొని యా
వేదండయాన యతనికిఁ
గైదండ యొసంగె వినయగౌరవ మెసఁగన్. 5

ఉ. ఇంటికిఁ దోడి తెచ్చి మణిహేమమయోజ్జ్వలపీఠి నుంచి ప
య్యంట చలింపఁగా సురటి నల్లన వీచుచుఁ బ్రాణనాథ! న
న్నొంటిగనుంచి యీకరణి నుండుదురే? క్రతువాయెనే? సుఖం
బుంటిరె యిన్ని నాళ్ళు? పురుహూతబహూకృతిఁ గంటిరే? యనన్.

మ. క్రతువాయె న్సుఖ ముంటి వాసవునిసత్కారంబుఁ గైకొంటి ది
క్పతు లత్యుత్తమరత్నభూషణధనవ్రాతంబు లర్పించి రు

స్మృతి నొక్కంటఁ గొఱంత లేదచట చానా! నామది న్నీదుసం
గతి లేకుండుట యొక్కటే కొదువ యోగక్షేమమే నీ కిటన్.

మ. అని వాచస్పతి పల్కువేళ శశి సాష్టాంగంబుగా మ్రొక్కి ని
ల్చిన దీవించి కుమారకా! సుఖమె బాలిక్ శాస్త్రము ల్నీవు చి
తన గావింతువె భోజనాదివిధులన్ మద్భార్య నిన్ బ్రేమచే
తను బోషించునె యగ్నిహోత్రమును నిత్యంబు న్విచారింతువే.

క. అనుటయు శాస్త్రంబును చిం
తన సేయుదు మీావధూటి తాత్పర్యముతో
ననుఁ బ్రోచు నన్నివిధముల
ననిన స్సంతుష్టహృదయుఁ డై గురుఁ డంతన్.

క. కాంతామణియును జంద్రుఁడు
మంతనమునఁ జెలఁగి మెలఁగుమార్గముఁ జూడన్
వింతగఁ దోఁచిన మది నొ
క్కింతయును్ సంశయించి యెఱబఱికమునన్.

క. వీరలచందముఁ గన నొక
తీరై యున్న యది గురుసతీశిష్యవిధం
బారయఁ జూడంబడ దా
నారాయణుఁ డెఱుఁగు నే మన న్గలవాఁడన్.

క. కాని మ్మైనను జూాతము
నానాఁటికి వీరు నడుచునడక పరిచయం
బై నట్టిమందె మేలమొ
కానియెడ న్కిల్బిషంబు గలదో యనుచున్.

మ. పరికింప న్మఱి వార లబ్బినయెడన్ భావంబులన్ గొంకకన్
పరిహాసంబులు కన్నుసన్నలును భ్రూభంగంబులు న్నర్మముల్
సరసోక్తు ల్పచరించువైఖరుల నెల్లం గాంచి కోపించి యా
తరుణిం జేరఁగఁ బిల్చి రోష మిగురొత్తం బల్కె గద్దించుచున్.

ఉ. ఓసి యిదేమి యీానడత యొప్పదు సాధ్వి వటంచు నమ్మితిన్
మోసము వచ్చె నీని నతిమూర్ఖుని శిష్యుఁ డటంచు నెంచితిన్
వాసవముఖ్యసర్వసురవర్జితచర్యుఁడ నై చరించునా
వాసియుఁ వన్నెయుం దొఱఁగి వచ్చెను దుర్యశ మేమి చెప్పుదున్

క. పెద్దలు లేనియెడన్ మి
మ్మిద్దఱ నే నొంటినునిచి యేఁగఁగ నగునే
ముద్దియ! యేమని చెప్పుదు
పెద్దతనము వోయె బుద్ధి పెడతలఁబట్టెన్. 15

చ. శివశివ! యెంతపాతకము సేయఁగ నొగ్గెను సిగ్గుమాలి వీఁ
డవిరళభక్తిమై జనని యం చని *యెన్నుచుఁ దండ్రి యంచు న
న్నవిరతము న్భజించి నిఖిలాగమము ల్చది విట్లు చేసెనే
యువిదల నమ్ముటే పురుషు! లుర్వి నవిశ్వసనీయ లెన్నఁగన్. 16

చ. నిలకడ సున్న వావి నహి నేస్తము నాస్తి భయంబు లేదు చం
చలహృదయల్ దురాత్మక లసత్యలు కాంత లదాంత లింతయున్
దెలియక యానృపాలకులు నిగ్రహ మొప్పఁగఁ బోతుటీఁగెయు
న్బొలయఁగ నియ్య రంతిపురిఁ బుత్త్రుల నైనను నమ్మరెంతయున్. 17

గీ. తెఱవ! మీశీల మెల్లను దివ్యదృష్టిఁ
జూచినాఁడను నీ వింక దాఁచవలదు
నీవె చెనకితివో లేక నిన్ను వాఁడె
చెనకెనో తెల్పు తెలిసి శిక్షింతు ననిన. 18

క. బొటవ్రేల నేల వ్రాయుచుఁ
గటకటపడి మేను వడఁకఁ గనుఁగవ నశ్రు
ల్పొటపొట రాలఁగ నేడ్చుచుఁ
గుటిలాలక శిరము వంచికొని యిట్లనియెన్. 19

సీ. ఏమని యుత్తరం బే నియ్యఁ గలదాన,
నెందునఁ దీరు మీసందియంబు
ఇంక నాపయి దయ యెట్లు గల్గును మీకు,
సైఁపక యున్న నాజన్మమేల
పాపపుదైవంబు పాపెనో మనలను,
తలను వ్రాసినవ్రాలు తప్ప దింకఁ
ద ప్పొనర్చినవారి దండింతు నంటిరి,
త ప్పొనర్పనివారు ధరణిఁ గలరె

* నన్నును.

గీ. యజ్ఞభవుకూఁతురైనయహల్య మొదలు
నేర మొనరించె ననినచో నేర్చి నడువ
నొకరితర మౌనె మగవార లోర్వవలయుఁ
గానిచో వట్టినగుపాటు గాదె మీకు. 20

క. పిచ్చుకపై బ్రహ్మాస్త్రము
నచ్చుగఁ దొడఁగినవితాన నబలపయి స్మీ
కెచ్చుగఁ గోపం బిటు రా
వచ్చునె తప్పైన సైఁపవలయు నటంచున్. 21

మ. చరణాబ్జంబుల వ్రాలినేత్రయుగళీసంజాతబాష్పాంబువు
ల్వరద ల్గట్టఁగ లేవ కున్న నతఁ డవ్వామాక్షి నీక్షించి తాఁ
గరుణన్ లేవఁగ నెత్తి యీనడక లింకన్ బాడి గాదంచుఁ జె
చ్చెర వీడ్కోల్పి హృదంతదంతురమహాచింతాభరాక్రాంతుఁ డై.

క. కోపంబున నత్రిసుతున్
శాపింపఁ దలంచి లోన క్షమియించి మనో
గోపన మెసఁగఁగఁ దనదుస
మీపమునకుఁ జంద్రుఁ బిలిచి మెల్లనఁ బలికెన్. 23

చ. చదివితి నీతి వేదములు శాస్త్రము లన్నియు నీదుభక్తికిన్
హృదయము సంతసిల్లె నిఁక నీతలిదండ్రులఁ జూచు టొప్పుఁ బె
క్కు దినము లాయె వచ్చి మదిఁ గూర్మియు భక్తియునుండనిమ్ము మే
లొదవెడుఁ బోయి రమ్మనుచు నొజ్జలు వేమరు తీవరింపఁగాన్. 24

క. ఆమాటకు మది ఝల్లన
సోముఁడు గురుఁ డిట్లు పలికె చూచితె యకటా!
మోమాట లేక దైవము
నామీఁద న్గరుణమాలి నాతి న్బాపెన్. 25

గీ. సందియము దోఁచె నీతనిడెందమునకుఁ
బోయి రమ్మన్నచో నుండఁ బోసఁగ దిచటఁ
బోలఁతి నెడఁబాసి ప్రాణము ల్నిలిచి యున్నె
తెగువ నెటు లైనఁ బోవక తీర దనుచు. 26

క. చేరి ప్రణమిల్లి నేరిచి
నేరక నే నడుచుకొన్న నేరము దయ మీ

గోరుచుకొను డని పలుకుచుఁ
దారను నెడఁబాసి తుహినధాముఁడు వెడలెన్. 27

చ. అటువలె నంటుకాఁడు చని నంత నెలంత దురంతచింతచేఁ
బొటపొట బాష్పముల్దొరుఁగఁ బొక్కుచు స్రుక్కుచు దిక్కులేనిత్రో
క్కుట దిట మాఱి మారవిశిఖమ్ము లురమ్మునఁ దూఱి పాఱఁగాఁ
ద్రుటి ఘటికాసహస్ర మయి తోఁపఁగ నాపఁగరాని కాఁకతోన్. 28

సీ. కొండపైఁ బడినట్లు కొంతసే పేమియు,
నన లేక మిన్నుగన్గొనుచు నుండు
మిగుల వెక్కస మైనమీనాంకుశిఖిపొగ,
ల్వెలికిఁ దార్చినరీతి వెచ్చ నూర్చు
విరహంపుఁబెనునీటివెల్లువ కెదు రీఁది,
నట్లుగాఁ జేతు లి ట్టట్టు వైచు
ధనముఁ గోల్పోయిన దారిగాఁ బుప్పొడి,
మే నంట విరిపాన్పుమీఁదఁ బొరలుఁ

గీ. గొలఁకులను జాఱుకన్నీటి గోట మీటుఁ
దొడరి యడిగెడునిల్లాండ్రతోడ మాటుఁ
జింతను జెమర్పు చెక్కిటఁ జేయుమర్చు
ననలవిలుకానిపటుధాటి నవ్వధూటి. 29

గీ ఇందు ర మ్మన్న మాటల చంద మన్న
నదిగొ నెలవంక లెంత లె స్సాయె ననిన
రాజభోగంబు లన్న నారాజవదన
రమణుపే రని మది నెంచు భ్రమ వహించు. 30

సీ. విభుఁడు మాటాడుచో వెదకి తప్పులు పట్టుఁ,
బొలయల్క నవలిమోముగఁ బరుండుఁ
గొనగోటఁ బ్రియుఁడు చెక్కుఁ జాఱుక్కునను జీఱ,
నిది యేటిసరస మం చీసడించు
ముచ్చటై నాథుండు మోవిఁ బల్మొన నొక్క,
వెలయాలనా యంచు వీడనాడుఁ
దమకాన ధవుఁడు కందర్పకేళిఁ బెనంగ,
నెంతసే పని తీవరింప సాగు

గీ. నెక్కడ మనం బటన్నఁ జుఱుక్కు మనును
ఏలనే కోప మనిన నేమేమొ గొణఁగు
మేను పతిచెంత మనసు రేతేనిచెంత
నిలిపి యాచాన విరహంపు నెగులుతోన. 31

సీ. పతి పిల్వఁ బిల్వఁ దాఁ బలుకక వెడవెడఁ,
బనులచేఁ గాలయాపన మొనర్చు
మాటికి మాటికి మగనితో మెండొడ్డి,
చలపాదితనముస నలిగి యుండు
మమతతో నాథుండు మాటాడి యుంచుక,
యటు మొగం బైనచో నెటికె విఱుచు
రతికాంక్ష ధవుఁడు చీరఁ జెఱంగుమాసె నం,
చవ్వాలి కేఁగు నిరాశ గాఁగ

గీ. నెల్లగృహకృత్యములయం దుపేక్ష సేయు
నఖిలభోగంబులను వ్యర్థ మనుచు రోయు
జారవిభుమీఁదిమోహంబు సారె కంటి
కాఁపురము నొల్లదాయె నాకలువకంటి. 32

ఉ. చేరల కెచ్చు కన్నుఁగవ చెక్కుల యందము చెప్ప శక్యమా
బారలఁ గొల్వనౌ నురము బాహులు జానులు మీఱునూఁదుబం
గారు కవుఁ బ్రనాళములఁ గైకొన వంఘ్రిలు లోకమందు లే
దారసికత్వ మాగుణము లారతిచాతురి వానికే తగుఁ. 33

ఉ. భామలజాతిచేష్టితవిభావము లెల్ల నెఱుంగుకామసం
గ్రామకిరీటి యైన విటరాయఁడు మోహనమూర్తి యెంతయున్
నామది చల్లఁ జేయుప్రియనాథుఁడు నన్నెడఁబాసె నయ్యయో!
యీమగఁ డేల యీసదన మేటికిఁ దక్కిన వేమి యేటికిన్. 34

ఉ. కోరిక కొన్నినాళ్లు మది కొంకు దొఱంగక కొన్నినాళ్లు చే
కూరక కొన్నినాళ్లుఁ జనఁ గూర్మివిటుం డొకఁ డబ్బె నబ్బినన్
వారక పేరులేనిప్రతిబంధము పెన్మిటి నంచు వచ్చి నా
డారక పోరి పాపె నకటా మగనాలయి పుట్ట జెల్లునే! 35

సీ. అలయించు నొకవేళఁ బొలయల్క చిక్కుల,
సొలయించు నొకవేళ సొగసువగలఁ

గరఁగించు నొకవేళఁ గళలయిక్కువ లంటి,
మఱఁగించు నొకవేళ మెఱుఁగుమోవిఁ
బలికించు నొగవేళఁ బావురాపల్కులు,
కులికించు నొకవేళఁ గొసరి నవ్వి
మూనించు నొకవేళ నరిది మోమున మోముఁ,
బూనించు నొకవేళఁ బురుషరతికిఁ
గీ. జిగురువిలుకాని కైన నాసొగసుకాని
యొప్ప లే దన్న ముది మదిదప్పినట్టి
యీమగం డేడ నే నేడ యేడ కేడ
యేటి కీపోరు వీనిపొం దెవతె గోరు. 36
ఉ. ఆడిక లైన నేమి మగఁడారడిఁ బెట్టిన నేమి చుట్టము
ల్వాడక యున్న నేమి సరివారలు నవ్విన నేమి కాఁపురం
బూడిన నేమి నాదగుప్రియుం డిలుఁ బాసి చనంగ నేనునుం
దోడనె పోవ నైతి మదిఁ దోఁపక పోయె నిఁకేమి సేయుదున్. 37
గీ. ఏకరణి నైన వానితో నెనయు టొకటి
కానిచో మేనిపై నాస మాను టొకటి
యింతయే కాక మగఁ డంచు నతని మొగముఁ
జూచి సైరింప లేను త్రిశుద్ధిగాను. 38
చ. అని యనిశంబు నెంచు మదనాశుగదుర్దినకుర్దనంబునన్
ఘన మగుమూర్ఛఁ గాంచు వగకానివగ ల్గణియించు నైజపుం
బెనిమిటి నీసడించు మదిఁ జెక్కుతలంపులు నించు వాఁడు వ
చ్చె నని తలంచు నెచ్చటను చీమ చిటుక్కనిన జ్జలించుచున్. 39
క. ఇటు లెంతయుఁ జింతింపఁగ
జటినీమణి యోర్తు బాల్యసఖి యింటికి వ
చ్చుటయును దత్ప్రాజనములు
ఘటియించి రహస్యముగను గామిని పలికెన్. 40
ఉ. నీవ యెఱింగి యుండుదువు నేనును జంద్రుఁడు నెస్త మాటయున్
బూవును దావియు న్వలెను బొందుగ వాఁడును నేను నుండుట
ల్నావిధి పెన్మిటె యిపుడు నన్నును వానిని బాపె నే నిఁకన్
భావజకీలికీల క్షణమాత్రము నోర్వఁగఁ జాలఁ గోమలీ! 41

సీ. తడవు చూచిన దృష్టి దాఁకు నం చని వాని,
పొగ సెల్లఁ దప్పక చూడ వెఱతు
మొనగుబ్బ లదిమి క్రుమ్మినఁ గందు నని వాని,
లేఁత మేనును గౌఁగిలింప వెఱతుఁ
దోడిఁబడ నమృతంబు దొలఁకు నం చని వాని,
నునుమోవి గట్టిగా నొక్క వెఱతుఁ
జెమటచేఁ జెలువంబు చిందు నం చని వాని,
నెనయుచోఁ గసి దీఱఁ బెనఁగ వెఱతుఁ
గీ గాని యొకనాఁడు నావన్నెకానిఁ గాంచి
కదిసి తనివార బిగ్గనఁ గౌఁగిలించి
నునుఁబెదవి నొక్కి రతికేళిఁ బెనఁగి చొక్కి
యేలుకొనలేక యీరీతి జేల నైతి. 42
ఉ. అన్నము నిద్ర యుం జెఱుఁగ నశ్రుజలంబులు నిల్పఁ జాలమేన్
సన్నగిలెన్ దిటంబు చనెఁ జాల విరాళియు మీఱె నేమియుం
గన్నుల కింపు గాదు త్రిజగంబులు లేవనునట్లు దోఁచె మో
హోన్నతి మేనఁ బ్రాణములు నున్నవొ లేవొ యెఱుంగ నంగనా. 43
శా. ఏవంకం జనెనో మదీయదయితుం డెచ్చోట నున్నాఁడొ నే
నేవెంటం బ్రియుమోముఁ గాంతు నిఁక నే నెవ్వారితోఁ దెల్పుదు
న్నీవవ్యాజపరోపకారవు గదే నెమ్మి న్ననుం బ్రోవవే
పోవే వానికి నావెత ల్దెలుపవే పుణ్యంబు నీకయ్యెడున్. 44
క. అని వేఁడిన నత్తాపసి
విను మేవగ నైన నీదు వేడుక కానిం
గొని తెచ్చెద మచ్చాతురిఁ
గనవే నేఁ డనుచుఁ బల్కి గ్రక్కున వెడలెన్. 45
మ. అతిమోహోన్నతి తారఁ బాసి శశి చింతాక్రాంతచిత్తంబుతో
వెతతో వెక్కసు నీడ్చు పాదములతో విభ్రాంతభావంబుతో
ధృతిహీనస్థితితో దృగంచలనముద్వేలాశ్రుపూరంబుతో
మతిఁ జింతించుచు నేఁగి యొక్కవనసీమన్ గుంజగర్భంబునన్. 46
చ. భ్రమ గొనినట్లు మిన్విఱిగి పైఁ బడినట్లు గ్రహంబు సోఁకిన
ట్లమితధనంబు గోల్పడినయట్లు ప్రపంచము గ్రుంగినట్లు చి

త్తము వికలత్వ మొంద మదిఁ దాలిమి డిందఁగ మేను కందఁగా
హిమకరుఁ డంతరంగమున నింతిఁ దలంచి వలంచి యిట్లనున్. 47

ఉ. ఆతఁటి జాఁత వ్రేసినటు లాతఁడు పొమ్మని వీడ నాడఁగా
నాతరలాక్షి చిప్పిలెడు నశ్రుల నప్పళించుచున్
దాఁ దలుపోర నిల్వ నయనమ్ముల నేఁ బయనమ్ము దెల్ప సం
జాతవిషాద యై యనుపఁ జాలనిచందము లెంచఁ గూడునే. 48

ఉ. పొమ్మనినంత రాఁగనె బుద్ధికి మోసము వచ్చె నప్పుడే
కొమ్మను వెంటఁ బెట్టుకొని కొంకక వచ్చితి నేని నన్ను దా
నమ్ముని యేమిచేయు నొకఁ డడ్డమె యే నటు సేయమి న్గదా
ముమ్మర మైనకంతువిరిముల్కులకు న్దను వొప్పగించెదన్. 49

సీ. తళుకుబంగరుకుండ తావిసంపఁగిదండ,
వలపులసరణిజవాజి బరణి
పచ్చికస్తురివీణ బాగైననెఱజాణ,
కల్కిమిటారి యంగజుకటారి
మకరందములవాక మదనశాస్త్రపుటీక,
రతిచేతిచిల్క మరుఁగింపుమొల్క
ముఱిపెంబులకుదీవి మరుదోఁటయెలమావి,
నెఱనీటు కిరవు పన్నీటిచెఱువు

గీ. ఎంచఁ దగుముచ్చటల కిమ్ము మంచిసొమ్ము
కాంతలకు నెల్ల మేల్బంతి కలువదంతి
మేటిరతులకు సురతాణి మించుబోణి
దాని కెనయైనచాన జగానఁ గాన. 50

క. తారల గెలుచును నఖరుచిఁ
దారలతరళాక్షి రూపతారుణ్యములం
దారం జేయును మనసిజు
దారం జిగి మోవి పంచదారన్ గేరున్. 51

శా. ఆమోమందము నాకనుంగవబెడం గామోవిసింగార మా
గోముంజన్గవగబ్బి యాగొనబునిగ్గు ల్మీఱునూఁగారుసౌ
రామించుందొడజగ్గు లానడలయొయ్యారంబు లయ్యారె! యా
భామారత్నముఁ జూచి చూడవలెనా పద్మాక్షి నిం కొక్కతెన్! 52

సీ. ఘనవేణి వేణిశృంగార మారసినంత,
మోహాంధకారంబు ముమ్మరించె
హరిమధ్యమధ్యవైఖరి స్మరించినయంతఁ,
బ్రకటధైర్యము బట్టబయటఁ బడియె
నతనాభినాభిసౌందర్య మెంచినయంతఁ,
బలువివేకము సుడిఁబడఁ దొడంగె
మృగనేత్రనేత్రలక్ష్మిని గణించినయంత,
నెదలోనఁ జాంచల్య మిరవుకొనియెఁ
గీ. బాటలాధరయధరంబునీటుఁ దలఁచి
నంత ననురాగమంతయు నలవి మీఱె
నింతి మైనిగ్గు లపుడు విశ్రాంతి హేతు
లిపు డతిశ్రాంతి హేతు లే నెటుల నైతు.
సీ. జగజంపువగకెంపుజగడంపుటలుకచేఁ,
దొగ రైనకెమ్మోవిచిగురుదాని
యల జక్కవలఁ గ్రక్కదలఁ ద్రొక్క గమకించు,
బిగువు మీఱినకుచయుగముదాని
సవరంపుబవరంపుసవరంపునటనచేఁ,
గుటిలవృత్తి వహించుకురులదాని
సరి యెన్న విరిపొన్నసరిఁ గొన్నగరిమచే,
గంభీర మగునాభిఁ గాంచుదాని
గీ. మారుశంఖంబు గెలువ ముమ్మాఱు బద్ధ
కంకణం బైనయట్లు రేఖాత్రయంబు
పొలుచుకంఠంబు గలదానిపొందు మాని
మోహవార్ధికి లోనైతి మోసపోతి.
సీ. ఏదిక్కుఁ జూచిన నెలదేఁటిదునెదారు,
లేజాడఁ జన్న నంభోజవనము
లేచాయ మెలఁగినఁ బూచినదీనియ,
లేకడ నుండినఁ గోకవితతు
లేత్రోవ నిలిచిన నెలపొన్నశృంగార,
మెఱుఁగూల కేఁగిననిగురుటాకు

లేవంక కొదిగినఁ దావిమొగ్గలగుంపు,
నేదెస డాసిన జాదిపువ్వు
గీ. లదరు పుట్టించు చున్న వాయతివకురులు
నయనములు కేలు కుచములు నాభి చరణ
ములు నఖమ్ములు మైతావి తెలియఁ జేయు
నట్టి వయ్యెను బా గాయె నతనుమాయ. 55
ఉ. చక్కఁదనాల కేమి రుచి సంపద చిత్తరుబొమ్మయు న్గదుఙ
జక్కన గాదె యంత నెఱజాణతనం బొకచోటఁ గానఁ గా
మక్కువ లోకమందె నహి మాటలపోఁడిమి దానికే తగుఙ
దక్కినభామినీమణులు దానిశతాంశముఁ బోల నేర్తురే. 56
సీ. నునుఁబంట నామోవి నొక్కి చక్కనిసామి!,
నొచ్చెనో యనుచు నానుచును జొక్క
నమర వింతగఁ బల్కు మనుచుఁ జెక్కిలిఁ గొట్టి,
కందెనో యనుచుఁ జన్గవను జేర్చు
సందీక కౌఁగిటియందుఁ జేర్చి చెమర్చె,
నో యని పైఁటచే నొనర విసరుఁ
దడవుగాఁ బడ కిచ్చి బడలితివో యంచు
నయముగాఁ గైకొని బయల లాఁగు
గీ. నట్టిచెలిఁ బాసి తలపోసి యలసి గాసిఁ
దాల్మి నెడఁజేసి వెత డాసి తనువు రోసి
తల్లడింపఁగ నాయె హా! దైవమాయ
యేది గతి చేర విరహాబ్ధి కేది మేర. 57
చ. సరసనయానుభావమునఁ జక్కనిచక్కెరబొమ్మలాగుగా
దొరకె నటంచు నమ్మితిని దోడన యింటిమగం డసూయఁ బ
ల్గొఱకుచు వచ్చె గందపొడిలోపలఁ బూరుగు? వట్టినట్టు లి
ద్దఱ కొకసౌఖ్య మబ్బినను దైవముకంటికిఁ గంటగించెనో. 58
సీ. బటువుగుబ్బల నొత్తి పక్కను హత్తి నా,
హారాను చెల్లించినయందగత్తె
కొనగోరు నాటించి కూర్మి పాటించి నా,
తమకంబుఁ గెరలించుతలిరుఁ బోఁడి

వా తెఱపా లిచ్చి వగలఁ దేలించి నా,
వలపు లీడేర్చినవన్నె లాఁడి
పావురావగఁ బల్కి పైకొనికుల్కి నా,
ముచ్చట లునుకూర్చుముద్దుగుమ్మ
గీ. మక్కువ నెసంగి కౌఁగిటనమడు పొసంగి
గారవించినకొమ్మ బంగారుబొమ్మ
ననపిలుతువిద్యలకు నొజ్జ నాదుపజ్జ
కెన్నటికిఁ జేరు నావంత లెపుడు దీఱు. 59

చ. తలిరులు కూర్మము ల్దొనలు దర్పకునద్ద మనంటికంబము
ల్పులినము నంబరంబు * నుడి పొందగుడుం దరఁగ ల్భుజంగము
ల్పులుపు నరు ల్లత ల్దరము పద్మము తుమ్మెదగుంపు గూర్చినన్
గలికి యనంగ నొ నయినఁ గల్గునె తాదృశలీల సాటికిన్. 60

చ. మకరపుడాలువానివిషమంపురణంబున లోలనేత్ర తా
రకలు మెఱుంగు లీన నవరత్నపుఁబాపటబొట్టు మోమునన్
దకపికలాడ నాచెలువు ధన్యత నొందఁగఁ జిత్రభంగులన్
ముకుళితతానము ల్పలుకుముద్దులగుమ్మను జూచు టెన్నఁడో. 61

చ. ఎసఁగిననెయ్యపుంగినుక నెంతయు మోడి ముసుంగు వెట్టి యా
కుసుమసుగంధి యున్నపుడు కొంకుచు నే జెయి దాఁచ నిద్ర చేఁ
గసరినయట్లు మత్కరము గబ్బిచనుంగవపైకిఁ దార్చి మై
నుసులుచు సీవి జార్చిన మనోహరలీలల నెన్న శక్యమే. 62

చ. మలయజగంధి దా శిరసు మజ్జనమై తెలివల్వ యొంటికొం
గెలమి ధరించి త్రైక ధరియింపక యే కురులార్చు చున్న నే
నలమిని గౌఁగిలించుకొన నాహరిమధ్య యనంగసంగరా
కలనఁ బెనంగినట్టిరతికౌశలము న్మదిలోఁ దలంచెదన్. 63

చ. పులుగుల కబ్బలో కనకపుంజిగిదిబ్బలొ దానిగుబ్బలో
వలపులదీవియో సుధల బావియొ దానిమెఱుంగుమోవియో
కలునలబంతియో కుసుమకార్ముకదంతియొ కాక యింతియో
యలవియె దానియందము శివా! తలఁప న్వెలుప న్నుతింపఁగన్. 64

చ. ఒకతోడ సందిట న్డానిపి యొక్కతోడన్వోలిఁ జేసి యొక్కచే
రక మగుగుబ్బచన్నొకకరంబునఁ బెన్నరికొప్పుఁ బట్టి త
త్తకతకతాళమానముల దారిగఁ గూడెడునన్నుఁ జూచుచుఙ
బకపక నవ్వె నావలపుబంగరుబొమ్మను జూచు టెన్నఁడో. 65

సీ. వెనుదీయకు మటంచు వెడవిల్తుఁ డాడించు,
జంత్రిపోలిక కీలుజడ నటింప
స్మరసంగరంబునఁ గురియుపువ్వులవాన,
క్రమమున సరులముత్యములు రాల
మరుఁ డనుజెగజెట్టి బిరుదుఢక్కికమాడ్కి,
గళరవంబులఘుమత్కార మెసఁగ
చిత్తజురాజ్యాభిషేకాంబుపులభంగిఁ,
దొరిడరినచెమటబిందువులు చెలఁగ
గీ. మదనవరదేవతాధ్యానమహితనిష్ఠఁ
బోలి యఱమోడ్పుకనుదోయి పొలుపు మిగుల
మగపొగసుఁ జూపె నాయింతి మరునిదంతి
పగడసాలను గెల్చినపంతమునను. 66

శా. ఏమా టాడిన జాళువారు సమ్మతం బేయంగ మీాటించినన్
హేమంపుందళుకు ల్తళుక్కను బలే యేదిక్కు ముద్దాడినన్
ఏమో చక్కెరలప్ప లంటినటు లౌ నెచ్చోట చే సాఁచినం
బ్రేమం బెన్నిధి యబ్బినట్లగు నయారే! యాయొయారే తగున్. 67

సీ. కళుకుబంగరుచాయ గాజు లల్లన మ్రోయఁ,
గులికి పక్కకు హత్తి కొంతసేపు
తనివి దీరక పేర్చి తనపైకి ననుఁ దార్చి,
వంతుగా సమరతిఁ గొంతసేపు
అది చాల కెదురెక్కి యనురాగమున మెక్కి,
వింతహత్తింపులఁ గొంతసేపు
కసి దీఱ కటు లేచి గ్రక్కునఁ దమి రేఁచి,
కులుచగోరింపులఁ గొంతసేపు
గీ. గొనబుకోకిలరవములఁ గొంతసేపు
కొసరువగ గుల్కుపల్కులఁ గొంతసేపు

కరఁగికరఁగించువలపులఁ గలసి మెలసి
పొలసి పొలయించునాతి నే చూడ నైతి. 68

చ. తలఁపఁ గులాంగనారతి సుతప్రద మేమిసుఖంబు వేశ్యతోఁ
గలయుట ద్రవ్యహానికిని గారణ మింతియె సందుగొందియిం
తుల యెడఁబొందు లన్న నతిదూష్య మగు న్బహుయత్నలభ్యతన్
దలకొనునన్యభామలరతం బె రతంబు జగన్నుతంబుగన్. 69

చ. గరగరి కైన దై నెనరు గల్గిన దై నెఱనీటుకత్తె యై
పరువపునిండుజవ్వనపుబాగరి నాగరికంపుఁబ్రోడ యై
మురు వగునవ్వుమోము దయి ముద్దులగుమ్మయి ముచ్చటైన దై
సురతకళాప్రవీణ యగుసుందరి యందఱికిన్ లభించునే. 70

గీ. జాలుకొప్పును నగుమోము చలువచీర
మెఱుఁగుఁగమ్మలు జిగిమోవి మెఱయునింతి
కన్నులను దోఁచుచున్నది గాని చేతి
కబ్బ దద్దంబులోఁ దోఁచులిబ్బపగిది. 71

వ జిలిబిలిచెమ్మట ల్దొలుకుచెక్కులు ముద్దులమోవినొక్కులున్.
పొలపులకన్నదోయి యరసొక్కులు వీడకు మన్న మ్రొక్కులున్
బెళుకులపావురాపలుకుపెక్కులు మైసిరివింతటెక్కులున్
గలిగిననీరతంబు లిఁకఁ గందునె యిందునిభాననామణీ! 72

శా. ఔనే ముద్దులగుమ్మ! కుల్కు తవునే యందంపుఁబూరెమ్మ హా
సోనే చక్కదనాలయుక్క! యిది యా యబ్జాస్త్రుచేఢక్క! మే
లే నీలాలక! యంచు నే బొగడ నెంతేవింత పుంభావకే
ళీనాట్యంబున నన్ను నేలినవగ ల్నే నెంతు కాంతామణీ!. 73

చ. కలఁగినకొప్పుతోఁ జిటిలుగంధముతో విడఁబడ్డపైకతోఁ
వలిరులవిల్తుపాళె మొకతట్టు తళుక్కనుకట్టుఁగొంగుతో
పొలపులకన్నుల న్నిదురసొక్కులతో విరిపాన్పు డిగ్గి నీ!
వెలమిని వచ్చుటీవి మది నెన్నుదు నోమదహంసగామినీ!. 74

ఉ. వంత మి దేలనే వెదవిపానక మానక తాళఁ జాలనే
యెంతటిదిట్టవే కసర కిప్పుడు నాకొకముద్దుఁ బెట్టవే
వంతల నేచకే మరుదివాణముఁ జూతు నటన్న దాఁచకే
యింతుల మేటి! యింతచల మేటికిఁ జీటికి మాటిమాటికిన్ 75

చ. ఒకచరణంబున న్నిలిచి యొక్కపదంబు ముడించి హొన్నుడా
ల్చికిలిమెఱుంగుగాజులు ఘలీలనఁ జేతులు నాదుమూఁపునన్
రకముగ వైచి గుబ్బల నురస్థ్సలిఁ గ్రుమ్మెడినీదు మేలుపొం
దికలసుఖోన్నతిన్ బొగడ నీరజగర్భున కైన శక్యమే. 76

చ. అరిదికడానిబొమ్మ మన మందపుటద్దపుటింటిలోపలన్
సరసత మీఱఁ బెందొడలసందులపొందుల మోవివిందులం
బెరిమె చెలంగి కూడి ప్రతిబింబములం గనుపట్టినట్టియా
గుఱుతులు వేడ్క నొండొరులకున్ గనిపింపఁగ నుండు టెన్నఁడో!.

చ. చిలుకలకొల్కి చిత్తజునిచిల్కలముల్కులకల్కి మోహ మిం
పెలయఁగ నేను రాఁగఁ గడ కేఁగి తటుండు మటంచు వంచనం
బలికిన గుండె జల్లు మన మ్రాన్పడి యుస్సురు మంచు నే నిలం
గలకల నవ్వి తోన ననుఁ గౌఁగిటఁ జేర్చవటే విలాసినీ!. 78

చ. పెనిమిటివెన్కనిల్చి ననుఁ బిత్తరిచూపుల నీవు చూడ నే
మునుకొని ముద్దుఁబెట్టుటకు మోమటు లొగ్గఁగ నీవు వేళ గా
దని తల యూఁచి నే నలుగ నందుకుఁ గన్నుల నీవు మ్రొక్క నే
నిను మదిఁ గౌఁగిటం బొదువ నీ వఱగన్నులు మోడ్చవా చెలీ!.79

ఉ. నింతువు నాదుకోర్కి గమనింతువు కేళి కహర్నిశంబు నా
నింతువు ఱొమ్ము గుబ్బలఁ దనింతువు పౌరుషకేళిచేతఁ బూ
నింతువు తోనె కేళికి గణింతువు నాదుగుణంబు లెల్లెడన్
గాంతలలోన నీకు సరి గాన జగాన నగానతస్తనీ!. 80

సీ. చనుగుబ్బపెనుగొండసంస్థాన మమరించి,
తెలిచూపువెలితామరల ఘటించి
పయ్యెదచెంగావిపావడ హవణించి,
ముఖపుండరీక మింపునఁ గదించి
యారోహరత్నసింహాసనంబున నుంచి,
కటిచక్రమును హస్తగతము చేసి
పావురాఁవగముద్దుపటహంబు మొరయించి,
కలయంగసంపదఁ గానిపించి
గీ. మిసిమిపొక్కిలిమూలబొక్కస మొసంగి
తొగరుచిగురాకువిలుకానినగ రమర్చి

గరిమ వలరాయపట్టంబు గట్టి నన్నుఁ
గరుణతో నేలుకొమ్మ బంగారుబొమ్మ !. 81

చ. విరహదవానలంబునను వేఁగుచు నన్ను మటంచు నిద్రయం
చెఱుఁగక నేను జాలిఁ బడ నేమని పల్కవిదేమి యల్క నీ
సరసతఁ గంటి నీబిగువుచన్నులకై వడి నీదుచిత్తముల్
హరిహరి! యింతయేల కఠినత్వముఁ బూనెదు మానినీమణీ!. 82

సీ. కలికి! నీసోగసెల్లఁ గలయఁ గన్గొనువేళఁ,
గనుఱెప్పపాటు విఘ్నముగ నెంతు
నతివ ! నీతో మాట లాడ నిల్చినయట్టి,
నిమిషంబు నొకవత్సరముగ నెంతుఁ
జెలి ! నీవు రతికేళి నలసి నిద్రించునా,
గడియసేపు యుగంబు గాఁగ నెంతు
మగువ ! నీదుచెఱంగు మాసినమూన్నాళ్లు,
కల్పకోటిశతంబుగా గణింతు
గీ. నెమ్మి గలవాఁడ నీకు మే నమ్మినాఁడ
లాఁతిగాఁ జూతువా నన్ను లలన ! నిన్ను
గౌఁగిలింపక మాన నా కన్నులాన
నిలిచి మాటాడవే బాల ! చల మిదేల. 83

సీ. పల్కవే నునుఁదేనె చిల్కవే మాదురా,
చిల్క వేడుకపల్కు తళ్కు దీర
నిలువవే యొకసారి కలువవే వెడవిల్తు,
కలువవేఁడిశరంబు కలఁచెఁ దాల్మి
చూడవే కన్నెత్తి వీడవే మోడి నీ,
వీడ వే రావె నీ వాఁడ నేను
దియ్యవే చెంత సందియ్యవే మదుపు లం,
దియ్యవే బలి కంతుకయ్యమునను
గీ. గలికి ! రాయంచబోధల కలికి యులికి
యులికి వలమానపవమానగళితమాన
దళితమానసలీల నేఁ దాళఁ జాల
జాల మిది యేల లోలవిశాలనయన !. 84

సీ. జిలిబిలిగాడ్పులచేఁ దాళఁజాల నీ,
ఘననాభిగుహచెంత గదియ నీవె
మోహాంబురాశిలో మునిఁగెద నిపుడ నీ,
పృథునితంబద్వీప మెనయ నీవె
యామనిబలుతాప మానంగ లేను నీ,
యధరసుధాధార నాన నీవె
చిగురాకుకార్చిచ్చు సెగ లెగయించె నీ,
నెరులమబ్బులచాయ నిలువ నీవె
గీ. మారభూతంబుబల్వెత ల్మీఱె నీదు
విశదగళరవమంత్రము ల్వినఁగ నీవె
కొమ్మ! నిను నాఁటనుండియు నమ్మినాఁడ
జాల మిఁక నేల నేఁ దాళఁజాల బాల!. 85
సీ. ఎలదేఁటిగమి మేటి యెలగోలుమూకల,
నెల్ల ముస్తీబుగా నెచ్చరించి
నలువంక గొరువంకబలితంపుఁదోఁటల,
నెల్లను వేర్వేఱ నేర్పరించి
రహి మించువహి నించు రాయంచగమి యాస్తి,
కైజీతముల నెల్ల గణుతిఁ బెట్టి
నునుమావు లను మావు లెనసినకోయిల,
సరదార్ల కెల్లను సారిఁ జెప్పి
గీ. యదిగొ వలరాజు దనపౌఁజు నదనుఁ జేసి
వెడలి వేయించెఁ బూపొదవెలిగుడారు
నింక నేఁ దాళ ననుఁ బ్రోవ నిదియ వేళ
యేలనే మోడి యయ్యయో యెమ్మెలాడి!. 86
క. అని తా వనితామణికై
జనితార్తినితాంతవిరహిజనతాఘనతా
పనిదానం బగుమదనుఁడు
ననవిల్లును దాను దోఁచినవితం బయినన్. 87
శా. ఏరా మారుఁడ! తల్లివంక యని నీ కెంతేనియుక్తి లేదు గా
రాపు ల్ననుఁ జేయ నాయమగునా రాజత్కృపాశాలియా

శ్రీరామాహృదయేశుఁ డాఘనున కేరీతిన్ దగన్ బుట్టితో
క్షీరాంభోనిధికిన్ హాలాహలముమాడ్కిన్ పాంథవిధ్వంసకా!. 88
చ. బలిమి వియోగవర్గములబాధలఁ బెట్టెదునిర్దయాత్మ! నీ
దళములు చెల్లపా లయి శతాంగ మరూపక మై శిలీముఖం
బులు కడువాఁడి హేయ మయి పూనినయిక్షుశరాసనంబుని
ష్ఫల మయి పోయినం గద శుభం బగు ధారుణి కెల్ల మన్మథా!.
గీ. శివుఁడు నిను జీవమాత్రావశిష్టుఁ జేసె
నన్నఁ గడముట్టఁ దునుమ కట్లగుటఁ గాదె
తనువు నగ మైన భంగంబు తడఁబడంగ
జంగ మై పోయె శత్రుశేషంబు దగునె. 90
ఉ. మత్తత విప్రయోగిజనమర్దనుఁ డైనప్రసూనధన్వికిన్
గత్తు లొసంగినట్టిజనఘాతుకమాధవనామధేయ మ
త్యుత్తమ మేగతిం గలిగెనో గద నీకు సుధాఖ్య గారకున్
హత్తినలీల రక్కసున కంచితపుణ్యజనాఖ్యయుం బలెన్. 91
గీ. మధుపగుణశాలితో మైత్రి మహి నొనర్చి
పైకములఁ గూర్చి పంచమభంగి పేర్చి
రంతు లిడియెదు జాతి రవంత యెన్న
నుచితగతి లేదు కాసంత యోవసంత!. 92
ఉ. బాపురె పాంథభంజన! ప్రభంజన! యామ్యదిగంతరంబునం
గాపుర మీవు సల్పుటలు కాలునికిన్ జనపీడనంబు లం
కాపురి నుండుదైత్యులకుఁ గర్కశభావము చందనాద్రిశృం
గోపరిపన్నగావళికి నుగ్రత నేర్పను గాదె నిచ్చలున్. 93
చ. ఇల సుమనోగుణంబు విరియించెదు ప్రాణ మటంచు నెంచు మ
మ్మలయఁగఁ జేసె దౌర మలయానిల! యెంతటిమాంద్య మెంతపాం
క. సులగతి గర్భమందె బలసూదనుఁ డాగతి మట్టుఁ బెట్టఁగా
నిలిచె జగంబు కానియెడ నింగియు నేలయు నాక్రమింపదే. 94
అవునా ప్రేరేప మనో
భవు నాపై కలితతామ్రపర్ణీసదనో
పవనా! పధికోత్పవనా
పవనాపవనాదిచలదుపవనా! పవనా!. 95

సీ. పొదలపై మెదలుతుమ్మెదలార! మీఁదాఁక,
చెలికటాక్ష మొకింత కలుగుదాఁక
గములుగాఁ దెమలుకీరములార! మీఁజోక,
హరిమధ్య చేరి మాట్లాడుదాఁక
వగలచే బోగలుసంపెఁగలార! మీఁకాఁక,
మృగనేత్ర యంగీకరించుదాఁక
సిరులచే వఱలుతామరలార! మీఁపోఁక,
శుకవాణి మొగ మెత్తిచూచుదాఁక
గీ. నవము నవముగ మెఱయుపల్లవములార!
ప్రబలుమీరేఖ కాంత చేపట్టుదాఁక
తగదు చల మింక దైవ మేదారి నైన
తలఁపు లీడేర్పఁగా నేర్చుఁ దరుణిఁ గూర్చు. 96
వ. అని యివ్విధంబునం బలుకుచు నళిపికశుకనికరకలకలంబున కలు
కుచు నధైర్యంబునం దలఁకుచు నరిమురి యరిమి కరకరికఱకుచెఱకు
విలుతుం డోర వెఱికి కలుకు కల్కుర్కున నఱకుచిగురాకుబాకు
తాఁకుచకచకలకుఁ జకితాయమానమానసుండై పొగలుచు దగ
దగ మని రగులు నెఱగలిపగిది రగులుకొనుదిగులు సెగల మిగుల
నొగలుచు రాకేందువదన యవలోకంబు లేమింజేసి లోకంబు నిరా
లోకంబుగ నెంచుచు నమ్మించుఁబోణి తనయెడం జేసినవినోదం
బులు సారెసారెకుం దలంచుచు నచ్చిగురుబోణింగూర్చి యెడఁబా
సినదైవంబుకుటిలనటనకు వెఱగందుచుఁ గుందరదన తనుఁబాసిన
ఖేదంబున నేమి పాటుపడునో యని కుందుచు నొప్పులకుప్ప నెప్పుడు
గనుగొందునో యనుకోర్కులఁ దెప్పలం దేలుచు నంతకంతకు దు
రంతం బగుకంతుసంతాపంబునం దూలుచుఁ గ్రమ్మర నమ్మరాళ
గామినిం జెందునుపాయంబుఁ గానక శరీరధారణంబునం దేమియు
నాసఁ బూనక బెట్టునిట్టూర్పుగాడ్పుల నధరపల్లవంబు బీటలువాఱ
సంజాతకార్శ్యంబున ముంజేతికంకణంబులు జాఱ నానంగరాని
వియోగసాగరంబు చుట్టుగొనెనో యనుతెఱంగున బొంగినకన్నీరు
కెలఁకులం దొలంకులుగాఁ నిగుడ నైపరానితాపంబున డంబైన
యాణిముత్యంబులసరంబు లింద్రనీలవిసరంబులం దెగడ నెం దలుకు

డైన నిందుముఖి వచ్చె నని దిగ్గున లేచి బిగ్గనం బయలు కొఁగి
లించి కానక సిగ్గునం దలవంచుచు నిప్పు డమ్ముద్దుగుమ్మ నన్ను రమ్మని
కమ్మఁబంపినం గదా తనతపంబు ఫలియించు నని యెంచుచు య
మ్మీనలోచనాధీనమానసుం డై యుండునవసరంబున. 97

చ. శిరమున కెంజెడ ల్నుదుటఁ జెన్నగుబిత్తరిబొట్టు వాతెఱన్
సరసపునీడెపుంగఱలు చన్గవపై రుదురాకపేరులున్
గరమున నాగబెత్తమును గాత్రమునన్నునుబూది యొప్పఁగా
నరుదుగ జోగురాలొకతె యచ్చటికిం జనుదెంచెఁ గ్రక్కునన్. 98

క. అరుదెంచినయవ్వనితన్
బరిసరమునఁ గాంచి వినయభరితమృదూక్తిన్
దరుణీ! యెందుం డెందుల
కరిగెద వెందుండుదాన వని యడుగుటయున్. 99

క. కాశీపురమున వాసం
బే సలుపుదు నమరగురునిగృహమున నంతే
వాసి నయి యుండుతఱి ని
న్నే సతతముఁ జూతు నన్ను నీ వెఱుఁగవొకో. 100

చ. అతులితరూప! నే నలబృహస్పతియింటికిఁ బోయినట్టిచో
నతనివిలాసినీమణి రహస్యముగా ననుఁ బిల్చి నీదుసం
గతియు వియోగముం దెలిపి గ్రక్కున నెక్కడ నున్నవాఁడొ యే
వితమున నేనియు న్వెదకి వేగమె రమ్మని పంచెఁ బంచినన్. 101

క. వెదకం బోయినతీఁగెయ
పదములఁ దగిలినవితంబు పాటింపఁగ ని
న్నెదుటనె కనుఁగొంటిని స
మ్మదమున హరిణాంక! వినుము మానిని వెతలన్. 102

ఉ. ఎంతని విన్నవింతు రజనీశ! రతీశదురంతచింతచేఁ
దాంతి వహించునీదువనితామణికిన్ ద్రుటి యొక్కదివ్యవ
త్సాంతర మై క్షణం బొకయుగాంతర మై నిమిషంబు బ్రహ్మక
ల్పాంతర మయ్యె నెన్న మఱి యవ్వలిమట్టు వచింప శక్యమే. 103

క. పులకపయిరు చనుమిట్టలు
మొలక లెగయ మెఱుఁగు లెసఁగుబొమవిలు చెలఁగన్

జలము గురియు వెలికనుగవ
జలదము లనఁదగును గాక జలకము లగునే?. 104
ఉ. నేర్పుమెయిం బటంబునను నిన్ను లిఖించు లిఖించి రెప్ప ల
ల్లార్పక చూచుఁ జూచి తనయక్కునఁ జేర్చును జేర్చి సంతసం
బేర్పడ సొక్కు సొక్కి తనహృద్గతతాపము నిన్ను సోకునం
జూర్పులు నించుచు న్నెలఁత యున్నది కన్నది విన్నవించితిన్. 105
ఉ. ముద్దియమోహ మెంతటిదొ మోహనరూపవిలాస! వింటె యే
సుద్దుల నొల్ల దెవ్వరినిఁ జూడఁగ నొల్లదు సొమ్ము లొల్ల దే
ప్రొద్దు విడెంబు చల్వలును భోజన మొల్లదు నిద్ర యొల్ల దీ
కొద్దికి పచ్చవిల్తునిలకోరుల నేమగుచున్నదో కదా ! 106
గీ. దేశముల లేనిపెక్కుసందేశములను
నొడివె నని తెల్పఁగా నిందు తడవు పట్టు
నింటిచెంగటిపూఁబొదరింటి కిపుడె
నిన్ను రమ్మన్న దనవు డానీరజారి. 107
ఉ. తాపముఁ దీరె నామది సుధామధురోక్తులు నీవుఁ దెల్పఁగా
తాపసి! యీ మహోపకృతి ధారుణిఁ జేసెడువార లెవ్వరున్
మాపటివేళ వచ్చెదను మల్లియపూఁబొదరిల్లుఁ జేర నీ
వాపరమాణుమధ్యకు మదాగమనం బెఱిఁగింప నేఁగుమా. 108
క. అని దానిఁ బంచి దట్టియు
ఘనమగు కాసెయును గట్టి కట్టాయిత మై
వనజారి యుండుతమి గని
యనుగుణముగఁ దమి ఘటించె నన రవి వ్రాలెన్. 109
మ. ప్రతిజన్మంబు సుమంగలీత్వగరిమన్ బ్రాపింప నింద్రాణి సు
వ్రతచర్య న్వరుణానికిన్ రవి హరిద్రాచూర్ణరాశి న్నభ
స్తతశూర్పంబున వాయసం బొసఁగఁ బ్రత్యక్సింధుపీచీపటా
వృతి యొప్ప న్గొని చల్లునక్షతలు నాఁ బెంపొందెఁ దారౌఘముల్
క. చరమగిరి నెక్కి పశ్చిమ
శరధిం దనసీడఁ జూచి శత్రుహరేచ్ఛన్
హరి దుముకన్ నిర్భయతన్
దిరిగెడుకరిఘటలొ నాఁగఁ దిమిరము లెసఁగన్. 111

మ. సమిదుల్లాసి ధనంజయుండు పటుతేజస్స్ఫూర్తి యై యుండి తా
సమయం బొటయు హేతిసంగ్రహవిరాజన్మూర్తి యై భూరిభీ
ష్మమహుం డౌసురచక్రనేత యసదై జాఱెఁ దదీయాంశకా
ఘముఁ దోడ్తోఁ గొనెమాత్యవర్గాళి కెలమిన్ గర్లైన్ముదంబయ్యెడన్.

మ. నటనోద్ధూతగిరీశనూపురమున న్వ్రాలెన్ దినేంద్రుండు త
చ్చటులాతామ్రజటాచయప్రభ లనన్ సంధ్యారుచు ల్పర్వెఁ ద
త్పటుజూటీనటదాపగాంబుకణికాభన్ దారక ల్మీఱెఁ ద
త్కటినిర్ముక్తగజేంద్రచర్మ మనఁ జీఁకట్లొప్పె నంతంతటన్. 113

సీ. జలజాప్తజాతీరతులసీవనవిహార,
పటుమురారిమయూరబర్హ రుచులు
అంజనాద్రినితంబకుంజరనికురుంబ,
కటదానరోలంబపటలఘృణులు
శైలకన్యోత్సంగచరదంతివక్త్రాంగ,
కలితనీలభుజంగగరళనిభలు
సాగరాంతస్సీమచారిదైత్యస్తోమ,
శూలమేచకచామరాళిసుషమ

గీ. లేకముగఁ గ్రమ్ముకైవడిఁ గాకనికర
కంబళకదంబకాదంబసాంబకంఠ
జాంబవద్బలజంబూఫలాంబుదౌఘ
డంబరము లైనయంధకారంబు లెసఁగె. 114

క. అప్పుడు సంకేతిత మగు
నప్పావాదఁ జేరి సాహసైకసహాయం
బొప్పఁ జెలి వచ్చుమార్గము
రెప్ప యిడక చూచు చుండె రేరాజు తమిన్. 115

గీ. అంత నాజోగిజవరాలు మంతనమునఁ
బోయివచ్చినక్రమ మెల్ల బొలఁతి కెఱుఁగఁ
జెప్ప నదియును మది మోహ ముప్పతిల్ల
బహుమతు లొనర్చి సాహసపటిమఁ జేర్చి. 116

మ. గృహకృత్యంబులు వేగ తీర్చి నిజసంకేతస్థలీసీమకున్
బహుమార్గంబు లమర్చి రాత్రిగడియ ల్బల్మాఱునున్ లెక్కగా

ర్చి హితోక్తిం గడుఁ బ్రొద్దువోయె ననుచుఁ శిష్యావళిం బంచి యా
మహిళారత్నము వేడ్కభర్త భుజియింపం దా కృతాహారియై. 117

చ. కపటయుతాంతరంగమున గ్రక్కున ముందటిజాముకూటమిన్
స్వపతిని నిద్రఁబుచ్చి తనపై నతఁ డుంచినకేల్దెమల్చి పా
నుపుపయి నుంచి లేచి పదనూపురము ల్సడలించి తల్పు నే
రుపు తగఁ బుట్టిగొల్లెమిడి రూపవతీమణి సంభ్రమంబునన్. 118

సీ. విప్పుకప్పగు గొప్పకొప్పున విరిసల్ల,
కలువలదండలు చెలువు మీఱ
సిబ్బెంపుగబ్బిబల్గుబ్బ చన్గవను మీ,
సరము లౌసీలంపుశరము లమర
కళుకుహొందళుకులం గులుకుమైమృగనాభి,
పంకంబు నెఱపూఁత పొంక మలర
మేలుడాల్మీలనేల్గాల్రిలుకన్నులు సోఁగ,
కాటుక రేఖలు నీటు మెఱయఁ

గీ. బొసఁగ కఱివన్నెసాలువు ముసుఁగువెట్టి
చాల సొమ్ములు పూలు బాగాలుఁ గొనుచు
గురునిజవరాలు తమతోఁటగోడ దాఁటి
శశిఁ గదియ వచ్చె సతు లెంత జంత లౌర! 119

క. ఆరీతిఁ జేర వచ్చిన
తారాతరలాక్షిఁ గాంచి తారావిభుఁడున్
రా రమ్మని చేరం జని
గారవమున బార సాఁచి కౌఁగిటఁ జేర్చెన్. 120

చ. అనుగతహారవత్ప్రచుర మాపరిచుంబితదంతవాస మ
త్యనుపమమోహజాతపులకాంకుర మర్ధనిమీలితేక్షణం
బనవరతస్ఫురన్మణిత మత్యనురాగనిరస్తనీవిబం
ధన మగుచుం జెలంగెఁ గడుఁ దద్రతి సౌఖ్యరసాతిభూతియై. 121

ఉ. మానినిఁ గూడి యిట్లు లసమానసుఖాంగజకేళిఁ దేలి తా
నానలినారి నారిని బ్రియంబునఁ దోడ్కొని వేడ్కతో నిశిన్
బూనిక మీఱఁగా నరిగి పూర్వదిగీశపురాభ మాప్రతి
ష్ఠానపురి న్వసించె నయశంబునకున్ భయ మేమి కామికిన్. 122

వ. అంత. 123

మ. తొలి దేవేంద్రుఁడు మాకులంబు చొరలేదో మేము నార్మోమురా
యలయంకస్థితిఁ గాంచ లేదొ స్వరవిద్య ల్మున్ను మావారిశి
క్షులచేఁ బాణిని నేర్వఁడో యని కులస్థానప్రతిష్ఠల్ త్రిభం
గుల ఘోషించెను నాఁగ గోళ్ళ్యకలయం గూసెన్ ధరామండలిన్.

సీ. భూరిత్రియామికాభోగిని తొలికొండ,
పుట్టపై నిడిననిర్మోక మనఁగ
ప్రత్యూషవిష్ణునిర్మదితాంధకారాబ్ధి,
రహిఁ దోఁచునవసుధాలహరి యనఁగ
పద్మినీమిత్రుఁడు బ్రహ్మవేషము దాల్చు,
తటిని బట్టినవెల్ల తెర యనంగ
కుముదంబులకుఁ గలక్రొవ్వనుగుగ్గిల,
పొడి యుంచుదీపంబుపుటిక యనఁగ

గీ. వెలయ వేగురుచుక్కను వెన్నముద్ద
చెంతఁ జూపట్టుకొనుమజ్జిగ యనంగ
మ్రుచ్చువేడుకకత్తెల మోము లెల్ల
వెలవెలను బోవఁ దూర్పునఁ దెలుపు దోఁచె. 125

ఉ. చుక్కలతేఁడు తూర్పుదెసజోదు తనుం గురుసంగరార్థమై
యుక్కునఁ దారసిల్లు నని యుక్కళి మంపినరీతి వేగురుం
జుక్క సురేంద్రుదిక్కునను శోభిలెఁ దద్బలశోణ రేణువు
ల్మిక్కుట మయ్యె నాఁగ నటమీఁదఁ జెలంగెఁ బ్రభాతరాగముల్.

క. చీఁకటి కాటుకపిట్టలు
కాకుపడన్ భాస్కరుండు కరజాలకము
ల్వ్రేక నిగిడింపఁ దారలు
వ్యాకులతం దారె ఖగము లగుటన్ భీతిన్. 127

సీ. తేఁటి కాటుకరేక నీటు మీఱఁగఁ దీర్చి,
మిసిమిగాఁ బుప్పొడి పసుపుఁబూసి
తెలితేనెనిగ్గులతిలకంబు సవరించి,
రమణీయపత్త్రాంకురముల నలరి

కమ్మబంగరుచాయ కర్ణిక ల్పావణించి,
హంసకస్ఫూర్తిచే నతిశయించి
యుదయరాగంబు సొం పొదవఁగా ధరియించి,
కంకణంబులు చాల పొంకపఱిచి
గీ. చెలఁగుతరఁగలపయ్యెదచెఱఁగు జాఱ
చిఱునగవు నెమ్మొగంబునఁ జెంగలింప
పద్మినీకాంత యతులసౌభాగ్యగరిమ
గాంచి పతికన్న మున్న మేల్కాంచి యుండె. 128
చ. జననయనోపరోధకరశార్వరగర్వ మడంగఁ ద్రొక్కి స
న్మునిగణసన్నుతు ల్వెలయ ముఖ్యమహామహనీయమూర్తిచే
నినుఁడు సెలంగఁ బద్మిని యహీనవికాసము నేత్రపద్మము
ల్గనఁ జెలఁగెన్ మరందకణకైతవకౌతుకబాష్పపూర యై. 129
చ. వనజము ల్లుల్లసిల్లఁ జెలువం బఱి చీఁకటి పెల్లగిల్ల నిం
పునఁ దగు నాత్మబింబరుచి పూర్వమహానగముఖ్య మెల్లఁ గాం
చనగతిరీతిఁ జెల్ల రవి చక్కఁగ నెక్కెనె దూర్పుదిక్కునన్
ఘనగతిఁ జీఁకటుల్ మరలి క్రక్కునఁ జేరెను స్త్రీలవేణిలోన్. 130
చ. తగ సమయావనీవిభుఁడు దాల్చినకెంపులదాళిబిళ్ళ యన్
పగిదిఁ జెలంగె భాస్కరుఁడు భాసురరశ్ములు భర్మరశ్మలై
నిగిడి కనంగ నయ్యె కడు నింగిని దత్తరుణారుణాతపం
బొగి నలరెం దదీయతను వొందినకుంకుమపూఁతకైవడిన్. 131
ఉ. అంతట దేవమంత్రి మలయాచలకూటపటీరవాటికా
భ్యంతరనిర్గతానిల మహర్ముఖబోధితపద్మసౌరభా
క్రాంతి నెసంగుచున్ బొలయఁ గంతునిగంతుల నిద్రలేచి తా
నింతిని గౌఁగిటం బొదువ నిట్టటు శయ్యకుఁ జేయి దార్చుచున్.
క. కానక లతికాగాత్రిం
గానక మది జల్లు మనఁగఁ గరము తమి బెడం
గానక మనసిజుఁ డేచం
గా నకటా! యనుచు గృహము కలయఁగ వెదకెన్. 183
చ. వెదకి వధూమణిం గనమి వేదనఁ జెందు మనంబునందు నీ
బ్రదుకు నిరర్థకం బనుచుఁ బల్మఱు వేసరు బల్కువేటికే

సుదతి యటంచు నుస్సురనుచుఁ నలుదిక్కులు నూచి విభ్రమా
సదగతిఁ గంప మందు మదసామజకంపితభూరుహాకృతిన్. 134

మ. అతఁ డారీతి నిజాంగన న్వేదకి దివ్యజ్ఞానదృష్టి న్నిశా
పతి గావించినకీడుగాఁ దెలిసి హా! పాపాత్మకుం డెంత దు
ష్కృతకర్మంబున కొగ్గె సిగ్గు కులముం జింతింపకే పుంశ్చలీ
స్థితిచే నీబలుజంత యెంత పనిఁజేసె న్నమ్మరా దెవ్వరిన్. 135

క. ఏ కినిసి శపించిన నిపు
డాకులదూషకుఁడు గ్రుంగు నది యొకపెచ్చా
కోకారిని దండింపఁగఁ
బాకారికిఁ దెలిపి నేఁడ పరిమార్పింతున్. 136

క. అని నిశ్చయించి మది న
య్యనిమిషదేశికుఁడు దుస్సహాగ్రహమతిచే
ననలునివితమునఁ గనలుచు
ననిలజవము మెఱయ నిలకనటు చని యెదుటన్. 137

క. గంగం దరంగరవ మెస
గంగం బ్రవహించు నిన్ను గం గనుగొని యే
గంగం బురముల నెల్ల న
గం గలనిర్జరులపురి తగం గనుపట్టెన్. 138

సీ. ఘనసుధర్మాస్థితుల్ ఘనసుధర్మస్థితు,
లన మహాభోగ మెం దనుభవింతు
రప్సరోజాతంబు లప్సరోజాతంబు,
లనఁగ హేమాభిఖ్య లమరు నెందు
సురభి మరుత్పాళి సురభి మరుత్పాళి,
నా నెందుఁ జెందు మందారలీల
నాసత్యముఖ్యులు నా సత్యముఖ్యులు,
నా నెందుఁ గాంతు రానందనంబు
గీ. నమరనాయక మణిలీల నమర నాయ
కమణి శచిమోవిముద్దులు గాంచు నెచట
విష్ణుపదభూషణం బన వెలయు నెద్ది
యట్టి యమరావతీపురి నతఁడు చేరె. 139

గీ. వింత లేమియుఁ జూడక వివిధరత్న
కీలితము లైనగవనివాకిళ్ళు గడచి
మొగముపంచి వివర్ణుఁడై ముసుఁగు వెట్టి
నగరిపుఁడు నిచ్చ వసియించునగరి కరిగి. 140

సీ. ఆచార్యు లిదె వచ్చి రనుచు దిగ్గన లేచి,
మోడ్పుకేల్దమ్ముల మ్రొక్కువారు
నతిరయంబున నితఁ డాపద వచ్చిన,
ట్లరుదేరఁ గత మేమొ యనెడువారు
వింతలేమో చాల వినఁబడు నేటికి,
నంచు నాతని వెంబడించువారు
నాలిఁ గోల్పడినయ ట్లలకో యిపు డింత,
యధికదైన్యముఁ జెందె ననెడివారు

గీ. పరిజనము లెవ్వరును లేక పల్ల కెక్క
కెల్లబిరుదులు వర్జించి యేరితోడ
మాటలాడక పేదబ్రాహ్మణునిరీతి
వచ్చె ననువారు నయి సురల్ రిచ్చపడఁగ. 141

సీ. కరకంకణంబులు గల్లని చెలు లిరు,
కోవులఁ జేరి వీఁచోవు లిడఁగ
వహ్ని యర్కినైరృతివరుణవాయుకుబేర,
శంకరుల్ గదిసి పార్శ్వములఁ గొలువ
సురసార్వభౌమసంగరవిరస్తపులోమ,
బలివిరామ యటంచు బట్లు పొగడ
రంభోర్వశీముఖ్యరమణీలలామము,
ల్పదపాలికోపు లేర్పడ నటింపఁ

గీ. బాణితలమున భిదురకృపాణి మెఱయ
ననుపమానసుధర్మాసభాంతరమునఁ
బృథులచింతామణీభద్రపీఠమునను
నిండుకొలువుండు నిర్జరనేతఁ గనియె. 142

ఉ. అగ్గిరిభేది యెంతయు బృహస్పతి దవ్వులఁ గాంచి గద్దియ
దిగ్గన డిగ్గి దిక్పతులు దేవమునుల్ గరుడోరగాదులు

దగ్గఱ రా నెదుర్కొని పదంబులకుఁ బ్రణమిల్లి యాత్మలో
నగ్గల మైనభక్తి తగ నర్ఘ్యము పాద్యము నిచ్చి క్రక్కునన్. 143

క. కైదండ యొసఁగి తోడ్కొని
సాదరగతి వచ్చి మణిమయాసనమున న
వ్యాదిత్యతేజు నునిచి శు
భోదర్కము గాఁగ సముచితోక్తులఁ బలికెన్. 144

గీ. ఓమహానుభావ ! నేమమే మీకు మీ
మోముఁ జూడఁ జిన్నఁ బోయి యున్న
దేమికారణంబొ యేను శిష్యుండ నై
యుండ నింతవంత నొంద నేల ? 145

క. అన విని యవనతముఖుఁ డై
యనిమిషగురుఁ డిట్టు లనియె నమరేంద్రునితో
వినిపింపరానికార్యము
వినిపింపఁగవలసె నైన విను మేర్పడగన్. 146

ఉ. అత్రిమునీంద్రనందనుఁడు నబ్జభవాంశజుఁ డొకుముద్వతీ
మిత్త్రుఁడు తండ్రిపంపునను మిక్కిలి భక్తిని మమ్ముఁ జేరి స
చ్ఛాత్త్రునియట్ల వేదములు శాస్త్రము లన్నియు నేర్చి ద్రోహి యై
మాత్రధికఁ మదీయసతి మానితశీలను బట్టె వింటివే. 147

క. అంతియ కా దాపాతకి
యెంతయు మది భయము లేక నేమేమో మ
త్కాంతకు బోధించి వెసం
జెంతను నే లేనివేళఁ జేకొని యుతికెన్. 148

క. హరిహయుతో గురుఁ డీగతి
హరిణాంకునికానినడక లటు దెల్పుతఱిఁ
సుర లెల్ల చెవులు మూసుక
హరి హరి ! యిదియెంతపాప మని తమలోనన్. 149

చ. కటకట! యింత పాతకము గన్నది గా దనువార లిప్పు డా
కుటిలుని నాజ్ఞ సేయఁ దగుఁ గొంచక యం చనువార లాపె దా
నెటువలె సమ్మతించె మది నీ పని కం చనువార లింతు లిం
తటిబలుజంతలా యనుచు నానను ప్రీలెడువార లై రటన్. 150

చ. అనిమిషనాథుఁ డయ్యెడ మహాగ్రహదుర్గ్రహమానసస్థితిం
గనలుచు భీషణాకృతిని గన్నులు వేయును జేవురింపఁ గా
నని ననలాదిదిక్పతుల నందఱఁ గన్గొని మీరు వింటిరే
చెనటి నిశావిటుం డిపుడు చేసినయాకొఱగామిచందముల్. 151

శా. అంభోజాసనుచే వరంబు గొని గర్వాయత్తుఁడై యెవ్వరిన్
సంభావింపక చేసె నాగురుసతీసంగం బతిద్రోహి యై
దంభాచారుని గౌరతల్పగుని మద్బాహాగ్రజాగ్రన్మహా
దంభోళిం దల ద్రవ్వనేసెద నహా! దౌరాత్మ్య మే సైతునే. 152

మహాస్రగ్ధర.
అని దిగ్వేదండశుండాయతపృథులభుజోదగ్రదంభోళి కేలన్
గొని రోదోమండలన్ మిణ్గురులు గుములుగాఁ గుప్పసారించి యుద్య
ద్ఘనశక్తిన్ ద్రిప్పఁ గొండల్ గడగడ వణఁకం గల్పవిశ్రాంతివేళా
జనితామర్షాంతకాలస్మరహరక్రియనాస్థాని దిగ్గంచు లేవన్. 153

చ. అనలుఁడు లేచి నిర్జరకులాధిపుఁ జూచి యిదేమి దేవ! నీ
వనికిఁ జనంగ లేచె దిపు డాగ్రహవృత్తిని నింతమాత్రకై
ననుఁ బనిఁ బంపు మాఖలుని నాఘనఘోరకరాళకీలలన్,
విను కరఁతున్ సముద్రనవనీతపదంబు యథార్థమై తగన్. 154

మ. అనినం దండధరుండు చండభుజదండాస్ఫాలనోద్దండని
స్వనదీర్ణద్రుహిణాండకంపితజగత్సత్త్వయీదుర్నిరీ
క్షనిదాఘార్కనిభాననభ్రుకుటిదంష్ట్రాభీషణోద్యద్ఘనా
ఘనసంఘోపమకాళికాతనుతమఃక్రాంతాఖిలాశాంతుఁడై. 155

శా. జంభారాతినిఁ జూచి యిట్టు లను దోషాకారుఁ డాచంద్రసం
రంభంబు ల్బహుళోపఘాతముల నారం జేసి యత్యుగ్రతన్
గుంభీపాకము కాలసూత్రము తమఃకూటంబు గాన్పింతు న
న్నంభోజాసనుఁ డిట్టిదుర్మతులఁ బోకార్పంగఁ డాఁ బూన్చుటన్. 156

చ. అలవరుణుండు భాసురనయావరణుం డను నిర్జరేశ్వరున్
గనుఁగొని సామదానములఁ గానిపను ల్మఱి భేదవృత్తిఁ జే
కొని యొనరింప నౌ నటుల గూడనికార్యము దండయుక్తిచేఁ
గొనకొని దీర్ప నీతికిఁ దగున్ మునుమున్నుగ దండ మర్హమే. 157

ఉ. సారసగర్భుఁ డాతని కొసంగెను గాండివ మక్షయాస్త్రతూ
ణీరములున్ మనోజవము నిత్యము నైనరథంబు దీధితి
స్ఫారమనోజ్ఞవజ్రకవచంబు నసాధ్యము నొపురంబు న
వ్వీరు సురాసురావళికి వ్రేల్గొని చూపఁ దరంబె పోరులన్. 158

ఉ. కావున దూత నొక్కరుని కైరవమిత్రునిచెంత కన్పి త
ద్భావము గాంచి వచ్చుటకుఁ బంపుట యుక్త మతండు సంధిచే
నావనజాక్షి నిచ్చినఁ బ్రియం బగుఁ గాక యెదిర్చె నేని యో
దేవ! భవద్భుజాకులిశతీవ్రత నియ్యకొనంగఁజేయుమా. 159

చ. అన విని యట్ల చేయఁ దగు నంచనె నైరృతి కార్య మిందునన్
గొనకొన గోట నొపనికి గొడ్డలి యేటి కటంచుఁ బల్కె న
య్యనిలుఁడు రాజనీతి యిది యం చనె యక్షవిభుండు మంచిదే
పనుపుఁడు దూతఁ జాత మని పల్కెఁ బురాసురవైరి యయ్యెడన్.

క. అనిన సురేంద్రుఁడు గురుతో
ననఘా! యిటు సేయ మీకు నభిమత మగునే
యని యాతనియనుమతిఁ గై
కొని తా నొక్కరుని బిలిచి కుశలత దోఁపన్. 161

ఉ. చందురుచెంత కీవు చని సమ్మతి గా నిపుణత్వ మేర్పడం
బొందుగఁ బల్కి సంధి యగుపా ల్పొనరించుకర మ్మటన్న సం
క్రందనునాజ్ఞ నొదలను గైకొని వాఁడు విమాన మెక్కి దాఁ
జెందొవవిందుపట్టణము చేరఁగ నేఁగి వియత్పథంబునన్. 162

చ. నరయత వచ్చి వెల్పటివాజారముచెంత రథంబు డిగ్గి భా
స్వరమణికీలితంబులు విశాలము లై తగుకొన్నికక్ష్యము
ల్వరుసఁగ దాఁటి యింతిపురివాకిటిపెద్దలఁ గాంచి వారితో
సురపతిదూత వచ్చె ననుచు న్వివరింపుఁ డటన్న వారలున్. 163

క. గమికత్తైలతో నవు డా
క్రమ మెఱిఁగింపంగ వారు గ్రక్కునఁ జేతకి
ప్రమదప్రదమై యొప్పెడు
ప్రమదవనముఁ జేరి యపుడు ప్రమదం బెసఁగన్. 164

సీ. పటికంపుసోపానపంక్తినిజాంశుసం,
ఘటనచేఁ జాలుగాఁ గలిగి మిగులఁ

బొలుపొందుజలసూత్రములు పన్ని రసురీతి,
జలజల ప్రవహించుజలములందుఁ
గలిగిననెత్తావికలువలగములలో,
వలగొనునంచతొయ్యలుల నళుల
లలిత మైనట్టికేళాకూళిఁ జుట్టి పె,
ల్లల్లినద్రాక్షపందిళ్ల చెంత
గీ. పొదలునరవిరిమల్లెపూఁబొదల క్రేవ
వాటమై పొలుతేటపన్నీటికాల్వ
మిసిమిసన్నపుటిసుకపై నెసఁగుచల్వ
గలువపాన్పున నెలజాతిపలకయందు. 165
సీ. జోడు కట్టిన గెల్తు సుదతిరో! నిను లీల,
పైజోడుఁ గూడినప్రతిన దగునె
సారె పండఁగ మేలు సమకూరు మాకింత,
కాయక పండు టేకరణిఁ గలుగు
నిమ్మెయిఁ గుంకుమ యిదె యంటె వాల్గంటి,
పెనఁగెద నలుపులవిడువ నేను
మేలుగ సతమాయె మీటి పోఁజూడకు,
కొసరక ముందుగాఁ గూడి వత్తు
గీ. ననుచు నర్మోక్తిచాతుర్య మమర నపుడు
కవలవలు రత్నకంకణరవ మెసంగ
పందెములు గోరి వైచుచు పగడసాలఁ
దారతో నాడుహరిణాంకుఁ జేరి మ్రొక్కి. 166
గీ. దేవ! యవధారు వాకిట దివిజనాథు
దూత చనుదెంచి యిపుడు మీతోడ వార్త
లాడవలె నని యున్న వాఁ డనినఁ గొంత
దడవు చింతించి మది ధీరతను వహించి. 167
క. చిఱున వ్వొలయఁగఁ దారా
తరుణీమణి నచట నునిచి తగ జిగిమిగులన్
మెఱయురతనంపుఁ బావలు
విరిబోణియ యొకతె దొడుగ వేడుక మీఱన్. 168

ఉ. నెమ్మి మిటారిమై పసుపునిగ్గులదుప్పటివల్లెవాటుతోఁ
గొమ్మమెఱుంగుచన్నుగవ గుత్తపుగుప్పటురంబునీటుతో
గుమ్మలు వోవ నొక్కచెలి గ్రోలినతేనియ కావిమోవితో
నెమ్మెలు మీఱఁ జంద్రుఁ డొకయింతికరం బవలంబనంబుగన్. 169
సీ. పగడాలచేవకంబంబులు మగరాల,
నిగరాలకోణిగలు నిద్దమైన
యద్దంపువాకిళ్లనాణిముత్యపుమేలు,
కట్లనీలపుగవాక్షములుఁ గెంపు
టోడుబిళ్లలకప్పు లుచిరిబంగరుబైరి,
టాకులపచ్చలడంబు మీఱు
తిన్నెలు పెంబట్టుతెరలును బటికంపు,
మెట్లును జిగిరంగు మేల్వారంగు
గీ. చందనలు నంద మయి యొప్పుచంద్రకాంత
కుట్టిమంబులు గలకోల్వుకూటమునకు
లీల నరుదెంచి మదకలనీలకంఠ
కంఠరుచిరమ్య మౌరత్నకంబలమున. 170
గీ. పెచ్చుముత్యపుగద్దియనే కరంగి
సుళువు తలగడ చెయ్యూది కెలఁకులందుఁ
గొంద ఱిందీవరాక్షులు కొలన నుండి
బలరిపుని దూత పిల్వఁ బంపఁగ నతండు. 171
క. చనుదెంచి మ్రొక్కుటయుఁ బ
జ్జను గూర్చుండంగఁ బనిచి శతముఖుసేమం
బును సురలసేమ మారసి
పనివడి నీ వచ్చినట్టిపని యే మనుడున్. 172
చ. కులిశకఠోరధార బలుకొండలతండము గండడంచున
బ్బలియుఁడు పాకవృత్రబలభంజనుఁ డింద్రుఁడు పల్కుచున్నవా
ర్తలు విను పద్మజాంశమున ధారుణి నత్రిమహామునీంద్రు స
త్కులమునఁ బుట్టినాఁడ వనఘుండవు ధర్మవిదుండ వెయ్యెడన్. 173
గీ. అట్టినీ యెడ నొక్కదుర్యశము గల్గె
సొబగు తెలిచల్వకును మసి సోఁకినట్లు

సకలజనపూజ్యుఁ డైనయాచార్యుభార్య
బలిమిఁ బట్టితి వింతపాపంబు గలదె. 174

క. అంతట బోవక నీవ
య్యింతిని నెత్తుకొని వచ్చి హృదయంబున నా
క్కింతయు వెఱవవు గర్వా
క్రాంతుఁడ వై యెంత కండకావరమొ కదా. 175

క. క్షితిలో స్త్రీవ్యసనంబే
యతిగర్హిత మందుపైఁ బరాంగన యాపై
నుతశీలుఁ డైనగురుసతి
పతివ్రత నీ వాచరింపఁ బాడియె నీకున్. 176

చ. అరయక మించి చేసితివి యౌవనగర్వముచే నకృత్య మి
త్తెఱఁ గిఁక మాను లైన నీదుతల్లిదండ్రులపై మొగమోట ని మ్మహా
త్తర మగుతప్పుఁ గాచితిమి దా యడ లేటికి నిప్పు డైన నా
గురు శరణంబు సొచ్చి యళికుంతల నిచ్చుట మేలు కానిచోన్.

క. ప్రకట మగుసంగరంబున
నొకక్షణమున నీపుచర్మ మొలిపించెద యా
మిక వేయించెద నిదె మా
మకభుజదండోళిచండిమం బెఱుఁగ వాకో. 178

మ. అని దిక్పాలకు లందఱు న్విననగ బంభారాతి పల్కెం గడుం
గినుక న్వారలు నిట్లనే యనిరి తీక్ష్ణీభావ మొప్ప న్మహా
మును లెల్లన్ శపియింపఁగాఁ దలఁచి రున్మాలంబుగా నాగ్రహం
బున సర్వామరసిద్ధసాధ్యులును గుంపు ల్గూడినా రెల్లెడన్. 179

క. నా విని నునుమీసముపై
చే వైచి మొగంబునందు చిఱునవ్వును గో
పావేశంబును దోఁపఁగ
నావేలుపుదూతఁ జూచి యతఁ డిట్లనియెన్. 180

శా. ఓ హోహో! పురుహూతుఁ డెంతటిగృహస్థో! యిట్లు దాఁ బల్క నీ
యూహాపోహము లెందుఁ బోయెనొకో! ప్రత్యూషంబునం గోడివై
మోహావృత్తి నహల్యఁ గూడు నెడలన్ బోధింప నేవార్ల ని
ట్లాహా! యొజ్జలపుచ్చకాయపిత మౌరా వేయు నిం కేటికిన్! 181

సీ. అమరేంద్రసంశుద్ధి యతని మే న్దెలుపదా,
  ఋషివధూరతి వహ్ని కిపుడు లేదొ
మఱచెనో పాండుభామాస్నేహ మినజుండు,
  నైర్మృతినియమ మెన్నాళ్ళ నుండి
పొసఁగఁ గాలేదొ యూర్వశిగుత్త వరుణున,
  కనిలుఁ డంజనిఁ గూడి దనియఁ డేమొ
కన్నెత్తి యొకసతిఁ గనుఁగొనఁడొ కుబేరుఁ,
  డెనయఁడో దారుకావనిని శివుఁడు
గీ. తమతమచరిత్ర లెఱుఁగక తాము నొకరి
ననుకొనుట లాయెనా మంచి దంద్రుగాక
నోళ్లు మూయింతు మద్భుజానూనచండ
గాండివనినాద మొనరునక్కఁదనమునను. 182
క. మగనియెడ రోసి తటు న
మ్మగువయె నను వలచి వచ్చి మంచాడినచోఁ
దగులువడితి నన్నందుకు
దిగఁ బాశెము రాజువేరు తెలియనిమూఢుల్. 183
ఉ. ఇందుకుగా వహించుక సురేంద్రుఁ డుపేంద్రుఁడు శూలి కీలియున్
గ్రందుగ నిర్జరోరగనికాయము లొక్కట వచ్చి తాఁకినన్
జెందిన వేడ్కఁ దారసిలి చిందరవందర గాఁగఁ జేసెదన్
జందనగంధి నిత్తునె పొసంగనిసంధికి నేను జొత్తునే. 184
క. ఈవార్తలు మీదొరతో
వే వివరింపు మని పలికి వీడ్కొల్పఁగ వాఁ
డావిబుధేంద్రుని చెంతకుఁ
దా వచ్చి తదుక్తి యెల్లఁ దగఁ దెల్పుటయున్. 185
ఉ. వింటిరె వానిప్రల్లదపువెంగలికూఁతలు వచ్చె నత్రివా
రింటికి పోని యింతటియకృత్యముఁ జేసియు స్రుక్కఁ డెంతయున్
బంటుతనంబులా జలదపంక్తులలోపల దాఁచియున్న నా
వింటికిఁ గార్య మచ్చె వెద వెట్టెద తత్తనుమాంసఖండముల్. 186
చ. చెదరనికొండల న్దరఁగఁ జేయుమదుజ్జ్వలవజ్రకీలికిన్
మృదు వగునీసముద్రనవనీతపుముద్దఁ గరంచు టెంత నే

నిదె కదనంపుటాయితము హెచ్చుగ వచ్చెద మీర లిప్పుడే
కదలుఁడు చాటి చెప్పఁ దెలుఁగన్ దెఱగంటివజీర్ల కీయెడన్. 187

క. అని పలికి యంతిపురికిన్
జనె సురపతి యంత నచటిజగడపువార్త
ల్విని నారదుండు తనురుచి
జనితశరన్నారదుండు సంతస మెసఁగన్. 188

సీ. అక్షసూత్రము ద్రిప్పు నంగుళీతలి యుద్ధ
జని హేతుయోజనాభినయ మెసఁగ
శౌరిఁ బేర్కొనుజిహ్వ సమరకారణమైన,
తారావధూటి సంస్తవము చెలఁగ
యలఘువైరాగ్యనిర్మల మైనమదిలోన,
జగడంపువేడుక చిగురులొత్త
నియమకర్శిత మైననెమ్మేన భావిర,
ణోత్సాహకృత మైనయుబ్బు మెఱయ

గీ. కలిగెఁ బో యిన్ని నాళ్లకు కడుపునిండ
నిష్టమృష్టాన్న మని పరితుష్టుఁ డగుచుఁ
గుంచె విసరుచు వచ్చె విరించికొడుకు
కడురయంబున నపుడు భార్గవునికడకు. 189

క. ఆరీతి న్జనుదెంచిన
నారదునకు దైత్యగురుఁడు నయవిధుల న్స
త్కారము గావించి దర
స్మేరముఖుం డగుచు నేర్పు మెఱయం బల్కెన్. 190

చ. అనఘ! యపూర్వమైనభవదాగమనంబు తలంప నొక్కచోఁ
బొనరిన కయ్య మిప్పు డెగఁబోయఁగ వచ్చినయట్లు దోఁచె నీ
వనుపమదేవదానవమహాహవనాటకసూత్రధారి వై
ఘనముగ వీణె మీటులయకాఁడవు నీయొళ వే నెఱుంగనే. 191

క. అనుటయు నగి పరభావముఁ
గని పల్కెఁగ నేర్పుకృతివి గావే రవి గా
నని చోటును కవి గనుఁగొను
ననుమాట యథార్థ మయ్యె నైనను వినుమా. 192

ఉ. లాలితరూపయౌవనకళారసధాముఁడు సోముఁ డర్థిమై
వేలుపుటొజ్జపజ్జ నొగి విద్యలు నేర్చుచు నుండ వానియి
ల్లాలొకచోటఁ దా నతని కంగజవిద్యలు నేర్పి సాహసో
ద్వేలతఁ జంద్రుఁ దోడ్కొని తదీయగృహంబున కేఁగె నంతటన్. 193

క. ఆచందము వేవేగన్
వాచస్పతి వచ్చి తెలుప వాస్తోష్పతి దా
నైచఁగ యేచిన కినుక
న్జూచి విధునిమీఁద సైన్యములతో వెడలెన్. 19

ఉ. చందురుఁ డొక్కరుండు బహుసంగరకోవిదులై కడంగుసం
క్రందనవహ్నిముఖ్యరథికప్రవరుల్ మఱి వేనవేలు వా
రందఱు నొక్కనిం బొదువునప్పు డుపేక్ష యొనర్పఁ బాడియే
యిందున కీవు బాసటయి యిందునకుం జయ మిమ్ము భార్గవా! 195

వ. అనిన దరహాసభాసురముఖుం డై శుక్రుం డిట్లనియె. 196

శా. ఏమేమీ కడువింత వింటిమి బళీ! యిల్లాండ్రలోఁ దార బ
ల్మామే చంద్రుని ముఖ్యశిష్యునిగ నెంచంబోలు మా కింక సు
త్రామాదుల్ వీడిఁ జుట్టుకొన్న శశిమీఁదన్ రేఖ గానిత్తు నే
నామాహాత్మ్యముఁ జూడుమా గురుని నిందామగ్నుఁ గావించెదన్.

క. సురసంయమివర! మీకున్
బెరిమన్ దృప్తిగను విందుఁ బెట్టించెద సం
గరమున మీరు నిజేచ్ఛా
పరతం జనుఁ డంచుఁ బంచి భార్గవుఁ డంతన్. 198

క. వృషపర్వాదిమహాసుర
వృషభుల రావించి చంద్రువిధముఁ దెలిపి యీ
విషమసమయంబునను నని
మిషులం గెల్తు మని నీతి మెఱయఁగ నంతన్. 199

క. శీతాంశుని చెంతకు నొక
దూతం బనిపించి తాము దోడ్పడురీతుల్
ప్రీతి వినఁ జేసి దైత్యస
మేతముగా శుక్రుఁ డచటికే తెంచుటయున్. 200

గీ. ఎదురుగా వచ్చి శుక్రున కెలమి మ్రొక్కి
కలువరాయఁడు దనుజులఁ గౌఁగిలించి
వావివరుసలు మెఱయంగ వారు దాను
నెనసి క్షీరోదకన్యాయమున వసించె. 201

వ. అనుటయు. 202

ఆశ్వాసాంతము.

శా. శ్రీరామానుజకీర్తిధారణ! రణశ్రీవేణికాఖడ్గధా
రారాజత్కరపద్మ! పద్మహితకృద్రంగద్భుజాధామ! ధా
మారామాంబుజవాసినీపదసముద్యన్మాపురారావదీ
ర్ణారాతిప్రభుకర్ణ! కర్ణశిబికల్పా! కల్పదానోదయా!. 203

క. ధారాళజయవిహారా!
హారాయతకీర్తికృతదిశాలంకారా!
కారావసదరివారా!
వారాశిశయానపాదభక్త్యాధారా. 204

తోటకవృత్తము.
కురుకరహాటకరూశవరాటకకోసలభోజకళింగమహీ
వరనుతహాటకరత్నకవాటకవర్ణితకూటక! దానజితా
మరతరువాటక! సద్గుణపేటిక! మర్దితతాటక! సాత్కృతధీ
విరచితనాటక! దండకఝూటకవీంద్రకిరీటకళాకలితా!. 205

గద్య. ఇది శ్రీజానకీరామచంద్రచరణారవిందవందనకందళితానందకందాళ రామానుజగురుచరణసేవాసమాసాదితసాహితీవైభవశేషము కృష్ణయార్యతనూభవ సుకవిజనవిధేయ వేంకటపతి నామధేయప్రణీతంబైన శశాంకవిజయం బనుమహాప్రబంధమునందుఁ జతుర్థాశ్వాసము.

శ్రీ ర స్తు.

# శ శాం క వి జ య ము.

## పం చ మా శ్వా స ము.



మన్నరురంగాధిప
రామానుజగుణగణాంకరచనాముదితా
హేమాచలమలయాచల
సీమాచరసుకవిచంద్ర! సీనసుధీంద్రా.

వ. అవధరింపుము సూతుండు శౌనకాదిమునీంద్రుల కిట్లనియె.

క. అంత శచీకాంతుఁడు మది
నెంతయుఁ గుతుకమున వీరశృంగారరసా
త్యంతరమణీయవైఖరి
వింతై కనుపట్టుమహితవిభవము మెఱయన్.

సీ. ధళధళద్యుతి నిండుతగటిమెఱుంగుదు,
ప్పటి కాసెచుంగులు బాగుమీఱ
మృగమదాంకిత మైనమేన వేగన్నులఁ,
గనుపట్టుఘనవజ్రకవచ మొప్ప
దివ్యమాణిక్య దేదీప్యమానకిరీట,
ఘృణు లెల్లదెసల నీరెండ గాయ
కంకణమౌర్వీకిణాంక మౌకెంగేల,
శతకోటి శతకోటిచెన్ను మిగుల

గీ. కల్పసుమధామభూషణోత్కరము మెఱయ
చెలఁగి దేవర్షిగణము లాశీర్వదింప
మందహాసంబు మోమునఁ గందళింప
వెడలె జంభారి కయ్యంపువేడ్క మీఱ.

శా. ఆరీతి న్జనుదెంచి యాఘనుఁడు ప్రోద్యద్దానధారాఝరీ
పూరంబు ల్సెలయేరులై తగ జగాపాంబట్టుసాల్ గైరిక
శ్రీ రంజిల్ల చరత్తుషారగిరి నాఁ జెల్వొందునైరావతం
బారోహించె దిశావకాశములఁ దూర్యారావము ల్నిండఁగన్. 5

చ. అజిముఖి వహ్ని మేషము కృతాంతుఁడు దున్న నరాశి మానవున్
వరుణుఁడు నక్రరాజమును వాయువు లేడి కుబేరుఁ డశ్వ మీ
శ్వరుఁడు వృషంబు నెక్కి వడి శక్తియు దండము కుంతపాశముల్
సురుచిర మౌధ్వజంబు నసి శూలమునుం గొని తోడు గూడఁగన్. 6

ఉ. మోమున లేఁతనవ్వెసఁగ ముత్యపుటొంట్లసియాడ మల్కుతో
డా మెనవెట్టి కట్టినకడానిజగాజిగిపాగమీఁద ని
ద్దా మెఱుఁగొందు రాగులుక తండ్రిపిఱుంద జయంతుఁ డాశ్విక
స్తోముఁడు తోడ వచ్చె రవజోడలరన్ వెలివాజి మీటుచున్. 7

ఉ. స్వర్ణచిరత్నరత్నమయచక్రరవంబుల నబ్జజాండముల్
ఘూర్ణిలఁ గేతుకోటి మెఱుఁగు ల్నిగుడ న్వరహేమభూమిభృ
త్తర్ణకవైఖరిం దగ రథంబులు గొల్వఁగఁ జేరి మ్రొక్కి య
భ్యర్ణమునందె మాతలి రయంబున వచ్చె బలారి మెచ్చఁగన్. 8

మ. బహువర్ణాఢ్యకుథవ్రజంబు మణిచాపప్రక్రియన్ మీఱఁగా
నహానోదంచిత హేమకక్ష్యలు తటిన్మంజుస్థితిన్ బూనఁగా
లహరీవన్మదవారివర్షముగ లీలన్ మత్తమాతంగముల్
రహిఁ గన్పట్టెను మేఘవాహనుని మ్రోలన్ మేఘజాలం బనన్. 9

మ. హరి గన్పట్టెను విశ్వరుద్రవసుమాహారాజికాదిత్యభా
స్వరవిద్యాధరసిద్ధసాధ్యతుషితస్వర్వైద్యగంధర్వకి
న్నరయక్షోరగచారణానిలసువర్ణశ్రేష్ఠు లుద్యద్గదా
పరిఘప్రాసపరశ్వథాసిధరులై పార్శ్వంబులం గొల్వఁగన్. 10

మత్తకోకిల.

ఇత్తెఱంగున మోహరించి మహేంద్రుఁ డాహవకౌతుకా
యత్తచిత్తత సర్వదిగ్వలయాంబరక్షితిభాగము
ల్బిత్తు లెత్త గభీరభైరవభేరికాపటహంబు లు
ద్వృత్తి మ్రోయఁగ ముజ్జగంబుల మ్రింగుభంగిఁ గడంగినన్.

క. చారులచే నాచందం
బారూఢిగఁ దెలిసి చంద్రుఁ డాహవకేళీ
ప్రారంభసూచకంబుగ
వీరోత్సాహమున భేరి వేయించుటయున్. 12

చ. చెదరె గిరుల్దివం బడరె శ్రీపతి దిగ్గున నిద్ర మేల్కొనెన్
బెదరె నజాండభాండములు భేదిలె నాదిమభోగికన్నుగ్రు
డ్లదిరెఁ గలంగె వారినిధు లొక్కట దిక్తటసంధిబంధము
ల్విదలెను పొట్లపువ్వు లన వ్రాలెను ఝల్లన చుక్క లత్తఱిన్. 13

సీ. బిబ్బోకవతి గబ్బిగుబ్బ గుప్పినసొంపు,
గను సురంబున దివ్యకవచ మొప్ప
జవరాలినునుకీలుజడ వేటుదద్దుము,
ద్దులవెన్ను నను కవదొనలు మెఱయ
వెలఁదికిఁ గలపంబు నలఁద ఘు మ్మనుపాణి,
తలమున గాండివధనువు దనర
కిసలయాధరమేని పసపుడా ల్దుప్పటి,
కాసె నొప్పగు మొలకత్తి యమర

గీ. మోముఁదామరచిఱునవ్వు మురువు మీఱ
తారఁ గౌఁగిటఁ జేర్చి యత్తలిరుఁబోణి
కులుకు కిలికించితంబుగ గెలువు మనుచుఁ
బనుప రహి మీఱె వనజారి బయలుదేఱె. 14

మ. బలువజ్రంబులబండ్లు కెంపుటిరుసు ల్పాఁబచ్చుటాకూబరం
బులు సన్నీలమణిత్రివేణువు మహాముక్తామణీపీఠమున్
తెలివాజు ల్హారిణధ్వజంబు నమరన్ దివ్యాయుధోదగ్రమౌ
నలఘుస్యందన మెక్కి దైత్యగురుక్ష్మప్తామోఘులగ్నంబునన్. 15

సీ. అతిలోకభుజగర్వుఁ డగువృషపర్వుఁడు,
విషమాహితులమిత్తి విప్రజిత్తి
యరిచమూచిత్తదత్తామయుండు మయుండు,
శంబరుం డురుబలాడంబరుండు
సమరసైన్యాజయ్యుఁ డగుశతమాయుండు,
తారకుం డనలోగ్రతారకుండు

ఘనవిభాజితవిరోచనుఁడు విరోచనుఁ,
డాహవదళితాభియాతి హేతి
గీ. యనెడుదైత్యేంద్రు లెనమండ్రు నాజి తామె
యష్టదిక్పాలకుల నోర్తు మనుచు సింహ
శరభశార్దూలవృకఘోణిఖరమహోష్ట్ర
తురగముల నెక్కి యుద్ధసన్నద్ధు లగుచు. 16
చ. వెడలఁ దదీయసైన్యములు వెల్వడె నుగ్రతఁ గాలమేఘము
ల్కడఁగినలీల నొక్కమొగి గాటపుఁగాటుకకొండతండము
ల్వెడివడునట్టు లబ్ధు లతివేలములై యరుదెంచునట్లుగా
నడిదములున్ గద ల్గుదియ లమ్ములు విండ్లును బూని యుగ్రతన్.
సీ. మదచండవేదండమండలు ల్గొండలు,
ఘోటకచ్ఛట లూర్మిఘాటకములు
దరదములై యొప్పునరదముల్ దీవులు,
పటవాళ్ళు కడిమి గన్పడు మొసళ్ళు
కరవాలచయము భీకరవాలమీనముల్,
చక్రసంహతి తోయచక్రవితతి
చంద్రార్ధచంద్రాంకచర్మము ల్కూర్మము,
లాయుధద్యుతిజాల మౌర్వకీల
గీ. లగుచుఁ గనుపట్టుదైత్యసేనార్ణవంబు
భూరిచందోదయంబునఁ బొంగి పొరలి
కెరలి శరలీల వరలంగఁ దరలి వచ్చు
నమరవాహినితో ముదం బమరఁ గవిసె. 18
ఉ. ఆపగిదిన్ ఘటించి యమరాసురసైన్యము లంతనంతయున్
గోపము లగ్గలింప నెలగో ల్జగడంబునఁ జేరి చేరి తోఁ
దోపుల మీఱి మేటిరవుతుల్ తురగంబుల మీటి పిల్వ చె
య్యాపక పూర్వపశ్చిమమహాంబునిధు ల్వలెఁ దారసిల్లినన్. 19
క. సుభటుఁడు సుభటుఁడు హరి హరి
యిభ మిభమున్ రథము రథము నెదిరించినయా
రభస మిది యేమి చెప్పన్
నభ మగిలెన్ బుడమి గ్రుంగె నగములు పగిలెన్. 20

వ. ఇవ్విధంబునం గ్రమ్మి యమ్మోహరంబులు రెండును ముమ్మరంబుగాఁ
బోరునవసరంబున యుగనిగమనారంభసంరంభ విజృంభమాణమ
హాంభోధరగర్జాగంభీరంబు లయినభేరీభాంకారంబులును ప్రళయ
కాలభైరవహుంకారశంకారచనాచరణంబు లయినభీమఢమాఢమి
కాఢమఢమత్కారంబులు నకుంఠితపురుషకంఠీరవకంఠ నాళక్ష్వే
ళాకరాళంబు లైనవీరకాహళీకోలాహలంబులును విగ్రహావేళాగ్ర
హోదగ్రహయగ్రీవగ్రీవామహోగ్రహేషాభీషణతాక్రూరంబు లయి
నబూరగలరవంబులును మంథాచలమంథానమథ్యమానమహార్ణవో
దీర్ణనినాదానువాదంబు లయినయసంఖ్యశంఖఘుమఘుమప్రణాదం
బులునుసంవర్తనర్తనప్రవృత్తమృత్యుంజయచరణసంఘటనస్వనఘోష
ణంబు లయినవీరభుజాస్ఫాలననిర్ఘోషణంబులును మహావరాహ
ఘోణారవజయప్రవీణంబు లయినపటహడిండిమడమరుఢక్కాఝల్ల
రీతమ్మటప్రముఖనిఖిలవాద్యరావంబులు గొల్లన నుల్లసిల్లిన ఝల్లన
మదంబు లుప్పతిల్ల నిప్పు లురులుచూడ్కులఁ బ్రతిసేనాగజంబులఁ
గనుంగొని ఘళంఘళధ్వానంబులు మీఱ బారిగొలుసులు పరబలం
బులఁ బాయం గొట్టి యుద్యదాధోరణంబు లయినరిపువారణంబులం
దాఁకి ఘణిల్లు ఘణిల్లునం గొమ్ముకట్లొరయ నగ్నికణంబులు నభోం
గణంబున కెగయఁ గఠిల్లుపెఠిల్లునఁ గఠోరదంతంబులు చిట్లఁ దుం
డంబులు పెనుచుకొన నొండొంటిం దాఁకి ఘణంఘణితకాంచనఘం
టికాసంఘంబులతోడం గూడ ఱెక్కలతోడికొండలుంబలె నొకటొ
కటిం బట్టికొని యిమ్ముగా దంభోళిశకలాకారంబు లయినకొమ్ముకత్తు
లు గట్టినకొమ్ము లెంతయుం జూడఁ గ్రుమ్ములాడుచుం బోరునేనుంగు
లును తరటు గావించి ఘోటకంబుల మీటి ప్రతిబలంబులు బడలు
వడంజొచ్చి పగతురనిగిడించుకుంతతోమరప్రాసశక్తిశూలాద్యాయు
ధంబులు చిదురుపలై గగనంబున కెగయం దొడుపుకత్తులు బిసబిస
విసరుచు వేడంబులఁ దిరుగుచు కేడెంబు లొడ్డుకొని చకచకాయ
మానంబు లయినచికిలిబాకుతారులు గొని నఱుకులాడురవుతులును
రథచక్రఘోషంబులును గేతనపటపటాత్కారంబులు నింగిముట్ట నర
దంబులు నిబ్బరంబుగాఁ బఱపుచుం బ్రతిశతాంగంబుల నబ్బాటుగా
మెట్టింపుచు లాఘవలక్ష్యశుద్ధిదృఢత్వచిత్రత్వంబులు మెఱయ నర

యంబుగాఁ గోదండపాండిత్యంబు నెఱపుచు నంపపరంపరలం బెంప
రలాడురథికులును గుదికాండ్ర చేసన్న నుబ్బి గబ్బి మిగులం బొబ్బ
లిడుచు నొక్కనితోఁ బెక్కండ్రును బెక్కండ్రతో నొక్కండును
తారసం బై యీరసంబున నుక్కునారాసంబులు నిగిడించియుఁ
జేరినచోట నీటులం బోటులాడియు డాసిన యెడఁ గరాసిగొని మిగుల
హత్తినయెడ నూరికత్తులం గొని యుద్ధు లుద్ధులుగా గుద్దులాడు
కాలుబంట్లును గలిగి దారుణం బయినయారణంబునఁ దదీయక్రో
ధాగ్నిధూమస్తోమంబులచొప్పున నప్పరంబునన్ గప్పలు విరాటుకుం
గప్పుకప్పుదుప్పటియొప్పున గుప్పునం దుప్పఁ గట్టుటయును తమవా
రనియును బెరవారనియునుం దెలియక చేసన్నలం దడవి పట్టుకొని
యుబ్బినకైదువులచే నేటులాడి రయ్యవసరంబున నయ్యమరాసుర
సేనాసందోహంబులు నెత్తురువానల నమ్మహీపరాగం బణంగుటయు
ఖండంబు లయినతుండంబులును దుమ్ము రయినఱొమ్ములును భేదంబు
లయినపాదంబులును దీర్ణంబు లయినకర్ణంబులును చీలిక లయిన
చూళికలును విద్ధంబు లయినవాహిత్థంబులును గాయంబు లయిన
కాయంబులునుం గలిగి మావంతులతోడం గూడఁ బీనుంగు
లయినయేనుంగులును పగిలినవోళ్లును బరియ లయినజోళ్లును దుని
సినశిరంబులును తుమురు లయినఖురంబులును జీలినగల్లంబులును
జిద్రుపలైనపల్లంబులును వీడినభూషణబృందంబులును నలిసినఱొమ్ము
లును నజ్జు లైనయెమ్ములును బ్రద్ద లైనవెన్నులును బగిలినకన్నులును
దెగినవాలంబులును దీనదశం బొందినరాహుత్తజాలంబులును గలిగి
యపరిమితరక్తధారాతరంగంబులును జక్రంబులు ప్రీలి సారథుల్
గూలి కేతనంబులు వ్రాలి కింకిణులు రాలి రథికులు సోలి రథ్యంబులు
ప్రేలి రయంబులు మాలి రణాంగణంబునం దూలి హతాంగంబు
లైనశతాంగంబులును బదంబులు రదంబులును పాణులు కృపా
ణులును నురంబులు శిరంబులును వర్మంబులు చర్మంబులును
వెన్నులు చన్నులును పక్కలు డొక్కలును వీనులు జానులును
నేత్రంబులు గాత్రంబులును ఫాలంబులు కపోలంబులును తొడలు
మెడలును వేళ్ళు నోళ్ళును గడికండలు పడకండలు నెత్తురులు
గ్రక్కుచుఁ బొడిచినపోటుగంటి వెంబడి వేదు రెక్కి నఱికి యరిపీర్గుల

శిరంబులు ద్రొక్కి క్రిక్కిరిసిన వైరిభటశరీరంబులు తలగడలుగా నొడు గఱచి మీసంబులమీఁద చేవైచికొని గతప్రాణులై పడినవీరభటులు గలిగి సంగరాంగణంబు ఘోరం బయ్యె నప్పుడు కేశంబులు శైవాలంబులును మొగంబులు పద్మంబులును భుజంబులు మీనంబులును శిరఃకపాలంబులు గవ్వలును ద్విపంబులు ద్వీపంబులును చూర్ణితాభరణరత్నరాసు లిసుకలును కంఠంబులు శంఖంబులును మేదోమాంసమస్తిష్కంబులు పంకంబులునుం గలిగి సురాసురశరీరపట్టంబులు దెట్టలం ద్రోయుచు వేలకోలందు లగు నెత్తురుటేరులు ప్రవహింప నందు భూతబేతాళడాకినీశాకినీయాకినీలాకినీపిశాచకూశ్మాండరాక్షసాదిగణంబు లుద్దులుద్దులుగా నోలలాడుచుం బ్రమోదంబునం దేలుచు నరంబులం బెనచి కరంబులం గట్టినశిరంబు లనునందెలును గజతుండఖండంబు లనుచిమ్మనగ్రోవులం బట్టి నెత్తురునీరు చిమ్ములాడుచు మునింగి యొండొరులం బట్టుచు నిట్టలంబుగా జలక్రీడలాడి క్రొవ్వుపాద లను తెలిచల్వలం గట్టి నల్ల లనుతిలకంబులు దీర్చి సన్నపురంబు లనుసరంబులు వైచి నేత్రకమలమాలికాజాలంబులు ధరియించి మెదడుగంధంబు లలంది గుండెతండంబులు మెక్కి క్రొత్తరక్తంబులు గ్రోలి చొక్కి సోలుచుఁ గరతాళగతుల నాడఁ దొడంగిరప్పు డయ్యిరువాగునం గడిందివీరు లనుబేహారు రథంబులు ననునోడల నెక్కి సంగరం బనుసముద్రంబుఁ జొచ్చి తమతమప్రాణంబు లనుధనంబు లిచ్చి నిచ్చలం బయినకీర్తు లనుముత్యంబులు గొని రాసులు పోసి రయ్యవసరంబున దుర్వారగర్వంబులు పర్వ గీర్వాణులు ద్రోసి నడిచినం బూర్వగీర్వాణులు నెగ్గబారిన వృషపర్వుం డదల్చి తెరలినబలంబుల మరలం బురికొల్పి తక్కినదండనాథులం దానును రథనేమిక్రేంకార భేరీభాంకార శింజినీటంకార వీరభటహుంకారంబులన్ వియత్తలంబు నొంది యెదిర్చుటయు నిలింపులు గుంపులుగూడి తెంపునం దారసిల్లిన నింద్రుండును వృషపర్వుండును నగ్నియు విప్రజిత్తియు దండధరుండును దామరకుండును మయుండును నైరృతియు వరుణుండును శంబరుండును వాయువు శతమాయుండును కుబేరుండును విరోచనుండును దుర్మదుండును నీశానుండును హయగ్రీ

శుంభనిశుంభులు నాదిత్యవసురుద్రులును ద్వంద్వయుద్ధంబునకు దొరఁకొనఁ దొణంగి రప్పుడు. 21

ఉ. సింగముమీఁద నెక్కి పటుశింజిని మ్రోయఁ గడంగి విక్రమా
భంగత నింద్రు డాసి వృషపర్వుఁడు శాతశరంబు లేయ శ
క్తిం గొని వైచి యింద్రుఁ డలకేసరి గూల్చిన వాఁడు తేజికిన్
జెంగున దాఁటి దాఁటి సురసామజరాజముఁ జూచి మీటినన్. 22

వ. తదనంతరంబ యాలోన. 23

క. సారగజేంద్రము దానిం
బారి గొలును చేత విసరఁ బటురయమున న
వ్వారువము గాలిచక్రము
దారి న్వేడెములు దిరుగ దనుజేంద్రుండున్. 24

క. నేజము గొని యిప్పోటున
నే జమునిం జేర్తు ననుచు నిశిచరవీరుల్
జేజే లిడ సాహసమున
జేజేలగజంబు కుంభసీమం గ్రుమ్మెన్. 25

క. దానికిఁ గలఁగక శతముఖు
దాని కినుక మీఱ దానధారాస్ఫురణం
బూని కరమ్మునఁ జిమ్మెను
బూచి కర మ్మెదుర దనుజపుంగవుహయమున్. 26

క. అందుకు వెఱవక తురగము
కందుకము ట్లెగసి తూఱఁగా నిగళము చే
నందుకొని ఘులఘులధ్వని
గ్రందుకొన న్విసర వేల్పుగజ మవ్వేళన్. 27

క. సుడివడక యొ వేదంబుల
సుడిగాలిగతిన్ హయంబు సురకరిఁ జుట్టెన్
వడి దిరుగఁగ నడిదముఁ గొని
బెడిదము గా నఱకి వాఁడు పెళపెళ నార్చెన్. 28

క. అమ్మదనాగేంద్రంబును
గుమ్మరసారెగతిఁ జుట్టుకొని వడి దిరుగన్

ముష్మాత్తె యనుచుఁ జూపలు
ముష్మాలుం బొగడి రొక్కమొగి నవ్వేళన్. 29

క. వాలమ్మున నింద్రుఁడు కర
వాలమ్మున నుగ్గు సేసి వానిహయంబున్
ఫాలమ్ము నొవ్వ నేసిన
వాలమ్మునఁ బఱచె నది మహావేగమునన్. 30

ఉ. అందుక యుగ్రతుండమున నందుక నబ్ధిఁ బరిభ్రమించు న
మ్మందరశైలమో యన నమందర మద్దివిజేంద్రదంతి వీ
కం దగఁ ద్రొట్టి నిల్చుతురగం బురగం బురగారి బట్టుచా
యం దగఁ బట్టెఁ గంద మన నందఱు నం దరుదంది చూడఁగన్. 31

ఆ. హయము విడచి యసుర రయమున లంఘింప
నమరగజము వాని నమరఁగ జము
చెంత కనిచె నంత నంతకాకృతి నతం
డరద మెక్కె నీలశరదలీల. 32

క. కనుపట్టె శరపరంపర
లనిమిషపతిమీఁదఁ గురియ నతఁడును రింఖ
త్కనకమణిపుంఖశరముల
నినిచెను దినకరుఁడు కిరణనికరమువోలెన్. 33

చ. అనలుఁడు విప్రజిత్తియు రయంబున మార్కొని పోరువేళ న
య్యనలుఁడు సప్తసాయకము లాతనిపై నిగిడింపఁ దోడనే
తునిమి యతండు తత్తనువు తొమ్మిదియమ్ముల నాట నాతఁ డా
తనివిలు ద్రుంచి నొంచిన నతండును వేఱొకవింట మార్కొనెన్. 34

సీ. తారకయములు విస్తారకనచ్చాప,
నైపుణిఁ బోరి రందఱును బొగడ
మయనైరృతులు వహ్నిమయనైకశరముల,
నొక్క రొక్కరిఁ గప్పి దక్కు మీఱ
శంబరాబ్ధీశులు శంబరాజద్బాణ,
శతము లేసిరి పరస్పరతనువుల
హేతిసమీరణుల్ హేతిఘట్టనల చే,
మిణుఁగురు లెగయంగ రణముఁ జేసి

గీ. రలవిరోచనుఁ డర్ధేశు నలవి లేని
భల్లముల నేయ నాతఁడు విల్లు దునిమె
దుర్మదుం డిందుమౌళితో దుర్మదమునఁ
బోరెఁ గేసరితోఁ గరి పోరినట్లు. 35

క. తక్కుఁ గలదనుజవీరులు
తక్కటిగీర్వాణపరులు దలపడి వైరం
బెక్కఁగ నెక్కటి పోరిరి
యుక్కున బ్రహ్మాండభాండ ముఱ్ఱట్లూఁగన్. 36

క. నక్రౌర్యత నావేళన్
శుక్రుఁడు సురగురునిఁ జూచి సోల్లుంఠనముల్
వక్రోక్తి నాడ నాతఁడు
శక్రుదెసం జూచెఁ జూడ శతమఖుఁ డనియెన్. 37

క. నేఁడే కడంగి శుక్రుఁడు
చూడఁగ జగ మెల్ల దనుజశూన్య మొనర్తున్
జూడుఁడు వేడుక యెఱుఁగక
లాడితి నని యతనిచిత్త మదరఁగ ననుచున్ 38

లయగ్రాహి.
బంగరుబెడంగుబలుసింగిణి వడిం గరము,
నం గొని కడంగి ధర నింగియుఁ గలంగన్
ఖంగు ఖణి ఖంగు రనుచుం గుణ మెసంగి మొఱ,
యంగఁ బ్రజలం గినిసి మ్రింగుజముభంగిన్
బొంగి సమరాంగణమునం గజతురంగమశ,
తాంగసుభటాంగము లిలం గలిసి బ్రుంగన్
సింగము కురంగసమితిం గసిమసంగెడు తె,
ఱంగున నభంగజయ సంగతిఁ జెలంగన్. 39

ఉ. తోడనె కూడి దిక్పతులు దుస్సహసూర్యకరంబులో యనన్
వేఁడిమి మీఱుబాణముల వేలకొలందిగ దైత్యవీరులన్
పోడి మడంప వారలును బోరన పో రొనరింపఁ జాలకే
వ్రీడ దొఱంగి పాఱి రటు వేలుపుమూఁకలు వెంట నంటఁగన్. 40

క. మాయాదివ్యంతులు శత
మాయాదినిశాటవరులు మఱలి చలమునన్
మాయారణమున దివిజుల
మాయఁగ జేయుటకు నైకమత్యము మెఱయన్. 41

సీ. నగము లై కూరపన్నగము లై హాలహాల,
గరము లై ప్రళయసాగరము లగుచు
ధరము లై కాలాంబుధరము లై యసిపత్ర,
వనము లై ఝంఝూపవనము లగుచు
ఖరము లై ద్విరద శేఖరము లై పటుపాద,
రసము లై కఱకునారసము లగుచు
జలము లై రక్తపింజరము లై దుర్వార,
తమము లై సైంధవోత్తమము లగుచు

గీ. వెఱపుఁ బుట్టించి పోనీక వెంబడించి
కహాకహార్భటి చాల దిక్తటుల నించి
వేగ నానావిధాయుధవృష్టి ముంచి
కదన మొనరించి రిట్టు లగ్గలిక మించి. 42

ఉ. అత్తఱి ధారుణీతలవియత్తలము ల్గన నొక్కటయ్యె ను
న్మత్తసురారిబృందములమాయల వహ్నియమాదిదిక్పతు
ల్గత్తర మంది తత్ప్రతివిధానము సేయ నెఱుంగ రైన నా
యత్తత నేమియుం దెలియ కయ్యమరేంద్రుఁడు నుండె దీనుఁ డై.

ఉ. అంత జయంతుఁ డెంతయు రయంబున దేవహయంబు నెక్కి రే
వంతునిరీతి చోదనలు వల్గనము ల్రవగా ల్చెలంగ నం
తంతఁ గణంగి కుందనపుటందపుసింగిణి మ్రోయఁ జేసి కా
లాంతకదండచండవివిధాస్త్రపరంపర లెందు నించుచున్. 44

గీ. తనదుగాంధర్వమాయ నాదనుజవరుల
మాయ మాయించి వృషపర్వ మయుని దక్క
నసురముఖ్యుల నెనమండ్ర నైంద్రముఖ్య
దివ్యబాణాష్టకముల వధించె నపుడు. 45

చ. దనుజులపాటుఁ జూచి మదిఁ దల్లడ మందుచు నుండుశుక్రునిం
గని గురుఁ డంత సంతసము గాంచి జయంత! జయంత! యెంత ని

న్వినుతి యొనర్తు నే ననఁగ వేడుక మీఱఁ బురందరుండు నం
దనుని గవుంగిలించుకొని తద్దయు దీవన లిచ్చె మెచ్చుచున్. 43

వ. ఇవ్విధంబునం బురందరుం డమందానందంబున నందను నభినందనం బొనర్చి బృందారకసేనాసందోహంబులుం దానును చందురునిపయిం దాఁకుటయు నితండునుం దనసహాయులైనదైతేయులపాటును జయంతునిపోటునుం జూచి మనంబునఁ దాపంబునుం గోపంబునుం గదుర నెదుర సపరలజ్జావిషాదవేదనావిభావ్యుం డైనకావ్యునిం జూచి మీ యీక్షణంబున కీక్షణంబున నారణంబుచే పారణం బొనర్చెద నిమిషంబున ననిమిషు లెట్లయ్యెదరో కనుంగొనుఁ డని ప్రార్థించి శుక్రుని రథం బెక్కించుకొని శంఖకర్ణనామకుం డైననిజసారథిం జూచి నీరధి తెరల తెఱఁ గంటిన తెరగంటిబలంబులం గనుంగొంటి వేగాడ్పుకంటెను మనంబుకంటెను మనరథంబును రయంబుగాఁ బఱపింపుము మాతలి సిగ్గుఁ బఱపింపుము నీసూతచాతుర్యంబు నెరపింపుము చూత మని యగ్గించుటయు నతండును నిజమనోరథంబున కనుగుణంబుగా రథంబు నడిపించుటయు వజ్రమణిగణప్రభావిభాసితంబును వైడూర్యమయ హరిణధ్వజాభిరామంబు నగునమ్మహాస్యందనంబు నంబరమణిబింబంబునకుఁ బ్రతిబింబం బై వెలుంగునప్పు డసురపట్టంబులపయిం గిట్టి మేరుశరాసనంబు మోపెట్టుగట్టురాయల్లునివిధంబున నయ్యామినీవల్లభుండు గాండీవంబు మోపెట్టి గుణస్వనంబు గావించుటయు నమ్మహాస్వనంబు బ్రహ్మాండంబు నిండి యాఖండలాదిదిక్పతులం బెండుపఱచె నయ్యవసరంబున ననేకకోటిమార్తాండ మండలప్రభాడంబరవిడంబనంబైనయారాజుదివ్యతేజంబు సురాసురులకు దుర్నిరీక్ష్యం బై యుండె ననంతరంబ పద్మగర్భుండు పలుకు చిలుకలకొలికితోడం గూడ భండనంబు చూడ కోడెరాయంచ నెక్కి వేదంబులు నధ్యాత్మవాదంబులు యోగంబులు నఖిలయాగంబులు కాలాదిపదార్థంబులును మూర్తీభవించి తన్నుం గొల్వ నరుదెంచి కశ్యపాత్రివసిష్ఠవిశ్వామిత్రభరద్వాజప్రముఖు లైనమహామునులం గనుంగొని బహువిధయుద్ధంబులం జేసి వడసి సడిసన్న వార లింద్రాదిదిక్పాలకులు వీరలతోఁ జుక్క

లరా జెక్కటి నెక్కరణిం బెనంగునో చూడవలయు నని పలుకుచు
దేవతలకు నదృశ్యుం డై యుండె నాసమయంబున. 47

క. శుక్రుని మృతసంజీవని
నక్రము లగుదనుజముఖ్యు లని బ్రతుకక ముౝ
విక్రమమున శశి నొక్కరు
శక్రుఁడు మెచ్చంగ గెల్వఁ జను మన కనుచుౝ. 48

ఉ. ఒక్కట దిక్పతు ల్విబుధయోధులతో శశిఁ జుట్టి ముట్టి పే
రుక్కునఁ జక్రము ల్సరియ లుగ్రగదాపరిఘత్రిశూలము
ల్పెక్కుశిలీముఖంబులను భీమగతి న్మెయి నించి ముంచి నల్
దిక్కులఁ గ్రమ్మి దొమ్మిగ ధృతిౝ సమరం బొనరించి రుద్ధతిన్. 49

ఉ. అంత నితాంతకోపమున నత్రితనూభవుఁ డాత్మ భారతీ
కాంతుఁ దలంచి మ్రొక్కి రణకౌతుక ముల్లసిలౝ గణంగి య
త్యంతవిచిత్రలీల నొకయాయుధముౝ దనపై రథంబుపై
నంతపయి న్దురంగనివహంబుపయిం బడనీక త్రుంచుచున్. 50

సీ. వెండియుఁ గడఁగి చంద్రుండు గాండీవకో,
దండంబు కుండలితప్రశస్తి
నుండఁగా దిగిచి ప్రచండకాండంబు లొం,
డొండ దిఙ్మండలి నిండ నేసి
తండతండముగ వేదండంబులను రథ,
కాండంబు లశ్వప్రకాండములను
గండు మీఱుభటాళి ఖండఖండంబు లై,
వండఁ దరిగినట్లు భండనమున

గీ. మొండుకొనఁ జేసి కండలకొండ లేసఁగఁ
గుండలను గ్రమ్మరించినదండిరక్త
కాండములు గురియించి బ్రహ్మాండ మదర
దండిగా నార్చె నిర్జరు ల్బెండుపడఁగ. 51

క. ప్రదర మొకటి శశి యేసిన
పది నూఱై వేయు లక్ష పదిలక్షలు న
ర్బుదము ననంతంబును నై
యదె ముప్పదిమూఁడుకోట్లయమరుల ముంచెన్. 52

గీ. ఘంట నాడించినవితాన గండు తేటి
మొఱయుచందాన జలధర ముఱుమురీతి
యుఱిమి గీచినభాతి నై యుత్పలాక్షు
నారి రణమున మ్రోసె నాదార కపుడు. 53

సీ. అనువు లాసింపనివసువుల నెనమండ్ర,
నసదృశాంబకములపస యణంచి
యద్రిగలతి మీఱురుద్రుల బాణస,
ముద్ధమగ్నులఁ జేసి రౌద్ర ముడిపి
తద్ద రాజిల్లుపన్నిద్ద రాదిత్యుల,
వద్దఁ జేరక మున్నె సద్దు మాన్పి
కత్తులు పూని యున్మత్తులై వచ్చువ,
రత్తుల సముదగ్రవృత్తిఁ బాపి

గీ. మఱియు గంధర్వకిన్నరగరుడసిద్ధ
సాధ్యచారణయక్షభుజంగపతులు
చండగాండీవముక్తాస్త్రసమితి ముంచి
లీలఁ బఱపెను బంచబంగాళముగను. 54

ఉ. ఏచి జయంతుఁ డయ్యెడ నహీనశరంబులఁ జంద్రు నొంచినన్
జూచినమోదుగం దలఁపఁ బోలి యతం డలుకన్ శచీసుతుం
జూచి తృణీకరించి నగుచున్ వడి చన్నెఱయందు నుగ్రనా
రాచము నాటి వ్రాల్చెను ధరాస్థలి శుక్రుఁడు మెచ్చి యార్వఁగన్.

ఉ. అంత జయంతుపాటు హృదయం బెరియింప నిలింపభర్త చా
దంతిని డిగ్గి కాంచనరథం బధిరోహణ చేసి రోషదు
ర్దాంతత మాతలిం గని సుధాకరుపై మన తేరుఁ బోవని
మ్మింతట చంద్రుఁ డయ్యెడిని నింద్రుఁడు నయ్యెడి నిజ్జగంబులన్. 56

క. అని పల్కు ననిమిషేంద్రుని
మనమువలెన్ రయము మెఱయ మాతలి రథమున్
జనఁ జేయఁ జంద్రుసారథి
యును రథ మభిముఖము చేసె నురువడి మీఱన్. 57

ఉ. ఇద్దఱు నప్రమేయబలు లిద్దఱు నేర్పరు లస్త్రవిద్యచే
నిద్దఱు నుగ్రసాహసికు లిద్దఱు నక్షయబాణశోభితు

ల్పద్ధులు మీఱఁ దారసిలి పద్మభవాండము శింజినీధ్వనిశ్
బ్రద్ధలు వాఱఁ బోరి రటు పాకవిదారియు శోకవైరియున్. 58

ఉ. అక్షులు వేయిటం గినుక నగ్నికణంబులు రాలఁగా సహ
స్రాక్షుఁడు మండలీకృతశరాసనుఁడై రథరశ్మి కేతుచ
క్రాక్షతురంగసారథిసమన్విత మాగతి సారసారిపై
లక్షశరంబు లేసెను విలక్షిత భార్గవుఁ డాత్మఁ గుందఁగన్. 59

ఉ. చందురుఁడు న్పురందరనిశాతశరాహతిఁ గంది నివ్వెఱం
జెందఁగ నింద్రుఁ డిట్లను శశీ! వినరా వినరానిపాతకం
బందినవాని కార్తి యరుదా గురుదారకృతాపరాధమే
ధం దిగఁ ద్రోచి చేసితి వృథా విబుధావళితో విరోధమున్. 60

క. కావరమునఁ గానవు నీ
కా వర మజుఁ డిచ్చె ననుచు నది చెల్లెను నీ
కీవరకును విడువు మిఁకశ్
నీవరదర్పము నణంగ నేఁడు మృగాంకా! 61

క. ఆమాటల మన మెరియం
గా మదనుని మేనమామ గద్దింపుచు సు
త్రామా! నీమాహాత్మ్యము
నీమహిజను లెఱుఁగరొక్కొ యే నెఱుఁగనొకో! 62

సీ. కోడి వై మదనుని కోడి వైకృతి నహ,
ల్యాజారతను గాంచినట్టిదూరు
గురు వైనయట్టియీ గురు వైచి విశ్వరూ,
పుని గురు చేసి ద్రుంచినయఘంబు
యంబ యా దితికి న్యాయం బెఱుంగక గర్భ,
ఘాతం బొనర్చినపాతకంబు
యజ్ఞహయం బన యజ్ఞత ముచ్చిలి,
సగరుఁ గీడ్పఱిచినతగనివితము

గీ. మఱచితో పరుఁ దెగడెదు మదముకతన
సిగ్గుపడలేవు నీమేను చిన్నె లన్ని
పరుసములు పల్కి నను గెల్వఁదరమె నీకు
విడువుమీ నోరి క్రొవ్వోరి! వృత్రవైరి! 6

చ. అని యనివార్యరోషమున నగ్నిశిఖాసఖ మాశిలీముఖం
బొనరఁగ వింటఁ బూన్చి భయదోర్జనగర్జన నిర్జరాధిపుణ్
జనుమఱ నాట నేయుటయుఁ జాపము కోపము వైచి తేరిపై
ఘనతరరక్తపూరములు గ్రక్కుచు స్రుక్కుచు వ్రాలెఁ గ్రక్కునన్.

క. ఆహరిహాయుపాటునకుణ్
హాహాకారంబు లెసఁగ నజ్జారిపయిన్
స్వాహాధిపాదిదిక్పతు
లాహావమునఁ గ్రమ్మి గురిసి రమ్ములవానల్. 65

గీ. వారి నందఱి మీఱి యవ్వారిజారి
వారిధర మభ్రవీథి నవ్వారి గాఁగ
వారిధారలు నిగిడించుదారి భూరి
భూరిపుంఖాస్త్రముల నించెఁ జేరిచేరి. 66

ఉ. ఆయెడ మూర్ఛ దేరి విబుధాధిపుఁ డాగ్రహదుర్నిరీక్ష్యుఁ డై
కో యని యార్చి పేర్చి శతకోటి కరంబునఁ బూని పూన్కి నేఁ
డాయజుఁ డిచ్చినట్టివర మైనను నాపని యైన నిల్చుఁ గా
కీయుడుభర్తశౌర్యము సహింతునె నే నని యేయ నెంచఁగన్. 67

గీ. శుక్రశమనాదిదిక్పతు ల్శక్రుఁ గూడి
శక్తిదండకృపాణపాశములు నీటె
గదయు శూలముఁ గొని నిశాకరునిఁ గిట్టి
దిట్టలై బెట్టుగా నరికట్టుకొనఁగ. 68

మ. ధరణీచక్రము దిర్దిరం దిరిగె దిగ్దంతు ల్చలించెన్ దివా
కరబింబంబు విహీనతేజ మగుచున్ గన్పించె ఘూర్ణిల్లె సా
గరముల్ సప్తకులాచలంబు లదరెం గంపించె నానాచరా
చరసందోహము లబ్జ పద్మభవుఁడున్ సంక్షోభితస్వాంతుఁ డై. 69

ఉ. జంభవిరోధిముఖ్యు లతిసాహసవృత్తి నిజాయుధంబులు
జృంభితలీల నిట్లు గొని చేరఁగఁ జంద్రుఁడు శుక్రుఁ జూచి సం
రంభము మీఱ మద్భుజపరాక్రమచాతురి చూడు మంచు సం
స్తంభనసామకాస్త్ర మురుచాపమునన్ దెగదీసి యేసినన్. 70

ఉ. ఎత్తినయాయుధంబు లవి యెత్తినక్రైవడి నుండ దేహముల్
మత్తిలినట్లు దిక్పతులు మ్రాన్పడి యొద్దియుఁ జేయఁజాలకన్

జిత్తరుబొమ్మలో యన విచేష్టత నొందినయత్తఱిం జరో
దృత్తిని జంద్రుఁ డార్చెను విదిక్కులు దిక్కులు పిక్కటిల్లఁగన్. 71
సీ. అంకురత్పులకజాలాంకితగాత్రుఁ డై,
భూషించె నలుమొగంబులను బ్రహ్మ
గెలిచెఁ జంద్రుఁ డటంచు జలధరగంభీర,
గరిమ ఘోషించెను గగనవాణి
హర్షసంభ్రమసంభృతాత్ముఁ డై చంద్రుని,
పేర్మి కౌఁగిటఁ జేర్చె భృగుసుతుండు
శంఖభేరీముఖస్వనములు విలసిల్ల,
వనజారి నుతియించె దనుజబలము
గీ. కుంచ సారించుకొనుచు నికుంచనావి
చిత్రగతులను జేతుల చెలఁగనాడె
సకురహంవీరుఁడే జీవు చంద్రుఁడే య
టంచు నారదమౌని ప్రియంబు పూని. 72
చ. అనిమిష రాజి యీగతి మహాజిఁ బరాజితవృత్తి నొందుటన్
గని గురుఁ డాత్మలోన భయకంపము లుప్పతిలంగ గ్రక్కునన్
దినకరుఁ జేరఁగా నరిగి దీనతఁ దద్వ్యథ మెల్లఁ దెల్పి మ
మ్మును గృపఁ గావవే యనుచు మ్రొక్కి యినుం డతిభక్తి నిట్లనున్
క. వెఱ పేటికి నేఁ గలుగఁగ
గురుఁ డగునీయాజ్ఞఁ బూని కువలయమిత్రున్
శరముల నైనను భీకర
కరములచే నైనఁ ద్రుంతుఁ గర మరుదారన్. 74
సీ. అని పల్కి జోడు లేనట్టిబండిని మీఱు,
తన తేరనూరుఁ డుద్ధతినిఁ దోల
సీతాంశుపైఁ దాఁకి శితసాయకము లేయ,
నాయమ్ము లతనియాయమ్ము లంటి
గాయమ్ము లొనరింపఁగా వెండియు నినుండు,
వాఁడిమయూఖము ల్వేఁడి మెఱయఁ
బఱపి యుద్ధతిఁ జరాచరజంతువుల నెల్లఁ,
జేఁగింజలరీతి వెట్లఁ జేయ

గీ. నలుక హిమరశ్మి నిజకిరణాళి నించి
యామహాతాప మణఁగింప నప్పు డుష్ణ
శీతసంయోగమున వ్యతీపాతసంజ్ఞ
పొడమె నొక్కెడ ముజ్జగంబులు వడంక. 75

క. ఈగతి గవిసిన నాతని
వేగమె యోగముల కెల్ల విభుఁడవు గమ్మా
బాగుగ నంచు విరించి ని
యోగించె జగత్త్రయీహితోచితమతి యై. 76

శా. ఈలీలన్ హిమధాముఁ డర్కుఁడును దా రెంతే వడిం బోరఁగా
నాలోనం గురుఁ డాత్మ నారసి జగత్ప్రాణు న్నిరీక్షించి వే
కైలాసంబున కేఁగి నీవు శశివార్త ల్సర్వం బంతయుం దెల్పి యా
నీలగ్రీవుని దోడితె మ్మతఁడు వీనిం గెల్చుఁ గయ్యంబునన్. 77

క. నా విని పవనుం డట్లన
గావించెద ననుచు మ్రొక్కి ఘనతరరంహో
ధావిత సకలకులాద్రి
త్క్ష్మావనికాభాగుఁ డగుచు చనిచని యెదుటన్. 78

సీ. గర్వధూర్వహపక్షికంధరబాహుకే,
యూరముద్రాంక మై మీఱుదాని
కలధౌతమయశృంగకాంతుల నేవేళ,
వెన్నెలల్ గాయుచు నున్నదాని
దంతావళాననదంతఘట్టనలచే,
వింతసంతన గాంచి వెలయుదాని
తతమహోన్నతలీల త్రైలోక్యలక్ష్మికి,
నిలువుటద్దమురీతిఁ జెలఁగుదాని

గీ. రుద్రకన్యామణీగీతవిద్రుతాశ్మ
సంతతామ్రేడితాంబునిర్ఝరసమూహ
రమ్యముక్తాకలాపవిరాజితోప
కంఠ మగుదాని రౌప్యనగంబుఁ గనియె. 79

మహాస్రగ్ధర.
కని యాశుగ్ వాహువామాంగకరుచివిలసత్కంధరాకాంతిధూర్వ

ఘనతర్షోత్కర్షరింఖత్కరసదనమృగగ్రాసవిత్రాసలోల
త్తనుభూషాభోగిభోగాతతమణికరణోదారవై భాతికశ్రీ
జనితోల్లాసానురంజత్సకలమునిదృగబ్జప్రకాశుఁ గిరిశున్. 80

గీ. కాంచి భృంగి నివేదితాగమనుఁడగుచు
ననిలుఁడు తదాజ్ఞ నేఁగి సాష్టాంగ మెఱఁగి
చేరి యందంద వినుతించి నీరజారి
యనుచితాచార మెఱిఁగించి యభవుతోడ. 81

క. అమరుల కతనికిఁ గలిగిన
సమయము వివరించి దేవ! చనుదెంచి సురో
త్తములం బ్రోవుము దయ లో
కములకుఁ గర్త వగు నీవు గావఁగ వలదే. 82

చ. అన విని యింత దుర్జనుఁడె హా హరిణాంకుఁడు వీని దక్షునిం
దుని మెడునాఁడు పాదమునఁ ద్రోచితిఁ గాని వధింపనైతి నేఁ
డని మొనలోన వానిఁ దెగటార్చెదఁ దీర్చెద మీకు బన్నముల్
నను శరణంబుఁ జొచ్చినజనంబు మనంబున నొవ్వఁ జూతునే. 83

మ. అని రోషాగ్నికణంబు లుప్పతిలఁగా నాదేవదేవుండు ది
గ్గనఁ దా లేచి మృదూక్తి నంతిపురికిం గాత్యాయనీకాంతఁ బం
చి నగోదగ్రకకుద్మనముజ్జ్వలరుచిం జెన్నొందు మి న్నందునం
దిని వేగంబున నెక్కి తూర్యరవము దిక్చక్రము ల్నిండఁగాన్. 84

క. ఆనిటలాక్షుఁడు శూలము
ఖానేకమహాయుధంబు లరిభయదము లై
కానఁబడ నపుడు ప్రమథగ
ణానీకినితోడ నడిచె నబ్జునిమీఁదన్. 85

ఉ. అంబరవీథి భూతనివహంబులతోఁ జనుదెంచి మించి యా
శంబరవైరివైరి రభసంబున నంబుజబాంధవుండు న
య్యంబుజవైరియుం బెనఁగ నడ్డము సొచ్చి యదల్చి వజ్రతీ
క్ష్ణాంబకకోటి నాటె హరిణాంకునిపై గురుఁ దుబ్బి యార్వఁగన్. 86

మ. ప్రమథుల్ ఘోరతరాట్టహాసములచే బ్రహ్మాండ మూటాడ శూ
లముసుంతీశరశక్తికుంతకరవాలప్రాసచక్రాదిశ

స్త్రమయాసారము నింపఁ జంద్రుఁడు వడిన్ సర్వాస్త్రసంహారకా
స్త్రము చేత న్వివిధాయుధోత్కరము చూర్ణంబై చనం జేయుచున్.

క. వారలఁ దఱుమఁగ గజముఖ
భైరవశక్తిధరవీరభద్రులు చంద్రున్
బారావారచతుష్కము
మేరువు చుట్టుకొనురీతి మెఱయం బొదువన్. 88

గీ. నాతికై పోరునానలినారి నారి
వింట సారించి యుద్ధతి మీఱ వారి
కందఱకు నన్ని రూపులై యని యొనర్చె
చాపవిద్యావిలాసంబు జగము పొగడ. 89

ఉ. లావున నార్చుచున్ గలుఁగులాయపు తేజివజీరుఁ డంకుశం
బావనజారిపైఁ బఱప నాతఁడు దాన నె యయ్యిభాననున్
జేవడిఁ గుంభమధ్యమున జీరిన మౌక్తికపాళి రాలెఁ దా
రావళి తామణీకుచభరంబున కౌ నని చంద్రుఁ డెన్నఁగన్. 90

లయగ్రాహి.
దారుణజగత్ప్రళయవారిదచయస్తనిత,
భైరవధమంధమఘునారవమహోధ
క్కారవుఁడు భైరవుఁడు మీఱి బహుభూతపరి,
వారములు నల్దెసల పేరములు వారన్
ఘోర మగుశూల మొగి నారజనివల్లభుని,
పై రవళి వైవ నతఁ డౌర యనుచుం దు
ర్వారగురుదివ్యశరవాలములఁ జూర్ణముగ,
ధారుణిఁ బడం గెడపెఁ జేరువన దానిన్. 91

ఉ. ఆసమయంబునం గుహుఁ డహంకృతితోఁ దనచేతిశక్తిచే
నేసి నభంబు ఘూర్ణిలఁగ నిత్తిగమోముల నార్వ నబ్జుఁ డ
బ్జాసనదత్తశక్తిని రయంబున వైవ మహోల్కలో యనం
గా సరిఁ బోరి యయ్యుభయశక్తు లశక్తులరీతిఁ గ్రమ్మఱన్. 92

స్రగ్ధర. రౌద్రావేశంబు మీఱం బ్రబలభుజబలప్రౌఢిమన్ వీరభద్రుం
డద్రు ల్గంపింప లోకం బవియఁగఁ బ్రళయాభ్రార్భటిం బట్టసం బ

తన్మదోద్రేకస్ఫూర్తిచే నయ్యుడుపతిపయి బెట్టూన్చి వేవైచె వైవశ
గద్రూపుత్రాభకాండోత్కరమున శశి శీఘ్రస్థితిం ద్రుంచె దానిన్. 93

క. తనయులు ప్రముఖులు నీగతి
యనిఁ జంద్రునిచేత నొచ్చు టభవుం డచ్చోఁ
గనుఁగొని ఘనసారద్యుతి
ఘనసారవృషంబు నతనిఁ గదియం దోలెన్. 94

క. వచ్చునిటలాక్షుఁ గనుఁగొని
చిచ్చుఅపిడుగులను బోనిశితవిశిఖంబు
ల్విచ్చలవిడిఁ గురియించుచు
నచ్చెందొవవిందు నిలువ నభవుఁడు నగుచున్. 95

గీ. అత్రినందన! నీదె గార్హస్థ్య మెన్న
గురువునకు బొమ్మవెట్టి చేకొంటి కీర్తి
యిట్టిసుతుఁ డొక్కరుఁడె చాలు నింటి కెల్ల
రాజ వీ వైనఁ గొద వేమి రాష్ట్రమునకు. 96

క. నినుఁ జేపట్టి వరం బిటు
లనువుగ నిచ్చినవిధాత ననవలెఁ గాక
న్నిను దూఱం బని గలదే
వినరా నీగర్వ మెల్ల విడిపింతు ననిన్. 97

క. నీమేనల్లుఁడు గావున
కాముఁడు నీకరణి దుండగము చేసి కదా
మామకఫాలాగ్నిశిఖా
స్తోమాహుతి యయ్యె వాసిత్రోవయె నీకున్. 98

ఉ. నా విని చంద్రుఁ డిట్లనియె నవ్వుచు మీ రిటు లాడ నుత్తరం
బీనలె మీకలెం దిరుగ నేరికి నాను జితేంద్రియస్థితిన్
భావజు గెల్చినాఁడ నని పల్కితి వంతటివాఁడ నయ్యుమా
దేవికిఁ దక్కి మోహమున దేహములో సగ మియ్యఁ జూతురే. 99

గీ. అవని మర్యాద దప్పనియతనిపత్ని
యనక మఱి మోహ మెసఁగంగ నభ్రగంగ
వెడలనీక మహాజటావిపినమునను
మాట లేదొ ధరిత్రి నీమాట లేదొ. 100

క. దారువనమౌనికాంతా
జారుఁడ వగునీకు నొరులచక్కటు లేలా
మారాడక యనిఁ బోరుము
పౌరుష మొకకొంత యైనఁ బనుపడి యున్నన్. 101

క. అని పలికి గాండివము చే
కొని భువనత్రయము నతలకుతలముగా శిం
జిని మ్రోయఁజేసి స్థాణున్
నిను శరపరశువుల నోర్తు నిలునిలు మనుచున్. 102

సీ. ఆగ్నేయశర మేయ నది యగ్నిలోచను,
ఫాలాగ్నిలో నైక్యభావ మొందె
యహిసాయకం బేయ నది నాగభూషణు,
భూషణంబులతోడఁ బొం దొనర్చె
నంబుదాంబక మేయ నది జాహ్నవీధరు,
తలయేటి కభివృద్ధి గలుగఁ జేసె
నద్రిబాణం బేయ నది గిరిజేశుఁ డా,
వంకకు పుట్టినిల్వరుసఁ జేసె
గీ. విధుఁడు గ్రక్కున పైశాచవిశిఖ మేయ
నదియు భూతేశుభూతాళి ననుసరించె
మఱియు శశి వైచునిఖిలాస్త్రమండలంబు
నఖిలమయుఁ డైనశంకరునందు డించె. 108

చ. అజగవకార్ముకంబుఁ గొని యంతఁ బురాంతకుఁ డుగ్రమార్గణ
వ్రజము లపారసంఖ్యలుగ వారిరుహారిశరీరయష్టి న
క్షజముగ నేయ నాతఁ డధికవ్యథఁ జెంది సుధాంశుఁ డొటచే
నజునివరంబుచే నిలిచె నాజిని బ్రాణముతోడ ధీరుఁ డై. 104

ఉ. కంజవిరోధి యంత నలుకం జలియింపక చాపశింజినీ
సంజనితారవంబున వెస న్జగము ల్బెగడం బురత్రయీ
భంజనుగాత్ర మంతయుఁ బ్రభంజనతీవ్రశరాళి నించెఁ గి
న్కం జలజారిఁ ద్రుంచెద నిఁకం జయ మందెద నంచు నుగ్రుఁడై. 105

క. పశుపతి పాశుపతాస్త్రము
శశి లక్ష్యముఁ జేసి వింట సంధించిన బ్ర

ష్మాశిరోనామక మగుడి
వ్యశరము ఘాతకును మ్రొక్కి యాశశి దొడఁగెన్. 106
శా. ఆదివ్యాస్త్రమహాగ్ని కీలములచే నంభోనిధుల్ గ్రాగె బ
ల్భ్యాదై హేమమహీధరంబు గఱఁగెన్ భూతౌఘముల్ మ్రొగ్గెసెది
గ్స్వేదండంబులతో ధరిత్రి యొరిగెన్ వేధోండ మూటాడె మ
ర్యాద ల్దప్పెను తారకాగ్రహగణం బవ్వేళ భీతాత్ములై. 107
క. సప్తర్షి ముఖ్యు లతిసం
తప్తాత్మత నోర్వలేక ఘాతం గని యీ
దీప్తాస్త్రవహ్ని ప్రశయము
ప్రాప్తం బైనట్లు దోఁచె భయ ముడుపఁగదే. 108
గీ. ఎంత లే దని క్షణ ముపేక్షింతు వేని
మగుడ సృజియింపవలయు నీజగము నెల్ల
మాకుఁ గా వీరికయ్యంబు మాన్చి తార
నమరగురునకు నిప్పింప వయ్య ! నీవు. 109
చ. అన విని పల్కుకల్కి మగఁ డంత దయారసపూర మూరఁ బం
తున నునుపైడితమ్మివిరితూఁడులఖాణపుఁదేజి నెక్కి స
న్మునిగణము ల్భజింప నలుమోముల నవ్వు జనింప వచ్చె న
వ్వనరుహవైరియున్ ద్రిపురవైరియుఁబోరుచు నుండుచోటికిన్. 110
గీ. వచ్చి నిజవాహనము డిగ్గి వనజభవుఁడు
భవుఁడు దను జూడ వలగొని భక్తిమీఱ
మీఱ లీరీతిఁ జలమునఁ బోరఁ దగవె
తగవె మము కావ నని చాలఁ బొగడఁ దొడఁగె. 111
సీ. జయజయ శతకోటిశతకోటిసమకోల !,
జయ భానుభానులసజ్జటాల !
జయజయ సుగుణోపచయచయనారాధ్య !,
జయ నీలనీలభాస్వరశిరోధి !
జయజయ భవభవసాగరతారక !,
జయ తారతారకాసదృశవర్ణ !
జయజయ శివ! శివాస్పదవామతనుభాగ !,
జయ సర్గదక్షదక్షమఖవైరి !

గీ. జయ మహాదేవ ! దేవతాజయదభావ !
జయ దయాకర ! కరరాజజయతురంగ !
జయ జితాసుర ! విరచితసాధుసౌఖ్య !
జయ గిరీశ గిరిశవేశ్మప్రశస్త !. 112

క. ఉపనిషదుక్తిశతంబులు
ప్రపంచభర్త వగుని న్నె ప్రతిపాదించుఁ
జప హోమాధ్యయనవ్రత
తపములకు న్ఫలము నీవ ధార్మికభావా!. 113

చ. అని చతురాననుండు చతురాస్యముల న్నుతియించి యిట్లనుఁ
గనకగిరీంద్రచాప ! విను కయ్యములో నెదిరించి పీఁకచే
ననిమిషకోటి గెల్చుట మహాతిశయం బని యీశ ! యీశశాం
కునిఁ గరుణించి నీశరము కోపము నీ వుపసంహరింపవే. 114

గీ. అనువిరించిమృదూక్తుల నాదరించి
శంకరుఁడు పాశుపత ముపసంహరించి
నిలుచునంత విధుండు వాణీనియంత
పంచినశరమ్ము డించె జాలించె దురము. 115

క. అజునకు నటుమును జితకా
యజునకు శశి మ్రొక్కి నిలువ న త్తఱి యనురా
గజముదమున రా రమ్మని
గజముఖజనకుండు విధుని గౌఁగిటఁ జేర్చెన్. 116

గీ. శంకరుండును పంకజాసనుఁడు కరుణ
జంభరిపుముఖ్యసురభుజాస్తంభనముల
మాన్ప వారలు నాజగన్మాన్యులకును
మ్రొక్కి నుతియించి నిలిచిరి మ్రోల నపుడు. 117

మ. అరవిందాసనుఁ డప్పు డిట్లనియె చంద్రా ! యీచలం బేటికిన్
మరలం దార నొసంగుమీ గురునకున్ మాయాజ్ఞచే నీ వనన్
పరమేష్ఠిం గని పల్కు దేవ ! విను నాపంతంబు దిక్పాలకు
ల్కరము ల్లట్టక క్రమ్మఱన్ విడువ నీకాంతం గురుం జేరఁగన్. 118

గీ. రాజ ! నీచేతఁ జేయింతు రాజసూయ
మప్పు డమరులు నీ కిత్తు రప్పనములు

నిప్పు డిత్తన్వి గురునకు నొప్పగింపు
మేను వంచినపని చేయు టెగ్గు గాదు. 119

చ. అని పరమేష్ఠి పల్కుటయు నట్లన కా కని చంద్రుఁ డయ్యెడన్
ఘనతరగర్భభార నఖకాంతివినిర్జితతారతారఁ దా
ననునయసూక్తులం దెలిపి యంపినతోడనె దివ్యతూర్యని
స్వనములు మ్రోసె మింట విరివానలు పర్వెను జంటజంటగన్. 120

సీ. ఉడుపతిసంగతి నెడపి తాఁ జనలేని,
వడువున నడలందు జడను దోఁప
గురుతుగా రేరాజు విరహార్తిచేబలె,
పాండిమ చెక్కుల మెండుకొనఁగ
మది నున్నవనజారి యెదకప్పు పైకి వె,
ల్వడె నాఁగఁ జన్మొన ల్నల్పు మీఱ
రిక్కరాయనిబాయ దొక్కట గల్గిన,
ట్లొక్కట మైకార్శ్య మ్ముప్పతిల్ల

గీ. మనసు చంద్రునికడ నుంచి మ్రానుపడిన
తనువుతో గర్భగౌరవతాంత యగుచు
చిన్నవోయిన మోమున సిగ్గు దోఁప
నాంగిరసుచెంతకును జేరె నపుడు తార. 121

చ. అమరులతోడ నప్పు డని రబ్జభవుండు భవుండు సద్గురుం
బ్రమదము మీఱఁగాఁ బిలిచి మావచనంబునఁ దారఁ జెందు మీ
రమణి కళుద్ధి లే దమృతరశ్మిని బొందుటచేత దాన నీ
కోమ పరిశుద్ధిఁ గాంచెఁ గయికొమ్మనఁ గొమ్మ గురుండు చేకొనెన్.

ఆ. రాజరాజసఖుఁడు రాజీవభవుఁడును
చంద్రు నింద్రు సురలసదనములకుఁ
బంచి గిబ్బతేజినంచకంఖాణంబు
నెక్కి చనిరి విభవ మెసఁగ నపుడు. 123

క. మృతసంజీవని సంజీ
తు లగునసురులును దాను విధుశివసమరో
ద్ధతి చెప్పికొనుచు శుక్రుఁడు
నతిహర్షము మీఱ నరిగె నంత యథేచ్ఛన్. 124

గీ. నవమమాసంబునం దొక్కనాఁడు శుభము
హూర్తమునఁ గాంచె తారామహేంద్రలాక్షి
బుధుని సుజ్ఞాని మోదితబుధుని రూప
విధుని సద్భక్తిపూజితవిధుని నంత. 125

ఉ. తత్సమయంబునన్ శశి ముదంబున నచ్చటి కేఁగుదెంచి పు
త్రోత్సవ మాచరింప విని యుద్ధతితో గురుఁ డిందుఁ జూచి య
స్మత్సుతుఁ డీబుధుం డిట నిశాకర రాఁ గత మేమి నీ కనన్
మత్సరబుద్ధి వారికిఁ బునఃకలహంబు జనించె నయ్యెడన్. 126

క. అజుఁ డరుగుదెంచి గురునిన్
రజనీకరుఁ గాంచి యిట్టిరచ్చలు గలవే
గజిబిజి వల దని తారా
గజయానం జేరఁబోయి గ్రక్కునఁ బలికెన్. 127

క. గురునకొ గర్భంబు నిశా
కరునకొ వివరింపు రిత్త కలహము వల ది
త్తఱి మరల నావు డాబి
త్తరి తామరచూలి కనియెఁ దద్దయు లజ్జన్. 128

గీ. స్రష్ట వగునీవెఱుంగవె సకలభూత
సంభవము మేలె నన్ను రచ్చలకు నీడ్వ
హరిహరీ! దాఁచ నేల తారాధిపతికి
సుతుఁడు వీఁ డని వివరించె సూక్ష్మఫణితి 129

క. నా విని యజుఁ డోహోహో
మీవాదము చాలు కుముదమిత్రునిపుత్త్రుం
డీవత్స మితనిఁ జంద్రుని
కీ విమ్మా వలదు విరస మిఁక నాంగిరసా!. 130

చ. అని గురుచేత నబ్బుధుని నత్రితనూజుని కియ్యఁ జేసి నీ
తనయుఁడు వీఁడు సద్గ్రహపదప్రభుతన్ విలసిల్లు మీఁద నీ
వనువున రాజసూయము రయంబునఁ జేయుము నీకు దిక్పతుల్
ఘనయశ మొప్పఁ గప్పములు గట్టెద రంచు విరించి యేఁగినన్. 131

ఉ. ఆనలినారియున్ సుతసమన్వితుఁ డై గజవాజిముఖ్యసే
నానివహంబు గొల్వఁగ జనంబులు సన్నుతి సేయఁగాఁ బ్రతి

స్థానపురంబుఁ జేరి యచటన్ బలభిన్నిభవైభవంబుతో
నానతవైరియై సుకృతియై క్షితి రాజ్యము సేయుచుండఁగన్. 132

ఉ. దక్షుఁడు చంద్రురూపబలదక్షత లారసి సంతసంబునన్
లక్షణభాగ్యయౌవనవిలాసకళావిభవంబులన్ సహ
స్రాక్షవధూసమాన లగు నాత్మతనూజుల నిర్వదేడ్వురన్
బక్షము మీఱ నీతనికి భార్యలఁ జేసెద నంచు వచ్చినన్. 133

గీ. తారకాధ్యక్షుఁ డప్పు డాదక్షు భక్తిఁ
బూజ గావించి నేఁడు మత్పుణ్యఫలము
కరణి వచ్చితి నేఁ జేయు కర్జ మెద్ది
నావు డిట్లను బరమేష్ఠినందనుండు. 134

క. అశ్విని మొదలగుకన్యల
నశ్విమనోభవస్వరూపుఁ డగు నీ కిత్తున్
శాశ్వతముగ వర్ధిలు మమి
త్రైశ్వర్యము గలిగి చంద్ర! యరిజయసాంద్రా!. 135

చ. అని శుభలగ్నమందుఁ గమలాసనుఁ డత్రియు సమ్మతింపఁగాఁ
దనయల నిర్వదేడ్వురను దక్షుఁడు వేడుక దారవోసెన
త్యనుపమవైఖరిన్ గువలయాప్తునకున్ దివి దేవదుందుభి
స్వనము లెసంగ దివ్యసుమవర్షము లెల్లెడలన్ జెలంగఁగన్. 136

గీ. ఎలమి సుముహూర్తమునఁ దెర యెత్తునంత
ప్రేమ మది మీఱఁగాఁ జందమామచెలుల
కెంపుమోవుల సుధను గ్రుక్కిళ్లు మ్రింగ
క్షితిఁ గలిగెఁ జందమామ గ్రుక్కిళ్లు నాఁడు. 137

క. కళలఁ దగునిర్వదేడ్వుర
గళముల శశి మంత్రపూర్వకముగా మణిమం
గళసూత్రంబులుగట్టెన్
కలకంఠులు చేరి గౌరికళ్యాణ మనన్. 138

గీ. చెలఁగి యిక రాజసూయంబు సేయువేళ
తదభిషేకంబునను వారిధార లిట్లు
దొరఁగు నన్నట్లు ముత్తెముల్ దోయిలించి
సతులు దలఁబ్రాలు బోసి రాచంద్రుమీఁద. 139

క. సత్పద్మానన లపుడు ల
సత్ప్రాణుల లాజ లియ్య నవధూమము నీ
లోత్పలమాలిక లన మై
నుత్పలమిత్రుండు లాజహోమ మొనర్చెన్. 140
క. పాలయల్క వేళ నే నిటు
వలె మీపాదంబు లంటవలె నన్నటు కాం
తలయడుగు లెత్తి చేతుల
మెలఁకువ శశి సన్నెకల్లు మెట్టించె నటన్. 141
గీ. సూక్ష్మముగ నభశ్రీమున నున్నఁ జూడవలయు
నయ్యరుంధతి తనపెండ్లి కరుగుదెంచి
యునికి సులభంబుగాఁ జూచె నుత్పలాప్తుఁ
డంగనలు దాను జనులు భాగ్యం బనంగ. 142
క. పేరులు చెప్పు మటన్నం
దారాహ్వయ లనెడుశశిని దత్సఖు లెల్లన్
జేరి యితం డింకన్ మదిఁ
దారను మరువఁ డని నగిరి తద్దయు నచటన్. 143
ఆ. నాగవల్లిదాఁక నాలుగుదినము లీ
రీతిఁ బెండ్లివైభవాతిశయముఁ
గాంచి చంద్రు దత్తు కడు వేడ్క వీడ్కొని
చనిరి కమలజాదిసకలసురలు. 144
సీ. అరదముల్ ద్విరదముల్ హరులు గ్రామంబులు,
భద్రపీఠంబులు పల్లకీలు
నాందోళికలును చిత్రాంబరంబులు మణి,
పాదుక లున్నరటులు పట్టుదిండ్లు
సకినెలపాన్పులు జవ్వాజిపిల్లులు,
కస్తూరిమెకములు కప్పురంపుఁ
బన్నీటిచెంబులు బంగరుతంబుర,
లసకలభూషణములు సర్వములును
గీ. దాసదాసీజనంబులు తక్కు గల్గు
వస్తువు లుపత్రికలకును వరుసతోడ

నరణముగ నిచ్చి సుఖ ముండుఁ డనుచు దక్షుఁ
డబ్జు వీడ్కొని భార్యతో నరిగె నపుడు. 145

గీ. అసమవైఖరి నిట్లు పెండ్లాడి చంద్రుఁ
డసమశరకేళి దక్షుకన్యకలఁ గూడి
భూరితరసౌఖ్యజలరాశి పొంగఁ జేసి
శ్రీలు మెఱయంగ వసుమతి నేలుచుండి. 146

మ. ఒకనాఁ డాయుడువల్లభుండు మదిలో నుత్సాహ మిం పొందఁగా
సకలద్వీపకలాపభూమితతులన్ శక్రాదిదిక్పాలురన్
బ్రకటప్రౌఢిని గెల్చి కీర్తిరుచు లొప్పన్ గప్పము ల్గొంచి య
త్యకలంకస్థితి రాజసూయ మనువొందన్ జేయఁగా నెంచుచున్.147

చ. అతిరయ మొప్ప నబ్జుఁడు శతాంగము నెక్కి సమస్తసైన్యసం
తతి తనవెంట నంటి జలదధ్వని భీషణభేరికార్భటుల్
క్షితియు దివంబు బూరటిల గెల్చె మదోద్ధతమేదినీశులన్
ధృతి మెఱయం బ్రతీచ్యుల నుదీచ్యులఁ బ్రాచ్యుల దాక్షిణాత్యులన్.

క. జంబూప్లక్షకుశక్రౌం
చంబులు శాల్మలియు మఱియు శాకద్వీపం
బుం బుష్కరాహ్వయద్వీ
పంబును నొకనాఁడె శీతభానుఁడు గెల్చెన్. 149

చ. పదపడి చంద్రుఁ డయ్యమరపాలుపురంబున కేఁగ నింద్రుఁ డిం
పొదవఁగ నబ్జుఁ గాంచి కమలోద్భవుమాట దలంచి యిచ్చె స
న్మదగజవాజిరత్నలలనామణిభూషణకోటు లాగతిం
ద్రిదశులు తక్కుదిక్పతు లనేకధనంబు లొసంగి రొక్కటన్. 150

మ. రజనీవల్లభుఁ డిట్లుసర్గళమహారంహశ్చమూధాటి ది
గ్విజయం బొప్పఁగఁ జేసి నాల్గుదెసలన్ వేలాదిశృంగంబులం
దు జయస్తంభము లూఁది చారణగణస్తోత్రంబు లాలించుచున్
ద్రిజగంబు ల్వినుతింప వచ్చెఁ బురికిన్ దేవేంద్రుచందంబునన్. 151

ఉ. వేలుపుఁబెద్దయానతిని విష్ణునదీతటమందుఁ జాల సు
శ్రీలవిశాలలీల మణిచిత్రిత మై తగుయాగశాల నా
వేళ రచింపఁ బంపె నతివిశ్రుతనీలవిరాజిరాజివా
చాలము నింద్రజాల మతిసంతస మై విలసిల్ల శిల్పకున్. 152

క. కువలయమిత్రుం డంతట
సువిహితనయసరణి రాజసూయము సేయన్
నవనీతవీక్షఁ గైకొని
ప్రవిశన మొనరించె శాలఁ బత్నులుఁ దానున్. 153
సీ. జనమోదనంబులు శాల్యోదనంబులు,
సురుచిరరూపము లూపములును
పటుసౌరభాన్వితపాకము ల్శాకము,
లతులితరసములు నతిరసములు
హితవాసనాసమన్వితములు ఘృతములు,
జితమనుసారము ల్క్షీరములును
సమధికరుచివిలాసములు పాయసములు,
నధరీకృతామృతోదధులు దధులు
గీ. చవులు పొగడుచు పఙ్క్తులు సాగి వేడ్క
వెలయ భుజియించి కపురంపువిడియములను
జేకొని యహర్నిశంబు నాశీర్వదింతు
రవనిసురు లబ్జు రాజసూయాధ్వరమున. 154
ఉ. అత్రివసిష్ఠదక్షపులహాంగిరు లాదిమహామునీంద్రు లా
ద్గాత్రము హౌత్ర మాధ్వరము దక్కను గల్గినయాగకర్మము
లూనత్రవిధానవైఖరిని జొప్పడఁ జేయఁగ నక్కుముద్వతీ
మిత్రుఁడు రాజసూయమును మేలుగఁ జేసె విరించి మెచ్చఁగన్. 155
చ. అనలుఁడు నమ్మహాధ్వరమునందుఁ జెలంగి ప్రదక్షిణార్చియై
యనుపమమంత్రపూతములునాహుతు లంది యథాక్రమంబుగా
ననిమిషకోటి కియ్య నతిహర్షమునం గొని తృప్తి నొంది దీ
వెన లొనరించి రివ్విధుని వేయువిధంబుల సన్నుతించుచున్. 156
క. స్తుత్యాహంబున మునిసం
స్తుత్యముగా నిచ్చె ఋత్విజులకు శశాంకుం
డత్యనుపమదానకళా
నిత్యుం డై సకలధారుణీమండలమున్. 157
ఉ. ఘోటకము ల్రథంబులును గుంజరము ల్నిబికాసమూహము
ల్హాటకము ల్ధనౌఘములు నంబరము ల్మణిభూషణంబులున్

సాటి యొకింత లేకయె ప్రసర్పకదక్షిణ నిచ్చె దేవతా
కోటులు సన్నుతింప శశి కోటులసంఖ్యలుగా మఖంబునన్. 158

ఆ. సుప్రయోగమునను విప్రగణంబుతో
నాప్రయోగమునను యాగ మట్లు
చేసి యవభృథంబు జేసి పత్నులు దాను
నమృతకరుఁడు నిష్ఠ నమరవదిని. 159

క. ఆరాజు రాజసూయం
బీరీతి నొనర్చి యెంత నెంతయు నిష్ఠన్
వారిజభవ నారాయణ
గౌరీశులఁ గూర్చి తపముఁ గావించి తగన్. 160

క. ఆతపమునకుఁ జలింపక
నాతప మిట్లాచరింప నతని కజముఖరా
రాతి మహేశాను లతి
ప్రీతిం బొడఁగట్టి రమరబృందము గొల్వన్. 161

ఉ. రాజమనోజ్ఞ తేజ ద్విజరాజపు గమ్మని బ్రహ్మఁ బూన్చె స
త్పూజితలీల సద్గ్రహవిభుత్వమునన్ విలసిల్లు మంచు నం
భోజవిలోచనుం డునిచె మోదముతో ధరియించె నాదలన్
రాజకిరీటసంజ్ఞ తగ నాగవిభూషణుఁ డానిశాకరున్. 162

క. హరిణాంకుం డీకరణి
న్వరములు గైకొని మగ్రవైభవ మెసఁగన్
బురమునకు వచ్చి నీతి
స్ఫురణతె జను లెన్న నిఖిల భువనము లేలెన్. 263

సీ. సమయంబు దప్పక జలదము ల్వర్షించె,
హర్షించె మిగుల బ్రాహ్మణకులంబు
ధరణి ముక్కారును దరగనిగతిఁ బండె,
నిండె యాగక్రియ ల్నిఖిలదిశల
ధర్మంబు నాల్గుపాదంబులఁ గన నయ్యె,
విన నయ్యె నూరూర వేదరవము
క్రేపులు తమయంత క్షీరము ల్గురిసెను,
విరిసెను చోరాగ్ని వృజినభయము

గీ. సోముఁ డసమానసద్గుణస్తోముఁ డమృత
ధాముఁ డతులితవిజయాభిరాముఁ డఖిల
తారకాసార్వభౌముఁ డుదారనీతి
నంచితంబుగ ధరణిఁ బాలించునపుడు. 164

క. ఆచందంబున నెల్లపు
డాచందురుఁ డేలుచుండు నవనీరాజ్యం
బీచంద్రు చరిత్రము విను
ధీచతురులకుఁ శుభంబు తేజము గల్గున్. 165

గీ. ఆయురారోగ్యకరము జయాస్పదంబు
పుత్రపౌత్రప్రదం బతిపుణ్యదాయ
కం బఖండమహీలాభకారణంబు
విను జనంబులకు శశాంకవిజయ మనిన. 166

వ. అనుటయు. 167

ఆశ్వాసాంతము.

ఉ. మంత్రియుగంధరాకృతివిమానితమంధర! దానకంధరా!
తంత్రవిదగ్రణీ! విమతదంతిభిదాస్పృణిసూక్తిధోరణీ!
మంత్రవిభేదనా! కుముదమంజుయశోధన! బోధబోధనా!
సంతసుపోషణా! జనమనఃప్రియభాషణ! వంశభూషణా!. 168

క. శూరవరవారసన్నుత
తారకభూభృజ్జిగీషుతతకీర్తిధనా!
నారదతతవిహితసుధీ
భూరిరణార్దితవిపక్ష! పుషితకవిజనా!. 169

తోటకము.

రాజమానమానరాజరాజరాజసన్ముఖాం
భోజభోజరాజనైజబోధబోధనస్తుతి
త్మాజనాభిరామరామచంద్రకల్పకల్పవి
భ్రాజికీర్తిభూషితాంగవంగవంగలాన్వయా. 172

గద్య. ఇది శ్రీజానకీరామచంద్రచరణారవిందవందనకందళితానందకందాళ రామానుజగురుచరణసేవాసమాసాదితసాహితీవైభవశేషముకృష్ణ యార్యతనూభవసుకవిజనవిధేయ వేంకటపతినామధేయప్రణీతంబైన శశాంకవిజయం బనుమహాప్రబంధమునందు సర్వంబును బంచమాశ్వాసము.

శశాంకవిజయము సంపూర్ణము.



# ఆంధ్రగ్రంథములు.

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| ఆంధ్రభారతవిమర్శనము, మల్లాదిసూర్యనారాయణశాస్త్రిగారిది | ... | 0 | 8 |
| శకుంతలాపరిణయము, కృష్ణకవికృతము | ... | 0 | 12 |
| తెనుఁగుసమస్యలు, చక్కనికూర్పు | ... | 0 | 2 |
| భాస్కరరామాయణము, చక్కనికూర్పు, అత్యుత్తమప్రతి | ... | 4 | 0 |
| కృష్ణరాయవిజయము, కుమార ధూర్జటికృతము | ... | 0 | 8 |
| లంకావిజయము (రావణదమ్మీయము), సటీక | ... | 1 | 4 |
| నిర్వచనోత్తర రామాయణము, సాధారణప్రతి | ... | 0 | 12 |
| ఉత్తరరామాయణము, కంకంటి పాపరాజప్రణీతము | ... | 2 | 0 |
| రంగనాథరామాయణము, ద్విపద, చక్కనికూర్పు | ... | 3 | 8 |
| గోపీనాథరామాయణము, 2 సంపుటములు శ్రీమద్రామాయణమునకు సరియైన పద్యము, కవనము మిక్కిలిసొంపు, పీఠిక అతివిపులము | | 7 | 8 |
| మొల్లరామాయణము, చిన్నసైజున పెద్దక్షరములతో చక్కగముద్రితము | | 0 | 10 |
| అచ్చతెనుఁగురామాయణము, శుద్ధప్రతి | ... | 1 | 4 |
| ఆంధ్రభాగవతము, పోతనామాత్యప్రణీతము, ఇదివఱకు ముద్రితమైనప్రతులకన్న అన్నివిధముల బాగుగ నున్నది | ... | 6 | 0 |
| డిటో అత్యుత్తమప్రతి 2 వాల్యములు | ... | 8 | 0 |
| మార్కండేయపురాణము, మారనకృతము | ... | 1 | 12 |
| మనుచరిత్ర, సటీక, వావిళ్ల. రామస్వామిశాస్త్రిగారి వ్యాఖ్యానముతో చిన్నసైజున మేలుకాగితముల మీఁద స్ఫుటమైన అక్షరములతో చక్కగ ముద్రించియున్నాము. | ... | 2 | 0 |
| వసుచరిత్రవిమర్శనము, శ్రీ చినసీతారామస్వామిశాస్త్రికృతము, అత్యద్భుతములగు క్రొత్తవిషయము లనేకములిందుగలవు | ... | 1 | 0 |
| వసుచరిత్ర, సవ్యాఖ్యానము, చక్కనికూర్పు, నూతనముద్రితము | ... | 4 | 8 |
| ఆముక్తమాల్యద, వావిళ్ల. రామస్వామిశాస్త్రిగారివ్యాఖ్యానముతో మేలుకాగితములమీఁద చక్కఁగ మరల ముద్రించియున్నారము | ... | 3 | 8 |
| ప్రభావతీప్రద్యుమ్నము, క్రొత్తకూర్పు | ... | 0 | 10 |
| హరిశ్చంద్రనలోపాఖ్యానము, సటీక, పీఠిక విపులము | ... | 2 | 8 |
| కళాపూర్ణోదయము, దళసరికాగితములు | ... | 2 | 4 |
| రాఘవపాండవీయము, సటీక, చక్కనికూర్పు | ... | 2 | 4 |
| శృంగారనైషధము, శ్రీనాథకవిది, క్రొత్తకూర్పు | ... | 1 | 0 |
| హరవిలాసము ,, | ... | 0 | 12 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| కాశీఖండము, చక్కనిక్రొత్తకూర్పు | ... | 1 | 8 |
| సారంగధరచరిత్రము, చేమకూర. వేంకటకవికృతము | ... | 0 | 10 |
| కవికర్ణరసాయనము, మాంధాతచరిత్ర | ... | 1 | 8 |
| నరసభూపాలీయము, అట్టబైండు | ... | 0 | 10 |
| విజయవిలాసము, చేమకూర వేంకటకవి | ... | 0 | 8 |
| రంగారాయచరిత్ర, దిట్టకవి. నారాయణకవిప్రణీతము | ... | 0 | 8 |
| నిరంకుశోపాఖ్యానము, రుద్రకవికృతము | ... | 0 | 6 |
| నీలాసుందరీపరిణయము, కూచిమంచి తిమ్మకవికృతము | ... | 0 | 4 |
| పారిజాతాపహరణము, మేలుప్రతి | ... | 0 | 8 |
| హరిశ్చంద్రోపాఖ్యానము, శంకరకవిప్రణీతము | ... | 0 | 12 |
| అనిరుద్ధచరిత్ర, కనుపర్తి. అబ్బయామాత్యప్రణీతము | ... | 0 | 8 |
| విక్రమార్కచరిత్ర, జక్కనకవిప్రణీతము | ... | 1 | 4 |
| బసవపురాణము, పిడుపర్తి సోమనాథప్రణీతము | ... | 2 | 4 |
| హంసవింశతి, నారాయణామాత్యప్రణీతము | ... | 0 | 14 |
| వేంకటాచలమాహాత్మ్యము, తరిగొండవెంకమ్మది, చక్కనికూర్పు | ... | 1 | 0 |
| రాజయోగసారము, ద్విపద | ... | 0 | 4 |
| చెన్నబసవపురాణము, పాపకవికృతము | ... | 1 | 2 |
| పంచతంత్రము, నారాయణకవికృతము | ... | 0 | 12 |
| డిటో వెంకటనాథకవి | ... | 1 | 4 |
| సీతారామాంజనేయసంవాదము, సటీక, అనేక నూతనాంశములు చేర్చి చిన్నసైజున ముద్రించినారము. టీక, వివరణము మిక్కిలివిపులము. ఈవఱకు ప్రకటితమైనప్రతులకన్న బాగుగనున్నది | ... | 3 | 8 |
| జైమినిభారతము, అశ్వమేధపర్వము, చక్కనికూర్పు | ... | 1 | 0 |
| నృసింహపురాణము, ఎఱ్ఱాప్రెగడ, క్రొత్తకూర్పు | ... | 0 | 12 |
| వైశ్యపురాణము | ... | 1 | 4 |
| ఉత్తరహరివంశము, నాచన సోమనాథకృతము | ... | 1 | 8 |
| రుక్మాంగదచరిత్ర, ఏకాదశీమాహాత్మ్యము | ... | 0 | 10 |
| బిల్హణీయము, చక్కనికూర్పు | ... | 0 | 8 |
| వైజయంతీవిలాసము ,, | ... | 0 | 8 |
| రుక్మిణీపరిణయము, శుద్ధప్రతి | ... | 0 | 8 |
| రసికజనమనోభిరామము | ... | 0 | 12 |
| రాజశేఖరవిలాసము | ... | 0 | 8 |
| నీతిపద్యసంగ్రహము, సటిప్పణము | ... | 0 | 4 |
| రుక్మిణీకల్యాణము, సటీక, చక్కనిప్రతి | ... | 0 | 8 |

| | | ప్రతి 1-కి రు. | అ. |
|---|---|---|---|
| అంబరీషోపాఖ్యానము, సటీక, (భాగవతము) | ... | 0 | 4 |
| నలోపాఖ్యానము, సటీక, చిన్నసైజు | ... | 0 | 6 |
| కుచేలోపాఖ్యానము, సటీక, (భాగవతము) | ... | 0 | 4 |
| మాతృశతకము | ... | 0 | 1 |
| *సుమతిశతకము, సటీక | ... | 0 | 3 |
| *కుమారీశతకము ,, | ... | 0 | 3 |
| దాశరథీశతకము ,, | ... | 0 | 4 |
| మానసబోధశతకము,, | ... | 0 | 3 |
| *భాస్కరశతకము ,, | ... | 0 | 4 |
| కలువాయిశతకము ,, | ... | 0 | 4 |
| కవిచౌడప్పశతకము | ... | 0 | 2 |
| నృసింహశతకము | ... | 0 | 3 |
| చంద్రశేఖరశతకము | ... | 0 | 2 |
| దేవకీనందనశతకము | ... | 0 | 2 |
| సర్వేశ్వరశతకము | ... | 0 | 2 |
| సంపగిమన్నశతకము | ... | 0 | 2 |
| కృష్ణశతకము | ... | 0 | 2 |
| నారాయణశతకము | ... | 0 | 2 |
| సింహాద్రినారసింహశతకము | ... | 0 | 3 |
| జగన్నాయకశతకము | ... | 0 | 2 |
| ప్రసన్నరాఘవశతకము | ... | 0 | 3 |
| రామరాఘవశతకము | ... | 0 | 2 |
| రామరామశతకము | ... | 0 | 2 |
| రామతారకశతకము | ... | 0 | 4 |
| రామప్రభుశతకము | ... | 0 | 2 |
| భద్రాద్రిరామశతకము, పాపులూరి మల్లనకృతము | ... | 0 | 2 |
| రామలింగేశశతకము, అడిదము సూరకవిది | ... | 0 | 3 |
| కాళహస్తీశ్వరశతకము, ధూర్జటికవిది | ... | 0 | 2 |
| కుక్కుటేశ్వరశతకము, కూచిమంచి తిమ్మకవిది | ... | 0 | 3 |
| కాళహస్తిశతకము, 'సాంబశివామహాప్రభో' | ... | 0 | 2 |
| చిత్తబోధశతకము, తాత్పర్యసహితము | ... | 0 | 3 |
| వేణుగోపాలశతకము | ... | 0 | 4 |
| భోగినీదండకము, బమ్మెర పోతరాజప్రణీతము | ... | 0 | 1 |
| గజేంద్రమోక్షము, సటీక, చక్కనికూర్పు | ... | 0 | 8 |
| భాగవతసప్తమస్కంధము, మూలముమాత్రం | ... | 0 | 6 |

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| సప్తమస్కంధము, సటీక, చిన్నసైజు ... | 1 | 4 |
| వేమనపద్యములు, చక్కనికూర్పు ... | 0 | 6 |
| డిటో 3000 పద్యములు ... | 1 | 12 |
| డిటో తాత్పర్యము ... | 3 | 8 |
| ఆంధ్రనామసంగ్రహము, ఆంధ్రనామశేషము, సాంబనిఘంటువు, టీకానుక్రమణికాసహితము ... | 0 | 12 |
| అనంతుని ఛందస్సు, ఛందోదర్పణము ... | 0 | 14 |
| శ్రీనాథునివీధినాటకము ... | 0 | 2 |
| సులక్షణసారము, సటీక ... | 0 | 10 |
| ఆంధ్రభాషాభూషణము ... | 0 | 2 |
| ఆంధ్రచంద్రాలోకము, సటీక ... | 0 | 8 |
| ఆంధ్రభాషార్ణవము ... | 0 | 12 |
| దసరాపద్యములు ... | 0 | 2 |
| రూపవతి, రాజపుత్రస్త్రీసాహసపుకథ, శ్రీ ఎనమండ్ర నారాయణమూర్తి గారిది ... | 0 | 8 |
| విదురనీతి, సటీక, ఆంధ్రభారతములోనిది ... | 0 | 5 |
| చాటుపద్యమణిమంజరి, క్రొత్తకూర్పు 1-వ భాగము ... | 1 | 4 |
| డిటో 2-వ భాగము ... | 1 | 10 |
| నలచరిత్ర, ద్విపద ... | 0 | 14 |
| హరిశ్చంద్రోపాఖ్యానము, గౌరనమంత్రికృతము ... | 1 | 4 |
| వాశిష్ఠరామాయణము, ద్విపద ... | 1 | 0 |
| ఆంధ్రద్రవిడబాలశిక్ష, అరవ మభ్యసింపదలచు ఆంధ్రులకు మిక్కిలి యుపయోగము ... | 0 | 3 |
| ఆంధ్రకన్నడబాలశిక్ష ... | 0 | 3 |
| హిందీ ఇంగ్లీషుబాలశిక్ష ... | 0 | 4 |
| హిందీ తెలుగుబాలబోధ ... | 0 | 3 |
| అధ్యాత్మ రామాయణకీర్తనలు, చక్కనిప్రతి, చిన్నసైజు ... | 0 | 10 |
| రామదాసుచరిత్ర, చక్కనికూర్పు, మంచికాగితములు, ఇందు శ్రీ రామదాసుగారి ప్రతిమకూడకలదు ... | 0 | 12 |

**బ్రహ్మసూత్రములు తెనుఁగువచనము.**—

శ్రీశంకరులవారి భాష్యము అందఱికిఁ దెలియుట దుర్లభమని తలఁచి చక్కనిశైలిలో అనేకవృత్తుల ననుసరించి తెనుఁగు వ్యాఖ్యానమును ప్రకటించినారము. ... 12 0

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
292, ఎస్ప్లనేడ్, చెన్నపురి. ఈ